శ్రీః

శ్రీహయగ్రీవాయనమః

# శ్రీమద్ధయవదనశతకమ్

**శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితమ్**

**1875-1914**

ప్రేషావ్యాఖ్యా

*(ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ)*

**ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి**

ప్రకాశకులు

**రావి కృష్ణకుమారి**

4-103 ఐ.ఎల్.టి.డి. కాలని ఎక్స్‌టెన్షన్,

**కొత్తపేట-చీరాల-523 157**



## శ్రీమద్ధయవదనశతకమ్

*శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితమ్*

***(1875-1914)***

ప్రేషావ్యాఖ్యా

*(ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యవివరణ)*

**ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి**

ప్రథమ ముద్రణ:- చిత్రభాను ముక్కోటి 14-01-2003

ప్రతులు : 1000

పేజీలు : 120

వెల రూ. : 30-00



4-103, ILTD Colony Extn., Kothapet,

**CHIRALA** - 523 157.

Phone : 08594-34054.

ప్రతులకు :

1. సాధన గ్రంథమండలి, తెనాలి-522 201
2. బెల్లంకొండరామకోటేశ్వరరావు, పమిడిపాడు (వయా) నర్సరావుపేట, గుంటూరు జిల్లా



DTP by

VIKRAM GRAPHICS

Opp. M.R.O. Office

CHIRALA - 523 155

Ph.: 08594 - 37658

Printed at :

**SRI VIJAYALAKSHMI OFFSET**

Naaz Complex

CHIRALA - 523 155

Ph.: 33057, 30357

శ్రీః

# శ్రీహయగ్రీవాయనమః



విద్యామూర్తి మఖణ్డ చన్ద్రవలయ శ్వేతారవిన్దస్థితమ్
హృద్యాభం స్ఫటికాద్రినిర్మలతనుం విద్యోతమానం శ్రియా।
వామాఙ్క స్థిత వల్లభాం ప్రతి సదా వ్యాఖ్యాన్త మామ్నాయవా-
గర్థా నాదిమపూరుషం హయముఖం ధ్యాయామి హంసాత్మకమ్



This book,
**SRIMAT HAYAVADANA SATAKAM,**
**OF SRI BELLAMKONDA RAMARAYA KAVI**
with TELUGU commentary,
**HRESHA VYAKHYA**,
of Mullapudi Viswanatha Sastri,
published with the
financial assistance of
RAVI MOHANA RAO, CHIRALA,
is placed at
the lotus feet of
**SRI RAMAVALLABHA RAYA SWAMY**, Pamidipadu,
NARASARAOPET.

శ్రీః

శ్రీ హయవదనపరబ్రహ్మణే నమః

# శ్రీమద్ధయవదనశతకమ్

**శ్రీ బెల్లంకొండ రామరాయకవి విరచితమ్**

**1875–1914**

ప్రేషా వ్యాఖ్యా

**ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రి**

**– హయగ్రీవ స్వరూప వర్ణన (1,2,3,4)–**

**శ్లో॥ స్వత శ్శ్వేతం మన్దస్మిత రుచి పరీవాహ సుభగం**
**సముద్య ద్డిణ్డీర చ్ఛవి పరివృతం కేసరభరమ్।**
**స్రజాప్తం మల్లీనాం కటి విలసిత క్షౌమరుచిరం**
**తత శ్రీఖణ్డామ్బుం హయవదన మిన్దుస్థిత మయే॥** **1**

**ప్రతిపదార్థము:–** స్వతః=సహజముగానే, శ్వేతమ్=తెల్లని రంగు కలవాడును, మన్దస్మిత ... సుభగమ్–మన్దస్మితరుచి=చిఱునవ్వుల కాన్తుల యొక్క, పరీవాహ= ప్రవాహముల చేత, సుభగమ్=అందమైన వాడును, సముద్య...పరివృతమ్– సముద్యత్ =ఆవిర్భవించు చున్న, డిణ్డీర=నురగ యొక్క, ఛవి=కాన్తితో, పరివృతమ్= కూడు కొనిన వాడను, కేసరభరమ్=జూలుతో కూడుకొనినవాడును, మల్లీనామ్= మల్లె పూవుల యొక్క, స్రజా=మాలలతో, ఆప్తమ్=కూడుకొనిన వాడును, కటి... రుచిరమ్–కటివిలసిత=కటిప్రదేశమునందు విరాజిల్లుచున్న, క్షౌమ=తెల్లని వస్త్రముతో, రుచిరమ్=మనోహర మైనవాడును, తత శ్రీఖణ్డామ్బుమ్– తత= వ్యాపించిన, శ్రీఖణ్డామ్బుమ్=చందనరసము కలవాడును, ఇన్దుస్థితమ్= చన్ద్రుని యందు ఉన్న వాడును అగు, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము:–** హయగ్రీవుడు సహజముగనే తెల్లనైనవాడు. తన తెల్లనైన చిఱు



నవ్వులతో మరింత తెల్లగా భాసించుచున్నాడు. ఆయన గుఱ్ఱపు ముఖము కలవాడగుటచే గుఱ్ఱపునోటి నుండి వచ్చు తెల్లని నురగతో మఱికొంచెము తెల్లగా ప్రకాశించుచున్నాడు. ఆయన శిరస్సునందు గల తెల్లని జూలుతో మఱింత తెల్లగ ప్రకాశించుచున్నాడు. ఆపై తెల్లని మల్లెపూల మాలలను ధరించియుండుటచే వాటి తెలుపు కూడ కలసినది. కటి ప్రదేశమునందు తెల్లని వస్త్రము ధరించియుండుటచే ఇంకను తెలుపుదనము అధికమైనది. పైగా శరీరమునందు అంతటను తెల్లని చందన రసము పూసికొనినాడు. ఈవిధముగా అత్యన్తము తెల్లగానున్న హయగ్రీవుని నివాసము కూడ తెల్లని చన్ద్రమండలము. ఇంక హయగ్రీవుని తెల్లని శోభను ఏమని వర్ణించగలము! అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–**

1. ఈ హయవదన శతకమునందు మకుటము 'హయవదన మిన్దుస్థిత మయే'. 'చన్ద్రమణ్డలమునందు ఉన్నటువంటి హయగ్రీవుని నేను పొందుచున్నాను' అని ఆ మకుటమునకు అర్థము. 'వన్దే పూరిత చన్ద్రమణ్డలగతమ్' ఇత్యాది హయగ్రీవ ధ్యానశ్లోకములలో హయగ్రీవుడు చన్ద్రమణ్డలమునందు ఉండునని ప్రతిపాదించుటచే హయగ్రీవుడు చన్ద్రమణ్డలమునందుండుట ప్రసిద్ధము.

2. అద్వైత మతమునందు ఉపాసకుడు ఉపాస్యమగు దైవముతో తాదాత్మ్యము చెందుటయే చిట్టచివరి సోపానము. అదియే మోక్షము. ఉత్తమాధికారికే ఇది సాధ్యము. జీవన్ముక్తులగు శ్రీ బెల్లంకొండ రామారావు గారు ఈ హయవదన శతకములోని మకుటమునందు పలికిన 'హయవదన మిన్దుస్థిత మయే' అను వాక్యమునకు హయగ్రీవుని (నేను) తాదాత్మ్యముగ పొందుచున్నాను. ఆ దేవునిలో ఐక్యము అగుచున్నాను అనియే అర్థము. కేవలము హయగ్రీవోపాసన చేతనే హయగ్రీవుని సాక్షాత్కారము చేసికొని, ఆ దేవుని అనుగ్రహము వలన సకల విద్యలను పొంది ఆయనలో ఐక్యము అయిన శ్రీ రామారావు గారు మాత్రమే ఆ విధముగా అనుటకు సమర్థులు. అందువలననే శ్రీరామారావు గారు వారు రచించిన అనేక గ్రన్థములను వారు వ్రాసినట్లుగా కాక హయగ్రీవుడే తన ద్వారా రచించెను అని చెప్పికొనిరి. ఇది సంపూర్ణముగ వాస్తవము. అందువలననే శ్రీ బెల్లంకొండ రామారావు గారు వ్రాసిన ప్రతి వాక్యమును హయగ్రీవుడే వ్రాసినట్లుగా

మనము భావించు కొనవలెను. ఆయన గ్రంథములు వేదముతో సమానమైనవి. ఆయన వాక్యములు మన్త్రములు. అందువలన శ్రీ బెల్లంకొండ రామారావు గారు వ్రాసిన హయవదన శతకమును నిత్యము పారాయణ చేసిన వారికి తప్పక హయగ్రీవుని అనుగ్రహమున జ్ఞానము, మోక్షము కలుగును అని నా ప్రగాఢ విశ్వాసము. 'హయవదన మిన్దుస్థిత మయే' అను మకుటమునకు 'చన్ద్రమణ్డలము నందు ఉన్న హయగ్రీవుని (నేను) శరణుపొందుచున్నాను' అని కూడ అర్థము వచ్చును. ఆ అర్థమును కూడ శ్రీ రామారావు గారు కొన్ని కొన్ని చోట్ల వారు వ్రాసిన వ్యాఖ్యానము నందు చెప్పిరి. కావున పాఠకులు వారికి తోచినట్లుగ ఏదియో ఒక అర్థమును తీసికొని ప్రతి శ్లోకము చివర దానిని స్మరించకొనుచూ చదువుకొన గలరు.

3. హయగ్రీవుడు తెల్లని కాన్తి కలిగినవాడు. మల్లెపూలు మొదలుగా కల తెల్లపూలను తెల్లనివైన ముత్యముల హారములను ఇష్టపడి ధరించువాడు. తెల్లని చందన రసమును పూసికొను దేవత. తెల్లని చన్ద్రమండలమునందు నివసించువాడు. ఈ విషయము ఈ శ్లోకమునందు వర్ణింపబడినది. జ్ఞానప్రదాతయగు దేవుడు తెల్లగానుండుట, తెల్లనికాన్తిగల వస్తువులను ఇష్టపడుట సహజమే. సరస్వతి కూడ తెల్లనిదే కదా!

**శ్లో॥ పయస్తారా క్షీరామృత ముకుర కర్పూర హిమరుఙ్**
**మరాల బ్రహ్మాణీ రజత శరదబ్దేశ్వర సుధాః।**
**శరన్మల్లీ క్షౌమామ్బర రదన హీరాఙ్కుర ముఖాః**
**కటాక్షా ద్యస్యాసన్ హయవదన మిన్దుస్థిత మయే॥ 2**

**ప్రతిపదార్థము:–** పయ...సుధాః–పయః= వర్షపునీరు, తారా=ముత్యములు, క్షీర= పాలు, అమృత=అమృతము, ముకుర=అద్దము, కర్పూర=కర్పూరము, హిమరుక్= చంద్రుడు, మరాల=రాజహంస, బ్రహ్మాణీ= సరస్వతీదేవి, రజత=వెండి, శరదబ్ద= శరత్కాలపు మేఘము, ఈశ్వర=శివుడు, సుధాః=సున్నము, శరన్మల్లీ...ముఖాః – శరత్=శరదృతువు, మల్లీ=మల్లెపూలు, క్షౌమామ్బర= తెల్లని వస్త్రము, రదన= దంతము, హీరాఙ్కుర ముఖాః=వజ్రము మొదలుగా కల తెల్లని వస్తువులు, యస్య=ఏ హయగ్రీవుని యొక్క, కటాక్షాత్=అనుగ్రహ దృష్టితో, ఆసన్=పుట్టినవో, తమ్=



అటువంటి, ఇన్దుస్థితమ్= చన్ద్రమణ్డలమునందు ఉన్న, హయవదనమ్= హయ గ్రీవుని, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** లోకమునందు తెల్లని వస్తువులుగా ప్రసిద్ధములైన వర్షపునీరు, ముత్యములు, పాలు, అమృతము, అద్దము, కర్పూరము, చంద్రుడు, రాజహంస, సరస్వతి, వెండి, శరత్కాలపు మేఘము, శివుడు, సున్నము, శరదృతువు (శరదృతువు నందు వెన్నెల బాగుగ కాయును. కాన శరదృతువు తెల్లనిదిగా ప్రసిద్ధము) మల్లెపూలు, తెల్లని వస్త్రము, దంతము, వజ్రము మొదలైనవి అన్నియును ఏ హయగ్రీవుని అనుగ్రహ దృష్టితో ఏర్పడినవో అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–** హయగ్రీవుడు పుణ్డరీకాక్షుడు. అనగా తెల్లని పద్మమువంటి కన్నులు కలవాడు. కన్నులు తెల్లని పద్మము వంటివి అగుటచే అట్టి కన్నుల నుండి వచ్చు చూపులు తెల్లనివియే అగును. కనుకనే ఆ తెల్లని చూపులనుండి పైన చెప్పిన తెల్లని వస్తువులన్నియును పుట్టినవి అని కవి అభిప్రాయము. వాస్తవమునకు హయగ్రీవుడు సర్వేశ్వరుడు కావున సమస్త వస్తువులు ఆయన అనుగ్రహ దృష్టినుండియే పుట్టినవి. అయినప్పటికి హయగ్రీవుడు తెల్లని దైవము అగుట చేతను, ఆయన కన్నులు కూడ తెల్లని పద్మములను పోలియుండుట చేతను తెల్లని వస్తువులన్నియు ఆయన నుండియే పుట్టినట్లుగా ప్రకృత శ్లోకమునందు కవి చమత్కరించుచున్నాడు.

**శ్లో॥ స్వతో మూర్తం శ్వేతం తను మధిగతం చామృతరసం**
**యశో దేహీభూతం స్మిత మివ పరీపాకరమణమ్।**
**పరం సత్త్వం చావిర్గత మధిగతాకార మమలం**
**మణిం హీరం భాన్తం హయవదన మిన్దుస్థిత మయే॥ 3**

**ప్రతిపదార్థము:–** స్వతః=సహజముగనే, మూర్తమ్=మూర్తీభవించిన, శ్వేతమ్=తెల్లని రంగు, ఇవ=వలె, తనుమ్=శరీరమును, అధిగతమ్=పొందినటువంటి, అమృతరసం ఇవ=అమృతరసము వలె, దేహీభూతమ్=రూపు దాల్చిన, యశః ఇవ=కీర్తి వలె, పరీపాక=పరిణామముచేత, రమణమ్=మనోహరమైన, స్మితం ఇవ=చిరునగవు వలె, ఆవిర్గతమ్=కనులకు ప్రత్యక్షమైన, పరమ్=శుద్ధమైనది యగు, సత్త్వం ఇవ=

సత్త్వ గుణమువలె, అధిగతాకారమ్=ఆకారమును పొందిన, అమలమ్=స్వచ్ఛమైన, హీరం మణిం ఇవ=వజ్రమణి వలె, భాన్తమ్=ప్రకాశించు చున్నటువంటి, ఇన్దుస్థితమ్ = చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్= నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీవు మూర్తీభవించిన తెలుపు రంగువలె ఉన్నావు. అట్లే ఆకారమును పొందిన అమృతరసము వలె నున్నావు. శరీరమును ధరించిన కీర్తి వలె ప్రకాశించుచున్నావు. కనులకు గోచరమైన సత్త్వగుణము వలె నున్నావు. హయగ్రీవుని ఆకారమును పొందిన స్వచ్ఛమైన వజ్రము వలె నున్నావు. ఈ విధముగా విరాజిల్లునట్టి నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ సచిత్తం వా శుద్ధస్ఫటికమణి భూమీధరవరం**
**ప్రతప్త శ్రీ హీరద్రవ మివ ఘనీభూత మమలమ్।**
**సరూపం వానన్దం గుణనికర మాహో! తనుధరం**
**విభాన్తం శ్రీమన్తం హయవదన మిన్దుస్థిత మయే॥ 4**

**ప్రతిపదార్థము:–** సచిత్తమ్=సచేతనమగు, శుద్ధ స్ఫటిక మణి భూమీధరవరమ్–శుద్ధ =స్వచ్ఛమైన, స్ఫటికమణి=స్ఫటిక మణిమయమైన, భూమీధరవరమ్=పర్వత శ్రేష్ఠము, వా=వలె, అమలమ్=స్వచ్ఛమైనదియును, ఘనీభూతమ్=గడ్డ కట్టు కొన్నదియును అగు, ప్రతప్త శ్రీ హీరద్రవమ్=బాగుగ కాగిన వజ్రముల ద్రవము, ఇవ=వలె, సరూపమ్=రూపమును ధరించిన, ఆనందమ్=ఆనందము, వా=వలె, ఆహో!=ఆహా, తనుధరమ్=శరీరమును ధరించిన, గుణనికరమ్= సద్గుణ సమూహము, వా=వలె, విభాన్తమ్=ప్రకాశించుచున్న, శ్రీమంతమ్=లక్ష్మీ సమన్వితుడైన, ఇన్దుస్థితమ్= చంద్రుని యందు ఉన్నటువంటి, హయవదనమ్= హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! శుద్ధ స్ఫటికమణులతో నిర్మితమైన పర్వతశ్రేష్ఠమునకు ప్రాణము కూడ ఉండిన ఎట్లుండునో అంత తెల్లగా నీవు ఉన్నావు. స్వచ్ఛమైన వజ్రములను బాగుగా కాచగా వచ్చు ద్రవముతో పోతపోసిన ఎట్లుండునో అంత తెల్లగా మెరయు చున్నావు. రూపు దాల్చిన ఆనందనమువలె నున్నావు. శరీరమును ధరించిన సద్గుణ సముదాయము వలె నున్నావు. ఆ విధముగ ప్రకాశించుచున్న



చన్ద్రమణ్డలవాసియగు లక్ష్మీసమన్వితుడైన హయగ్రీవుని నేను శరణు పొందు చున్నాను.

**విశేషము:–** శుద్ధ స్ఫటికమణి పర్వతము కేవలము కవి కల్పితము. కాన దానివలె నున్నావు అనునది కల్పితోపమాలంకారము. అట్లే వజ్రములను కరిగించిన ద్రవముగ మారదు. ఒకవేళ ద్రవముగా మార్చి తదనంతరము పోతపోయుట అనునది కూడ కవి కల్పితము. కనుక కల్పితోపమాలంకారము. ఇట్లే రూపముగల ఆనందము, శరీరమును ధరించిన సద్గుణసముదాయము కూడ కవి కల్పితములు.

**– హయగ్రీవుని కాంతి వర్ణన (5,6,7,8,9,10) –**

**శ్లో॥ యదీయచ్ఛాయాభి ర్ధవళితతమేఽ ముత్ర భువనే**
**క్వచి ద్దుగ్ధామ్భోధిః క్వచిదపి హిమాద్రిః క్వ చ వృషః।**
**క్వచి త్కైలాసాద్రిః క్వచన సురరాడ్వాహన మహో**
**విలీన స్తం దేవం హయవదన మిన్దుస్థిత మయే॥ 5**

**ప్రతిపదార్థము:–** యదీయచ్ఛాయాభిః–యదీయ=ఏ హయగ్రీవుని యొక్క, ఛాయాభిః =తెల్లని కాంతులచేత, అముత్ర=ఈ కనుబడుచున్న, భువనే=లోకము, ధవళితతమే= బాగుగ తెల్లనైనది అగుచుండగా, దుగ్ధామ్భోధిః=పాలసముద్రము, క్వచిత్=ఒకచోట, హిమాద్రిః=మంచుకొండ, క్వచిత్ అపి=మరియొక చోట, వృషః=శివుని వాహనమగు నంది,క్వ చ=వేరొక చోట, కైలాసాద్రిః=వెండికొండ, క్వచిత్=ఇంకొక చోట, సురరా డ్వాహనమ్=దేవేంద్రుని వాహనమగు ఐరావతము, క్వచన=వేరొకచోట, విలీనః =మరుగున పడిపోయినవో!, అహో=ఎంత ఆశ్చర్యము!, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు ఉన్నటువంటి, తమ్=అటువంటి, హయవదనం దేవమ్=హయగ్రీవ దేవుని, అహమ్ =నేను, అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** హయగ్రీవుడు చాల తెల్లనైన దైవము. అందువలననే ఆయన తెల్లని కాంతులతో ఈ కనుబడు లోకమంతయు నిండిపోగా, ఒకచోట తెల్లనైన పాల సముద్రము, మరొక చోట తెల్లనైన హిమవత్పర్వతము, వేరొక చోట శివుని వాహనమగు తెల్లని నంది, ఇంకొక చోట తెల్లని వెండి కొండ, మరియొక చోట తెల్లని ఐరావతము మరుగున పడి పోయినవి. అటువంటి హయగ్రీవ దేవుని నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ త్వదీయచ్ఛాయాయాం సురనగరమీనా శ్చ విలుఠ**
**న్త్యజః పాద్మో బద్ధాఞ్జలి రపి చ సర్పా స్సహఫణాః।**
**మిళిత్వేహ ద్వౌ ద్వౌ సలలిత మివోదేత్యపి సుధా**
**రమానాథ! త్వాం తం హయవదన మిన్దుస్థిత మయే॥ 6**

**ప్రతిపదార్థము:–** హే రమానాథ!=ఓ లక్ష్మీపతీ!, త్వదీయచ్ఛాయాయామ్=నీ తెల్లని కాంతి యందు, సురనగర=అమరావతీ నగరమునందు ఉన్న, మీనాశ్చ=(రంభాదుల యొక్క నేత్రములు అనెడి) చేపలు, విలుఠన్తి=తిరుగాడుచున్నవి, పాద్మః=పద్మ సంభవుడైన, అజః అపి=బ్రహ్మదేవుడు సైతము, బద్ధాఞ్జలిః=అంజలి ఘటించిన వాడై, భాతి=ప్రకాశించుచున్నాడు, ఇహ=ఈ నీ తెల్లని కాంతియందు, సహఫణాః =పడగలు కలిపిన వారై, సర్పాః=వాసుకి మొదలగు సర్పములు, ద్వౌ ద్వౌ=జంటలు జంటలుగా, భాన్తి=ప్రకాశించుచున్నవి, సుధా అపి=అమృతము కూడ, ఉదేతి=పుట్టు చున్నది, ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్నటు వంటి, హయవదనమ్=గుఱ్ఱపు ముఖము కల, తం త్వామ్=అట్టి నిన్ను, అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ లక్ష్మీపతీ! నీ ధవళ కాంతి పాలసముద్రము వలె నున్నది. దీని యందును రంభాది దేవకాంతల విలాస నేత్రములు మీనములైనవి. ఎదురుగా అంజలి ఘటించియున్న బ్రహ్మ పాలసముద్రములోని నాభి పద్మ బ్రహ్మ ఐనాడు. ఎదురుగా అంజలి ఘటించి నిలబడిన ముక్కోటి దేవతల నమస్కార హస్తములు పాలసముద్రము వద్ద పాతాళమునందున్న సర్పరాజుల పడగలవలె నున్నవి. ఇట్లు క్షీరసముద్రమును తలదన్ను శరీరశోభ కల దేవా! నిన్ను నేను శరణు పొందు చున్నాను.

**విశేషములు:–** హయగ్రీవుని కాంతి పాలసముద్రము. ఈ భావనతో కవి పాల సముద్రమునకు ఉండవలసిన మూడు విషయములను రూపకాతిశయోక్తి ద్వారా సాధించుచున్నాడు. పాల సముద్రమునందు చేపలు ఉండవలెను. ఆ లెక్కన ఈ పాలసముద్రమునందు (హయగ్రీవ కాన్తియందు) రమ్భ మొదలుగాగల అప్సరసల నేత్రములు అనెడి మీనములు కలవు. అనగా హయగ్రీవ శోభను చూసి నృత్యము చేయుచున్నవారి నేత్రములే మీనములుగా కవి వర్ణించినాడు. పాలసముద్రము నందు బ్రహ్మ విష్ణునాభిపద్మమున ఉండును. ఈ కాంతి సముద్రమున ఎదురుగా



అంజలి ఘటించిన బ్రహ్మ కలడు. పాలసముద్రము వద్ద క్రిందుగా వాసుకి మొదలగు సర్పరాజులు ఉండెదరు. ఈ కాంతి సముద్రము ముందర అంజలులు ఘటించిన ముక్కోటి దేవతలు కలరు. ఇచట వారి బాహువులు జంట సర్పములుగను, దోసిలి పట్టిన చేతులు కలిసిన పడగలుగను కవి అతిశయోక్తి రూపముగ చెప్పినాడు.

**శ్లో॥ త్వదీయచ్ఛాయాతో భవతి హిమరుజ్మణ్డల మిదం**
**ధియా నిర్మథ్యైనాం భజతి పురుషః కౌస్తుభమణిమ్।**
**అముష్యా ఉద్భూతం పిబతి యది మర్త్యోఽమృతరసం**
**భవే ద్విష్ణు స్తం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 7**

**ప్రతిపదార్థము:–** ఇదమ్=ఈ, హిమరుజ్మండలమ్=చంద్రబింబము, త్వదీయ=నీ యొక్క, ఛాయాతః=కాంతి నుండి, భవతి=పుట్టు చున్నది, పురుషః=ధ్యానము చేసెడి పురుషుడు, ధియా=తన యొక్క బుద్ధిచేత, ఏనామ్=ఈ కాంతిని, నిర్మథ్య=మథించి (అనగా ధ్యానించి) కౌస్తుభమణిమ్=విష్ణువు ధరించెడి కౌస్తుభము అను మణిని, భజతి=పొందుచున్నాడు, అముష్యాః=ఈ విధముగా బుద్ధిచేత మథించబడు కాంతి నుండి, ఉద్భూతమ్=పుట్టినటువంటి, అమృత రసమ్=ఆనందమనెడి అమృతమును, మర్త్యః=మనుష్యుడు, యది పిబతి=త్రాగిన యెడల, విష్ణుః=విష్ణువు, భవేత్=అగును, తమ్=అటువంటి తెల్లని కాంతి కలవాడవును, ఇందుస్థితమ్=చన్ద్రునియందు ఉన్న వాడవును, హయవదనమ్=అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్= నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ కాంతినుండియే ఈ చంద్రుడు పుట్టుచున్నాడు. (హయగ్రీవుని తెల్లని కాంతియే పాలసముద్రము అని కవి ఆశయము) నీ కాంతిని బుద్ధితో ఎవరు మథించెదరో వారు కౌస్తుభమణిని పొందెదరు (హయగ్రీవుని యొక్క తెల్లని కాంతిని బుద్ధియందు ఉంచుకొని నిరంతరము ధ్యానించువారు విష్ణు స్వరూపులు అగుదురు. అనగా విష్ణువుతో సమానమైన రూపమును పొందుదురు. కావున విష్ణువువలె కౌస్తుభమణిని పొందెదరు అని భావము.) ఈ విధముగ మథించినపుడు కలిగెడు ఆనందము అనెడి అమృతమును త్రాగిన మనుజులు విష్ణుస్వరూపులు అగుదురు. అనగా సాక్షాత్తుగా విష్ణువే అగుదురు. ఇట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–** ముక్తి రెండు విధములు. 1) సారూప్యముక్తి, 2) సాయుజ్యముక్తి. సారూప్యముక్తి అనగా విష్ణువుతో సమానమైన రూపమును పొందుట. సాయుజ్య ముక్తి అనగా విష్ణువులో ఐక్యమగుట. ఈ శ్లోకములో ప్రథమార్ధమునందు సారూప్య ముక్తి వర్ణించబడినది. ద్వితీయార్ధము నందు సాయుజ్యముక్తి వర్ణించబడినది.

**శ్లో॥ అహో! సిష్ణాసన్త్యఖిలవిబుధా స్త్వద్రుచిభరే**
**పిపాసన్తి జ్యోత్స్నాచరణపతగా నిర్భరరసమ్।**
**ఇమే తిష్ఠాసన్త్యహిపతిముఖా నిత్యవిబుధాః**
**విభాపద్మేశ ! త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 8**

**ప్రతిపదార్థము**:– హే విభాపద్మ!=ఓ కాన్తినిధీ!, హే ఈశ!=ఓ ప్రభూ, హయగ్రీవా!, అహో!=ఎంత చిత్రము, అఖిలాః=సమస్తములైన, విబుధాః=దేవతలు, త్వద్రుచిభరే= నీ యొక్క కాన్తి సమూహమునందు, సిష్ణాసన్తి=స్నానము చేయవలెనని కోరుకొను చున్నారు, జ్యోత్స్నాచరణ పతగాః=వెన్నెలను తినెడి చకోర పక్షులు, నిర్భరరసమ్= గొప్ప ఆనందము కలుగునట్లుగా, పిపాసన్తి=నీ కాంతిని త్రాగవలెనని కోరుకొను చున్నవి, ఇమే=ఈ, అహిపతిముఖాః=ఆదిశేషుడు మొదలుగా కల, నిత్య విబుధాః =నిత్య సన్నిహితులగు దేవతలు(నిత్యసూరులు అని వైష్ణవ సంప్రదాయము), తిష్ఠాసన్తి =నీ కాన్తి సమీపమునందు నిలుచుని యుండుటకు కోరుకొను చున్నారు. ఇన్దుస్థితమ్ =చన్ద్రుని యందు ఉన్నటువంటి, హయవదనమ్=గుఱ్ఱపు ముఖము కలిగినటు వంటి, త్వామ్=నిన్ను,(అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ కాన్తినిధీ! ప్రభూ! హయగ్రీవా! అన్నియును తెలిసిన దేవతలు సైతము నీ తెల్లని కాంతిని చూచి గంగా ప్రవాహమని భ్రమపడి అందు స్నానము చేయవలెనని కోరుకొనుచున్నారు. వెన్నెలను త్రాగు స్వభావము కల చకోర పక్షులు నీ తెల్లని కాంతిని వెన్నెల అని భ్రమపడి దానిని త్రాగవలెనని కోరుకొనుచున్నవి. ఆదిశేషుడు మొదలుగా కల నిత్య సన్నిహితులగు దేవతలు నీ తెల్లని కాంతిని పాలసముద్రమని భ్రమపడి దాని సమీపమునందు నిలుచొని యుండవలెనని కోరుకొనుచున్నారు.

ఈ విధముగ అందరకును భ్రమను కలుగజేయునట్టి గొప్ప తెల్లని కాంతి కల నిన్ను నేను శరణు పొందుచున్నాను.



**శ్లో॥ ఇమాం వస్తుం వాఞ్ఛన్త్యమరవనితా లేపయితు మ**
**ప్యహో ధర్తుం పాతుం ప్రతికృతి మథాలోకితు మిహ।**
**తథా స్నాతుం స్థాతుం ముఖపరిమలేఽమూం కలయితుం**
**రుచిం తే శ్రీమన్! త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 9**

**ప్రతిపదార్థము:–** శ్రీమన్!=లక్ష్మీ సమన్వితుడవైన ఓ హయగ్రీవా!, తే=నీ యొక్క, ఇమామ్=ఈ, రుచిమ్=కాంతిని, అమరవనితాః=స్వర్గలోకములోని స్త్రీలు, వస్తుమ్= నితంబ వస్త్రముగ ధరించుటకు, వాఞ్ఛన్తి=కోరుకొనుచున్నారు (తథా=అట్లే) లేపయితుం అపి=(చందనము అనెడి భ్రాన్తితో) శరీరమునందు పూసికొనుటకు కూడ, వాఞ్ఛన్తి=కోరుకొనుచున్నారు, అహో!=ఎంత ఆశ్చర్యము, ధర్తుమ్= (మల్లె పూలు అనెడి భ్రాంతితో) ధరించుటకు, వాఞ్ఛన్తి=కోరుకొనుచున్నారు, పాతుమ్= (అమృతమనెడి భ్రాంతితో) త్రాగుటకు, వాఞ్ఛన్తి=కోరుకొనుచున్నారు, అథ= అనంతరము, ఇహ=నీ కాంతియందు, ప్రతికృతిమ్=తమ ప్రతిబింబమును, ఆలోకితుమ్=(అద్దము అనెడి భ్రాంతితో) చూచుకొనుటకు, వాఞ్ఛన్తి=కోరుకొను చున్నారు, స్నాతుమ్=(గంగ అనెడి భ్రాంతితో) స్నానము చేయుటకు, వాఞ్ఛన్తి= కోరుకొనుచున్నారు, స్థాతుమ్=(భవనము అనెడి భ్రాంతితో) నివసించుటకు, వాఞ్ఛన్తి=కోరుకొనుచున్నారు, అమూమ్=ఈ నీకాంతిని, ముఖపరిమలే= ముఖము నకు పరిమళమును కలిగించు తాంబూలమునందు, కలయితుమ్= (ముత్యముల చూర్ణము అనెడి భ్రాంతితో) వేసికొనుటకు, వాఞ్ఛన్తి=కోరుకొనుచున్నారు, ఇన్దు స్థితమ్=చంద్రుని యందు ఉన్నటువంటి, హయవదనమ్=గుఱ్ఱపు ముఖము కలిగి నటువంటి,త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** లక్ష్మీసమన్వితుడవైన ఓ హయగ్రీవా! నీ తెల్లని కాంతి స్వర్గలోకము నందులి స్త్రీలకు సైతము బహువిధములుగ భ్రమను కలుగజేయుచున్నది. అందువలననే వారు నీ కాంతిని తెల్లని వస్త్రమని భ్రమపడి ధరింపగోరుచున్నారు. చందన మనెడి భ్రమతో శరీరమునందు పూసికొనకోరుచున్నారు. మల్లెపూలనెడి భ్రమతో ధరింపగోరుచున్నారు. అమృతమనెడి భ్రాంతితో త్రాగగోరుచున్నారు. అద్దము అనెడి భ్రాంతితో నీ తెల్లని కాంతి యందు తమ ప్రతిబింబమును చూడగోరు చున్నారు. గంగానది యనెడి భ్రాంతితో అందు స్నానమాడ గోరుచున్నారు. తెల్లని

భవనమనెడి భ్రాంతితో అందు నివసించవలెనని కోరుచున్నారు. ముత్యముల పొడి అనెడి భ్రాంతితో లేదా సున్నము అనెడి భ్రాంతితో తాంబూలమునందు కలుపుకొన గోరుచున్నారు. ఈ విధముగ దేవతాస్త్రీలకు కూడ భ్రాంతిని కలిగించు తెల్లని కాంతి కల హయగ్రీవా! చంద్రునియందు నివసించు నిన్ను నేను శరణు పొందు చున్నాను.

**శ్లో॥ రుచి స్తే పాతాళే ఫణిపతిమిషా ద్భాతి ధరణౌ**
**పయోఽమ్భోధి వ్యాజా ద్దివి సురనదీ దమ్భత ఇయమ్।**
**ద్యుభూమ్యన్త శ్చన్ద్రచ్ఛలత ఇతి లోకత్రయ మభి**
**ప్రవృత్తా విష్ణో! శ్రీ హయవదన మిన్దుస్థిత మయే॥ 10**

**ప్రతిపదార్థము:–** హే విష్ణో!=ఓ విష్ణుమూర్తీ!, తే=నీ యొక్క, రుచిః=కాంతి, పాతాళే=పాతాళలోకమునందు, ఫణిపతి మిషాత్=ఆదిశేషుడుగా, భాతి= ప్రకాశించు చున్నది, ధరణౌ=భూలోకమునందు, పయోఽమ్భోధి వ్యాజాత్=పాల సముద్రము అను నెపమున, భాతి=ప్రకాశించుచున్నది, ఇయమ్=ఈ నీ కాంతి, దివి=స్వర్గ లోకమునందు, సురనదీ దంభతః=గంగానది అను పేరున, భాతి= ప్రకాశించు చున్నది, ద్యుభూమ్యన్తః=భూమ్యాకాశముల నడుమ, చన్ద్రచ్ఛలతః= చంద్రుడు అను నెపమున, భాతి=ప్రకాశించుచున్నది, ఇతి=ఈ విధముగా, లోక త్రయమ్=మూడు లోకములను, అభిప్రవృత్తా=వ్యాపించి ఉన్నది, ఇందుస్థితమ్= చంద్రునియందు ఉన్నటువంటి, శ్రీహయవదనమ్=లక్ష్మీదేవితో కూడిన హయ గ్రీవుని, అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ విష్ణుమూర్తీ! నీవు సర్వ వ్యాపకుడవు. అందువలననే నీ కాంతి కూడ మూడు లోకములందును వ్యాపించినదియై పాతాళలోకమునందు తెల్లని ఆదిశేషుడు అనుపేరున ప్రకాశించుచున్నది. భూలోకమున పాలసముద్రము అను పేరున శోభిల్లుచున్నది. స్వర్గలోకమునందు గంగానది అనుపేరున విరాజిల్లు చున్నది. భూమ్యాకాశముల నడుమ చంద్రుడు అను పేరున భాసించుచున్నది.

ఈ విధముగ ముల్లోకములందును వ్యాపించిన కాంతి కలిగినటువంటి ఓ హయగ్రీవదేవా! చంద్రుని యందు ఉన్నటువంటి నిన్ను నేను శరణు పొందు చున్నాను.



**– లక్ష్మీ వర్ణన (11,12,13) –**

**శ్లో॥ ఇయం తే వామాఙ్కే లసతి కమలా కిం కిము తటి**
**ల్లతా కిం సౌవర్ణీ హిమరుచికలా కి న్న్వథ నవా।**
**మరీచి స్సౌరీ కిం కిము మురరిపో! విద్రుమలతా–**
**నయా సన్దీప్తం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 11**

**ప్రతిపదార్థము:–** మురరిపో!=ఓ మురారీ!, తే=నీ యొక్క, వామాంకే=ఎడమ తొడ యందు, (యా=ఎవతె ఐతే), లసతి=విరాజిల్లుచున్నదో, (సా) ఇయమ్=అట్టి ఈమె, కమలా కిమ్?=లక్ష్మీదేవియా?, తటిత్ కిము=మెరుపా?, సౌవర్ణీ= బంగారముతో చేయబడిన, లతా కిమ్=తీగయా?, అథ=లేక, నవా=నూతనమగు, హిమరుచి కలా కిం ను?=చంద్రకళయా?, సౌరీ=సూర్యునికి సంబంధించిన, మరీచిః కిమ్?=కిరణమా?, విద్రుమలతా కిము?=పగడపుతీగయా? అనయా=ఈమె చేత, సందీప్తమ్=బాగుగ వెలుగొందుచున్న, ఇందుస్థితమ్=చంద్రునియందు ఉన్న, హయవదనమ్=గుఱ్ఱపు ముఖము కలిగిన, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ ఎడమ తొడయందు ఎర్రగా విరాజిల్లుచున్న ఈమె ఎవరు? లక్ష్మీదేవియా? మెరుపు తీగయా? బంగారు తీగయా? అపుడే ఉదయించిన చంద్రుని కళయా? (అప్పుడే ఉదయించిన చంద్రుడు ఎరుపురంగులో ఉండును. అందువలన చంద్రునకు ఆ విశేషణము చెప్పబడినది) లేక సూర్యుని కిరణమా? లేక పగడముల తీగయా? అని పలు విధముల సందేహము కలుగు చున్నది. సరే! ఎవరైన నేమి? ఈమెతో నీవు మాత్రము బాగుగ ప్రకాశించుచున్నావు. అటువంటి నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ విభో! దాసేరాణాం త్వయి భవతి యా రాగలహరీ**
**త్వదిచ్ఛాత స్సేయం విలసతి సురూపాకృతి రిహ।**
**ఇదం సంశ్లిష్ట స్త్వం క్షిపసి తటిదాలిఙ్గితశర**
**త్పయోదం త్వా మీశం హయవదన మిన్దుస్థిత మయే॥ 12**

**ప్రతిపదార్థము:–** విభో!=ఓ ప్రభూ! హయగ్రీవా!, త్వయి=నీ యందు, దాసేరాణామ్= దాసులకు, యా=ఏ, రాగలహరీ=అనురాగలహరి, భవతి=కలదో, సా ఇయమ్=

ఆ ఈ అనురాగలహరియే, త్వదిచ్ఛాతః=నీ సంకల్పవశమున, ఇహ=నీ ఎడుమ తొడ యందు, సురూపాకృతిః=మంచి అందము కలిగిన ఆకారము కలిగినదిగా (లక్ష్మీదేవిగా), విలసతి=విరాజిల్లుచున్నది, ఇదం సంశ్లిష్టః=ఈ లక్ష్మీదేవితో కూడుకొనియున్న, త్వమ్=నీవు, తటిత్=మెరుపుతో, ఆలింగిత= ఆలింగనము చేసికొనబడిన, శరత్పయోదమ్=శరత్కాలపు మేఘమును, క్షిపసి= తిరస్కరించు చున్నావు, ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్నటువంటి, హయవదనమ్ =గుఱ్ఱపు ముఖము కలిగినటువంటి, ఈశమ్=ప్రభువైనటువంటి, త్వామ్=(అటువంటి) నిన్ను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ ప్రభూ! హయగ్రీవా! నీయందు నీ భక్తజనులకు గల అనురాగము నీ సంకల్పవశముచే సుందరాకారము కల స్త్రీగా మారి (లక్ష్మీదేవిగా మారి) నీ వామాంకమునందు విలసిల్లుచున్నది. ఆమె ఎఱ్ఱనైనది. నీవు తెల్లని వాడవు. అందువలననే ఆమెతో కూడియున్న నీవు మెరుపుతో కూడియున్న శరత్కాల మేఘము కంటే గొప్పగా ప్రకాశించుచున్నావు. అట్టి శోభ కలిగినటువంటి లక్ష్మీయుక్తుడవైన ఓ హయగ్రీవా! నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ రమాచ్ఛాయాక్రాన్తః క్షిపసి నవభానుద్యుతిఝరీ**
**పరీతం త్వం రౌప్యక్షితిధర మథ త్వద్రుచి వృతా।**
**రమా చన్ద్రచ్ఛాయావృత మపి సువర్ణక్షితిధరం**
**క్షిప త్యబ్జాక్ష! త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 13**

**ప్రతిపదార్థము:–** అబ్జాక్ష!=పద్మముల వంటి కన్నులు కలవాడా!, రమా=లక్ష్మీదేవి యొక్క, ఛాయా=కాన్తితో, ఆక్రాన్తః=ఆక్రమింప బడిన, త్వమ్=నీవు, నవ=నూతన మైన, భానుద్యుతి=సూర్యకాన్తియొక్క, ఝరీ= సముదాయము చేత, పరీతమ్=కూడిన, రౌప్యక్షితిధరమ్=వెండికొండను, క్షిపసి= తిరస్కరించుచ్నావు. త్వద్రుచి వృతా= నీ కాంతితో కూడుకొనిన, రమా= లక్ష్మీదేవి, అపి=కూడా, చన్ద్రచ్ఛాయావృతమ్ =చన్ద్రుని కాన్తితో కూడిన, సువర్ణక్షితిధరమ్=బంగారు మేరు పర్వతమును, క్షిపతి= తిరస్కరించుచున్నది. హయవదనమ్=గుఱ్ఱపుముఖము కలిగినవాడవును, ఇన్దుస్థితమ్ =చన్ద్రమండలము నందు ఉన్నవాడవును అగు,త్వామ్=నిన్ను, (అహమ్= నేను) అయే=పొందుచున్నాను.



**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీవు వెండికొండవలె తెల్లనైనవాడవు. నీ వామాంకము నందుగల లక్ష్మీదేవి బంగారు ఛాయ కలది. మీ ఇరువురి కాన్తులు ఒకరివి మరొకరి మీద పడుచున్నవి. అందువలననే లక్ష్మీదేవి కాన్తితో కూడిన నీవు ప్రాతఃకాలమున లేత ఎండతో కూడిన వెండికొండవలె నున్నావు. నీ కాన్తితో కూడిన లక్ష్మీదేవియును వెన్నెలతో కూడిన మేరు పర్వతమువలె భాసించుచున్నది. ఆ విధముగ ప్రకాశించుచున్న నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**– లక్ష్మీ హయగ్రీవుల కాన్తిమేళన వర్ణన (14, 15) –**

**శ్లో॥ భవచ్ఛాయాయుగ్మావృతిసుభగ మేతత్ త్రిభువనం**
**కవి క్ష్మాజచ్ఛాయాపరివృత నభోభాగరుచిరమ్।**
**సుగఙ్గాశోణద్వయ్యనవరతసక్తక్షితిఫణి**
**స్ఫటాభోగాధస్కం హయవదన మిన్దుస్థిత మయే॥ 14**

**ప్రతిపదార్థము:–** కవి.....రుచిరమ్–కవి=శుక్రుని యొక్కయు, క్ష్మాజ=కుజుని యొక్కయు, ఛాయా=కాంతులతో, పరివృత=కప్పబడిన, నభోభాగ= ఆకాశభాగము తో, రుచిరమ్=అందమైనదియును, సుగఙ్గా.....క్షితి–సు=శోభనమైన, గంగా=గంగా నదితోను, శోణ=శోణనదితోను, ద్వయి=ఈ రెంటితోను, అనవరత= ఎల్లప్పుడును, సక్త=కూడియున్న, క్షితి=భూమి కలిగినట్టిదియును, ఫణి=ఆదిశేషుని యొక్క, స్ఫటా= పడగయందుండు మణులతోను, భోగ= శరీరముతోను కూడిన, అధస్కమ్=పాతాళ లోకము కలదియును అగు, ఏతత్=ఈ కనబడుచున్న, త్రిభువనమ్=మూడు లోకములును, భవత్=మీ దంపతుల యొక్క, ఛాయాయుగ్మ=రెండు కాంతులయొక్క, ఆవృతి=ఆవరణము చేత, సుభగమ్=మనోహరమైనది హయవదనమ్=గుఱ్ఱపు ముఖము కలిగినవాడవును, ఇన్దుస్థితమ్ =చన్ద్రమండలము నందు ఉన్న వాడవును అగు,త్వామ్=నిన్ను, (అహమ్= నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ లక్ష్మీ హయగ్రీవులారా! మీ దంపతులిరువురి కాన్తులతో కప్పబడినవై ఈ ముల్లోకములను మనోహరముగా భాసించుచున్నవి. అందు స్వర్గలోకము కుజ, శుక్ర కాంతులతో ఆవరింపబడినదాని వలె ప్రకాశించుచున్నది. భూలోకము గంగా, శోణా నదులతో కూడినదానివలె భాసించుచున్నది. పాతాళ లోకము ఆదిశేషుని మణిభూషణఫణిమండలముతో కూడిన దానివలె శోభిల్లు

చున్నది. వాస్తవమునకు మూడు లోకములు మీ దంపతులిరువురి కాంతులతో మాత్రమే విరాజిల్లుచున్నవి. అనగా హయగ్రీవుడు తెల్లని కాంతికలవాడు, లక్ష్మీదేవి ఎఱ్ఱని కాంతి కలది. వారిరువురి కాంతులే స్వర్గలోకమునందు శుక్ర, కుజ రూపముగాను, భూలోకమునందు గంగా, శోణా నదీరూపముగను, పాతాళలోకము నందు ఆది శేషుని శరీరము మణుల రూపముగను భాసించుచున్నవని భావము.

**శ్లో॥ భవచ్ఛాయాయుగ్మ వ్యతికలనజా కాచన రుచిః**
**ప్రహీరం మాణిక్యం భజకహృదయే సఙ్గమయతి।**
**ప్రతాపం కీర్తిం వా కిము తనుతయా బ్రహ్మ స భవాన్**
**బిభర్తి త్వాం భూమన్! హయవదన మిన్దుస్థిత మయే॥ 15**

**ప్రతిపదార్థము:–** హే భూమన్!=మిక్కిలి గొప్పవాడవైన ఓ హయగ్రీవా!, భవత్=మీ యొక్క (లక్ష్మీదేవి, హయగ్రీవుల యొక్క), ఛాయాయుగ్మ=రెండు కాంతుల యొక్క, వ్యతికలనజా=కలయికచేత పుట్టిన, కాచన=ఒకానొక (విలక్షణమైన), రుచిః=కాంతి, భజక హృదయే=నీ భక్తుల హృదయమునందు, ప్రహీరమ్=గొప్ప వజ్రమును, మాణిక్యమ్=మాణిక్యమును, సఙ్గమయతి=చేర్చుచున్నది, బ్రహ్మ= పరబ్రహ్మ ఐనట్టి, సః=అట్టి, భవాన్=నీవు, ప్రతాపమ్=ప్రతాపమును, కీర్తిం వా=కీర్తిని కూడ, తను తయా=శరీరముగా, బిభర్తి కిము=ధరించుచున్నావా!, ఇన్దుస్థితమ్= చంద్రునియందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** లక్ష్మీదేవితో కూడిన ఓ హయగ్రీవా! నీవు వజ్రమువలె తెల్లని కాంతి కలిగినవాడవు. లక్ష్మీదేవి మాణిక్యమువలె ఎఱ్ఱని కాంతి కలది. మిమ్ములను హృదయము నందు ఉంచుకొని భక్తులు ధ్యానించుచుండగా, ఆ భక్తుల హృదయము నందు మీ ఇరువురి కాంతుల మిశ్రమముచేత విలక్షణమైన ఒక కొత్త కాంతి వ్యాపించినది.

ఆ కొత్త కాంతిని వారు వజ్రము మాణిక్యముల యొక్క సమ్మేళనము వలె భావించు చున్నారు. పరబ్రహ్మ స్వరూపుడవైన ఓ హయగ్రీవా! ప్రతాపమును, కీర్తిని సశరీరముగా నీవు భరించుచున్నావా! (ప్రతాపము ఎఱ్ఱగాను, కీర్తి తెల్లగా ఉండుటచే కవి ఇట్లు ఉత్ప్రేక్షించుచున్నాడు) చంద్రుని యందు ఉన్న హయగ్రీవుని నేను పొందుచున్నాను.



**– చరణ ధ్యానము (16,17,18) –**

**శ్లో॥ సితామ్భోజౌ పాదౌ ధ్వజకులిశపద్మారిదరితౌ**
**నఖజ్యోత్స్నాధూతప్రకటభజకాత్మాన్ధతమసౌ।**
**సుధీ ధీసఙ్ఘర్షా దరుణితతలౌ మాంసలతమౌ**
**భవన్తం బిభ్రాణం హయవదన మిన్దుస్థిత మయే॥ 16**

**ప్రతిపదార్థము:–**ధ్వజ కులిశ పద్మారి దరితౌ–ధ్వజ=టెక్కెము, కులిశ=వజ్రా యుధము, పద్మ=పద్మము, అరి=చక్రము, దరితౌ=శంఖము కలిగినటు వంటిది యును, నఖ జ్యోత్స్నా ధూత ప్రకట భజకాత్మాన్ధ తమసౌ – నఖ=గోళ్ల యొక్క, జ్యోత్స్నా=వెన్నెలతో (కాంతితో), ధూత=పోగొట్టబడిన, ప్రకట=ఉత్కటమగు, భజక= భక్తుల యొక్క, ఆత్మ= మనస్సుయందలి, అంధతమసౌ=అజ్ఞానాత్మకమైన చీకటులు కలిగినవియు, సుధీ= విద్వాంసుల యొక్క, ధీ=బుద్ధితో, సంఘర్షాత్= సంఘర్షణము చేత, అరుణిత తలౌ= ఎఱ్ఱబారిన అఱికాలు కలవియును, మాంసల తమౌ=బలిష్ఠ మైనవియును, సితామ్భోజౌ=తెల్లని పద్మములు అను(తెల్లని పద్మముతో సమాన మైనవియును అగు), పాదౌ=పాదములను, బిభ్రాణమ్=ధరించుచున్న, ఇన్దుస్థితమ్= చంద్రునియందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుడవగు, భవన్తమ్=నిన్ను, (అహమ్ =నేను), అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ పాదపద్మములయందు పతాకము, వజ్రాయుధము, పద్మము, చక్రము, శఙ్ఖముల గురుతులు కలవు. ఇవి అన్నియును శుభ చిహ్నములు. నీవు అట్టి శుభ చిహ్నములు కలిగిన వాడవు. నీ కాలి గోళ్ళు చంద్రకలలవలె ఉండును. అందువలననే నీ పాదపద్మములను ధ్యానించు భక్తుల హృదయము నందలి అజ్ఞానము అనెడి చీకటిని నీ కాలి గోళ్ళ నుండి వచ్చు వెన్నెలలు పటా పంచలు చేయుచున్నవి. మరియును యోగుల దృఢమైన బుద్ధులు నీ పాద పద్మము లతో నిరంతరము సంఘర్షణము చేయును.

(యోగుల యొక్క బుద్ధి కఠినమైనది. అట్లుకాని యెడల వారు సంసారమును విడచిపెట్టెడివారు కారు. అట్టి బుద్ధితో నిరంతరము హయగ్రీవుని పాదపద్మములను యోగులు ధ్యానింతురు. ఈ ధ్యానము సంఘర్షణముగా కవిచే చెప్పబడినది.)

ఆ సంఘర్షణముచేత నీ పాదముల క్రింది ప్రదేశము (అఱికాళ్లు) ఎఱ్ఱ బారినది. నీ పాదములు బలిష్ఠమైనవి. తెల్లని పద్మముతో సమానమైనవి. అట్టి పాదపద్మములను ధరించు ఓ హయగ్రీవా! నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ నమ ద్దేవీ మౌళి స్థిత సురమహీజాత కుసుమ**
**స్రవ న్మాధ్వీ బిన్దు వ్రతతి పరిషిక్తైకచరణమ్।**
**మహేన్ద్రాద్యున్మస్తస్థగితమణికోటీరమణిభా**
**ప్రదీప్తాన్యాబ్జాఙ్ఘ్రిం హయవదన మిన్దుస్థిత మయే॥ 17**

**ప్రతిపదార్థము:-** నమత్=నమస్కారము చేయుచున్నటువంటి, దేవీ=శచీదేవి మొదలుగాకల దేవతలయొక్క, మౌళి=శిరస్సులయందు, స్థిత=ఉన్నటువంటి, సుర మహీజాత కుసుమ=పారిజాత పుష్పములనుండి, స్రవత్=కారుచున్న, మాధ్వీ= తేనె యొక్క, బిందువ్రతతి=బిందువుల సముదాయముతో, పరిషిక్త=బాగుగ తడిసిన, ఏకచరణమ్=ఒక పాదము కలవాడవును, మహేన్ద్రాది=మహేన్ద్రుడు మొదలుగా కల దేవతల యొక్క, ఉన్మస్త=శిరస్సు పై భాగములయందు, స్థగిత=బిగించబడిన, మణి కోటీర=మణిమయమైన కిరీటములయందున్న, మణి=మణుల యొక్క, భా=కాన్తులచేత, ప్రదీప్తమ్=బాగుగప్రకాశించుచున్న, అన్య=మరియొక, అబ్జాంఘ్రిమ్ =పాదపద్మము కలవాడవును, ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్నవాడవును అగు, హయవదనమ్=హయగ్రీవుడవైన నిన్ను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** ఓ హయగ్రీవా! దేవేంద్రుడు, శచీదేవి మొదలుగా కల దేవతలు నిరంతరము నీ పాదపద్మములయందు శిరస్సువంచి నమస్కారము చేయుచుందురు. అట్టి సమయమున ఒక పాదపద్మము నందు ఇంద్రాది దేవతల శిరస్సులు, మరొక పాదపద్మమునందు శచీదేవి మొదలగు దేవతాస్త్రీల శిరస్సులు ఉండగా, ఆ దేవతా స్త్రీలు శిరస్సున ధరించిన పారిజాతాది దేవతా కుసుమముల నుండి మకరంద బిందువులు నిరంతరము స్రవించుచుండగా ఒక పాదము ఆ బిందువులతో తడిసి పోయినది. మరియొక పాదము దేవేంద్రాది దేవతల శిరస్సున ఉన్న కిరీటముల యందున్న మాణిక్యముల కాంతి ప్రవాహముతో దేదీప్యమానముగ విరాజిల్లు చున్నది. అట్టి పాద పద్మములు కల నిన్ను నేను శరణు పొందుచున్నాను.



**శ్లో॥ నట జ్జూటాటీరోన్మకుట తట రిఙ్గ త్సురనదీ**
**తరఙ్గ ప్రోద్ఘుష్ట స్ఫుట జలజ సాదృశ్య చరణమ్।**
**పదాబ్జోద్య న్మాధ్వీరసభర సమాస్వాద ముదిత**
**స్వయమ్భూ ప్రస్తావం హయవదన మిన్దుస్థిత మయే॥ 18**

**ప్రతిపదార్థము:-** నట ...... చరణమ్ – నటత్=నాట్యము చేయుచున్న, జాటాటీర= పరమేశ్వరుని యొక్క, ఉన్మకుట తట=ఉన్నతమైన శిరోభాగమునందు, రింగత్= ప్రవహించు, సురనదీ=గంగానది యొక్క, తరఙ్గ=తరంగముల చేత, ప్రోద్ఘుష్ట= బాగుగ ఘోషింపబడుచున్న, స్ఫుటజలజ సాదృశ్య=వికసించిన పద్మముతో పోలిక గల, చరణమ్=పాదములు కలవాడును, పదాబ్జోద్య...ప్రస్తావమ్–పదాబ్జ= పాద పద్మము నుండి, ఉద్యత్=ఆవిర్భవించు చున్న, మాధ్వీరసభర=గొప్పమకరందము యొక్క, సమాస్వాద=ఆస్వాదము చేత(రుచి చూచుట చేత), ముదిత=సంతోషించిన, స్వయమ్భూ=బ్రహ్మదేవుని చేత, ప్రస్తావమ్= స్తుతి కలిగినవాడును (స్తుతి చేయబడిన వాడును), ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్నవాడునుఅగు, హయవదనమ్= హయ గ్రీవుని, అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** పరమేశ్వరుడు హయగ్రీవుని పాదపద్మములకు శిరసువంచి నమస్కారము చేయు సమయమునందు ఆ పాదపద్మముల యందలి మకరంద బిందువు శివుని శిరస్సుయందు లగ్నమై గంగానదిగా భాసించుచున్నది. ఈ విధముగా మకరంద బిందువులు కలిగినది అగుటచే హయగ్రీవుని పాదము పద్మముతో సమానమైనది అని గంగానది తరంగ ధ్వని అను నెపమున ఘోషించు చున్నది. బ్రహ్మదేవుడు హయగ్రీవుని పాదపద్మములకు నమస్కారము చేయు సమయమున పాద పద్మములయందలి మకరందమును ఆస్వాదించి మిక్కిలి సంతోషించినవాడై హయగ్రీవుని గొప్పగా స్తుతించెను. (బ్రహ్మదేవుడు నిరంతరము వేదములను చదువుచుండును. ఆ వేదములన్నియును హయగ్రీవునే ప్రతి పాదించును. '**వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః**' అని పరమాత్మయే చెప్పినాడు. బ్రహ్మదేవునిచే పఠించబడు వేదములను హయగ్రీవ పాదపద్మములందలి మకరందమును త్రాగుటచే పరవశించి చేసిన స్తోత్రములనుగా కవి చెప్పుచున్నాడు.

ఈ విధముగా శంభుబ్రహ్మలచే సేవింపబడు హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**- లక్ష్మీ చరణ ధ్యాన వర్ణన (19, 20) -**

**శ్లో॥ నమ ద్దేవీ కైశ్య భ్రమర నికర ఖ్యాపిత నిజ**
**స్ఫుటాబ్జత్వ ప్రఖ్యాత్యనువచన సన్నూపురపదామ్।**
**అపాఙ్గై స్తన్వానాం చరణకమలే భృఙ్గసుషమాం**
**భజన్తం శ్రీకాన్తాం హయవదన మిన్దుస్థిత మయే॥ 19**

**ప్రతిపదార్థము:-** నమ .... సన్నూపురపదామ్-నమత్=నమస్కారము చేయుచున్నటు వంటి, దేవీ= దేవతా స్త్రీల యొక్క, కైశ్య=కేశసముదాయము నందలి, భ్రమర నికర=తుమ్మెదల సమూహముచేత, ఖ్యాపిత=ప్రకటింపబడిన, నిజ=తన యొక్క (పాదము యొక్క) స్ఫుటాబ్జత్వ ప్రఖ్యాతి=వికసించిన పద్మము అనెడి ప్రఖ్యాతిని, అనువచన=ఆమోదించి చెప్పుచున్న, సత్=శ్రేష్టమైన, నూపుర=నూపురములు కల, పదామ్=పాదములు కలిగినటువంటిదియును, చరణకమలే=హయగ్రీవుని చరణార విందముల యందు, అపాంగైః=తన కటాక్షములతో, భృంగ సుషమామ్=తుమ్మెదల యొక్క శోభను, తన్వానామ్=విస్తరింపజేయుచున్నటువంటిదియును అగు, శ్రీకాన్తామ్=లక్ష్మీదేవిని, భజన్తమ్=(ఎడమతొడయందు) ధరించు, ఇన్దుస్థితమ్= చంద్రుని యందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను) అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:-** లక్ష్మీదేవి చరణములకు దేవతాస్త్రీలు శిరస్సువంచి నమస్కారము చేయుచుండగా ఆ దేవతా స్త్రీల కేశసమూహమునందు ఉన్న తుమ్మెదల సముదాయము కేశసమూహమును విడచి లక్ష్మీదేవి పాదముల యందు లగ్నమైనది. అదే సమయము నందు లక్ష్మీదేవి పాదములయందు ఉన్న నూపురములు శబ్దము చేయుచున్నవి. ఇది ఎట్లున్నదనగా లక్ష్మీదేవి యొక్క పాదము వికసించిన పద్మముతో సమానము అని లోకమున ప్రఖ్యాతి ఉన్నది. గొప్ప సువాసనలతో కూడియున్న దేవతాస్త్రీల కేశ సమూహమును కూడ విడచిపెట్టి లక్ష్మీదేవి చరణములయందు ప్రవేశించుట ద్వారా ఆ ప్రఖ్యాతిని తుమ్మెదలు చెప్పుచున్నవి. 'బాగు. బాగు. ఈ మాట నిజము' అని నూపురములు తమ ధ్వనితో అనుమోదించుచున్నవియా అన్నట్లున్నది. అట్లే లక్ష్మీదేవి తన నల్లని అపాఙ్గవీక్షణములతో (స్త్రీల అపాంగ వీక్షణములు నల్లనివి అని కవి సమయము) హయగ్రీవుని పాదపద్మములందు తుమ్మెదల శోభను విస్తరింపజేయు చున్నది. అటువంటి లక్ష్మీదేవిని వామాఙ్కము నందు ధరించు హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.



**శ్లో॥ నఖార్కోస్ర ద్యోత ప్రతిలసిత దేవీ కచ భర**
**చ్ఛలోద్య త్తామిస్ర వ్యతికలనజ స్నేహ చరణామ్।**
**కటాక్షాబ్జ వ్రాతార్చిత పతి పదామ్భోరుహ యుగాం**
**దధానం చన్ద్రాస్యాం హయవదన మిన్దుస్థిత మయే॥ 20**

**ప్రతిపదార్థము:-** నఖార్కోస్ర.....చరణామ్ - నఖ=(పాదముల)గోళ్లు అనెడు, అర్కోస్ర=సూర్య కిరణముల యొక్క, ద్యోత=వెలుగుచేత, ప్రతిలసిత= ప్రకాశింప జేయబడిన, దేవీ=దేవతా స్త్రీలయొక్క, కచ భర=కేశ సముదాయము అనెడి, ఛల=నెపముతో, ఉద్యత్= ఆవిర్భవించుచున్న, తామిస్ర=చీకటి యొక్క, వ్యతికలన =సంపర్కము చేత, జ=పుట్టిన, స్నేహ=మైత్రి (లేక) తైలము గలిగిన, చరణామ్= పాదములు కలిగినదియును, కటాక్షాబ్జ ......... యుగామ్ - కటాక్ష=అపాంగ వీక్షణములు అనెడి, అబ్జ=పద్మముల యొక్క, వ్రాత=సమూహముచేత, అర్చిత= పూజింపబడిన, పతిపదామ్భోరుహ యుగామ్=భర్త యొక్క రెండు పాదపద్మములు కలదియును, చన్ద్రాస్యామ్=చన్ద్రబింబమువంటి ముఖము కలదియును అగు లక్ష్మీ దేవిని, దధానమ్=(వామాంకమునందు) ధరించువాడును, ఇన్దుస్థితమ్= చన్ద్రమణ్డల నివాసియును అగు, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్= నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:-** లక్ష్మీదేవి పాదములకు దేవతాస్త్రీలు శిరసువంచి నమస్కారము చేయుచుండగా ఆమె కాలిగోళ్లు అనెడి సూర్యకిరణముల వెలుగుతో దేవతాస్త్రీల నల్లని కేశములు మరింతగా వెలుగొందుచూ నల్లని కేశములు అనుపేరుతో చీకటియే ఆవిర్భవించుచున్నదా! అనునట్లుండెను. అట్టి కేశముల సంపర్కముతో ఆమె పాదములకు స్నేహము (కేశములయందలి తైలము) కలుగుచున్నది. మరియును లక్ష్మీదేవి తన క్రీగంటిచూపులు అనెడి పద్మములతో హయగ్రీవుని రెండు పాదపద్మములను నిరంతరము పూజించుచున్నది. ఇట్టి లక్ష్మీదేవిని వామాఙ్కము నందు ధరించు హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:-** సూర్యుని వలన అన్ధకారము మరింత ప్రకాశించుట లోక విరుద్ధము. అయినను మాయాశక్తి అయిన లక్ష్మీదేవి సామర్థ్యమువలన ఈ విచిత్రము సంభవించినది. మరియు లక్ష్మీపదపవిత్రసాన్నిధ్యమున అన్యోన్య విరుద్ధమైన కాన్తి

అన్ధకారములకు కూడ మైత్రి ఏర్పడినది. అందువలననే కవి 'స్నేహచరణామ్' అని ప్రయోగించినాడు. తపోవనములలో మహర్షుల సన్నిధిలో వైరజన్తువుల స్నేహము పురాణ ప్రసిద్ధమే! మరియు మాయా జ్ఞానస్వరూపులైన లక్ష్మీహయగ్రీవుల సాహచర్యమునకు కూడ ఇది సూచకము.

**– లక్ష్మీ హయగ్రీవుల జఙ్ఘావర్ణన –**

**శ్లో॥ పదామ్భోజచ్ఛాయా రసభర నిమజ్జ త్కమఠ ధీ**
**సమాలమ్బ ద్గుల్ఫావరణ సుమణీ నూపుర గణౌ।**
**మనోభూ తూణీర ప్రతిభట సుజఙ్ఘౌ ప్రియ! రమే!**
**యువా మమ్భోజాక్షీం హయవదన మిన్దుస్థిత మయే॥ 21**

**ప్రతిపదార్థము:–** ప్రియ!=ఆత్మస్వరూపుడైన వాడా! (ఆత్మయే కదా అందరకు ప్రియమైనది) రమే!=ఓ లక్ష్మీ దేవీ!, పదామ్భోజ ..... నూపుర గణౌ–పదామ్భోజ= పాదపద్మముల యొక్క, ఛాయా=కాంతి అనెడు, రసభర=గొప్పజలమునందు, నిమజ్జత్= మునిగిపోవు, కమఠ=తాబేళ్ళు అనెడి, ధీ=బుద్ధికి, సమాలంబత్=ఆధార భూతములుగా నున్న, గుల్ఫ=చీలమండలకు, ఆవరణ=ఆవరణముగానున్న, సుమణీ =మంచి మణులతో కూడిన, నూపుర గణౌ=నూపుర సముదాయము కలవారును, మనోభూ=మన్మథుని యొక్క, తూణీర=అమ్ములపొదికి, ప్రతిభట=దీటుగానున్న, సుజంఘౌ=అందమైన పిక్కలు కలవారును అగు, ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, ఇన్దుస్థితామ్=చంద్రునియందు ఉన్న, అమ్భో జాక్షీం చ=పద్మములవంటి కన్నులుకల లక్ష్మీదేవిని, యువామ్=మీ ఇరువురను, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఆత్మస్వరూపుడా! హయగ్రీవా! పద్మములవంటి కన్నులుకల ఓ లక్ష్మీదేవీ! మీ ఇరువురి కాలి చీలమండలు మీ పాదపద్మముల కాంతి అనెడు సముద్రమునందు మునిగియున్న తాబేళ్లు అని అనిపించుచు కనబడియు కనబడకుండా ఉన్నవి. మరియును అట్టి చీలమండల పైన ఆవరణముగా మణిమయమైన నూపురములు కలవు. అట్టి నూపురములుకల చీలమండలతో మీరిరువురు మనోహరముగా నున్నారు. ఇంకను మీ ఇరువురి పిక్కలు మన్మథుని అమ్ములపొదితో పోటీపడునట్లుగా మనోహరముగానున్నవి. అట్టి ఓ లక్ష్మీ హయగ్రీవులారా! మిమ్ము నేను శరణు పొందుచున్నాను.



**– లక్ష్మీ హయగ్రీవుల ఊరువర్ణన –**

**శ్లో॥ సువర్ణాద్రిప్రాన్త క్షితితలజ రమ్భా తరు యుగ**
**ప్రతిద్వన్ద్వ్యూరు ద్వయ్యనవరత సంశ్లేష సుభగామ్।**
**స్వరోకోరా ద్వాహ ద్విపకర సమోరుం ప్రియ! రమే!**
**యువా మమ్భోజాక్షీం హయవదన మిన్దుస్థిత మయే॥ 22**

**ప్రతిపదార్థము:–** హేరమే!=ఓ లక్ష్మీదేవీ!, సువర్ణాద్రి ...సుభగామ్ – సువర్ణాద్రి ప్రాన్త=మేరు పర్వత ప్రాన్తమునందలి, క్షితితల=(బంగారు) భూతలమునందు, జ=పుట్టిన, రమ్భా తరు యుగ=రెండు అరటి చెట్లకు, ప్రతిద్వన్ద్వి=పోటీగానున్నటు వంటి, ఊరుద్వయి= రెండు తొడలయొక్క అనవరత సంశ్లేష=నిరంతరము ఉండు కలయికచే, సుభగామ్=అందమైనటువంటి దానవును, అమ్భోజాక్షీమ్=పద్మము వంటి కన్నులు కలదానవును అగు నిన్ను, హే ప్రియ!=ఓ పరమాత్మా! స్వరోకోరాట్ =దేవతలకు రాజైన ఇంద్రుని యొక్క, వాహ=వాహనమైన, ద్విప=ఐరావతము అను ఏనుగు యొక్క, కర=తొండముతో, సమ=సమానమైన, ఊరుమ్=తొడలుకల వాడవును, ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్నవాడవును, హయవదనమ్= హయ గ్రీవుడవును ఐన నిన్ను, యువామ్=మీ ఇరువురను, (అహమ్=నేను), అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము:–** ఓ లక్ష్మీదేవీ! మేరు పర్వత ప్రాంతమందు బంగారు భూమిలో పుట్టిన బంగారుమయమైన రెండు అరటి బోదెలతో సమానమైనవి నీ ఊరువులు. అట్టి నీ రెండు ఊరువులు నిరంతరము కలిసియుండుటచే నీవు మిక్కిలి శోభించు చున్నావు. హయగ్రీవుడును దేవేన్ద్రవాహనమగు ఐరావతము యొక్క తొండముతో సమానమైన తొడలు కలిగినవాడు. అట్టి మీ ఇరువురను నేను శరణు పొందు చున్నాను.

**విశేషములు:–** లక్ష్మీదేవి బంగారు ఛాయ కలగినది అగుటచే ఆమె తొడలను మేరు పర్వతప్రాంతమునందు పుట్టిన అరటిచెట్ల బోదెలవలె ఉన్నవని కవి వర్ణించినాడు. మేరు పర్వతము బంగారు కొండ కనుక అచ్చట పుట్టిన అరటి చెట్లు సైతము స్వర్ణమయముగానే ఉండునని కవి హృదయము. హయగ్రీవుడు తెల్లని ఛాయ గలవాడు అగుటచే ఆయన తొడలను తెల్లని ఐరావతము యొక్క తొండముతో పోల్చినాడు.

### – లక్ష్మీ హయగ్రీవుల నితంబ వర్ణన –

**శ్లో॥ పయోఽమ్భోనిధ్యూర్మి ప్రతిభట దుకూలావృత కటీ**
**తట భ్రాజ త్కాఞ్చీవలయ రుచి నిర్ధూత తులనౌ।**
**హిరణ్యా క్షోణీభృ త్కటక సునితమ్బౌ ప్రియ! రమే!**
**యువా మమ్భోజాక్షీం హయవదన మిన్దుస్థిత మయే॥ 23**

**ప్రతిపదార్థము:–** ప్రియ!=పరమాత్మ స్వరూపుడవైన ఓ హయగ్రీవా!, రమే=లక్ష్మీదేవి! పయోఽమ్భోనిధ్యూర్మి ..... తులనౌ – పయోఽమ్భోనిధి=పాల సముద్రముయొక్క, ఊర్మి= తరంగములకు, ప్రతిభట=పోటీగానున్న, దుకూల=తెల్లని వస్త్రముతో, ఆవృత=కప్ప బడిన, కటీతట=మొలప్రాంతమునందు, భ్రాజత్=విరాజిల్లుచున్న, కాఞ్చీవలయ=బంగారు మొలత్రాటి వలయము యొక్క, రుచి=కాన్తితో, నిర్ధూత= పోగొట్టబడిన, తులనౌ=పోలిక కలవారును, హిరణ్యా .... సునితమ్బౌ – హిరణ్యా= స్వర్ణ మయమైన మరియు రజతమయమైన, క్షోణీభృత్=పర్వతముల యొక్క, కటక= ఉన్నతమైన నడుముభాగముల వలె, సునితమ్బౌ=అందమైన పిఱుదులు కలవారును అగు, ఇన్దుస్థితమ్=చన్ద్రమండలనివాసియగు, హయవదనమ్=హయగ్రీవుని, ఇన్దు స్థిత(తా)మ్=చన్ద్రమండలమునందున్న, అమ్భోజాక్షీమ్=పద్మములవంటి కన్నులుకల లక్ష్మీదేవిని, యువామ్=మీ ఇరువురను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ లక్ష్మీహయగ్రీవులారా! పాలసముద్రపు నురగ వలె తెల్లని పట్టు వస్త్రములు వాటిపై బంగారు మొలనూలు ఈ రెంటి కలయికతో మీ నితంబములు మేరు కైలాస పర్వతముల నితంబముల వలె శోభించుచున్నవి. అట్టి మిమ్ము నేను శరణు పొందుచున్నాను.

### – హయగ్రీవ నాభి వర్ణన (24,25) –

**శ్లో॥ విరిఞ్చానుత్పాదానుమిత న సరోజత్వ గుణక**
**స్వనాభీ రాజీవం పరివృతవతీ పద్మనిలయా।**
**యతో నాభీ పద్మే దృగళినిచయం పాతయతి వా**
**సదా తం శ్రీనాథం హయవదన మిన్దుస్థిత మయే॥ 24**

**ప్రతిపదార్థము:–** విరించ=బ్రహ్మయొక్క, అనుత్పాద=పుట్టుక లేకపోవుటచేత, అనుమిత=ఊహింపబడిన, న సరోజత్వ=పద్మత్వాభావము అనెడి (పద్మము కాదు



అనెడి), గుణక=గుణముకల (సాధ్యము కల), స్వనాభీ రాజీవమ్=తన బొడ్డు అనెడి పద్మమును, పద్మనిలయా=లక్ష్మీదేవి, పరివృతవతీ=కప్పివైచినది, యతః =ఏ హయగ్రీవుని యొక్క, నాభీపద్మే=బొడ్డు అనెడి పద్మమునందు, దృగళినిచయమ్= చూపులు అనెడి తుమ్మెదల సముదాయమును, పాతయతి వా=పడవేయుచున్నదో, తమ్=అట్టి, శ్రీనాథమ్=లక్ష్మీపతి ఐన, ఇన్దుస్థితమ్=చంద్రమండల నివాసి ఐన, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** లక్ష్మీదేవి తన బొడ్డునందు బ్రహ్మపుట్టకపోవుటచే తన బొడ్డు పద్మము కాదు అని ఊహించి అట్లు కాకపోవుటకు సిగ్గుపడియో అన్నట్లుగా తన బొడ్డును వస్త్రముతో కప్పివైచినది. (స్త్రీలు తమ బొడ్డును పరులకు చూపుట తగని పని కావున వస్త్రముతో దాని కప్పుట అవసరము. ఇట్లు కప్పుటను కవి ఈ విధముగా ఉత్ప్రేక్షించుచున్నాడు. హయగ్రీవుని నాభియే పద్మము. అక్కడ నుండి బ్రహ్మ పుట్టినాడు. తన బొడ్డునుండి బ్రహ్మ పుట్టలేదు కావున తన బొడ్డు పద్మము కాదు అని ఊహించి అందుకు లక్ష్మీదేవి సిగ్గుపడినదియో అనినట్లు వస్త్రముతో బొడ్డును కప్పివైచెను అని.) మరియును ఏ హయగ్రీవుని బొడ్డు అనెడి పద్మము నందు తన చూపులు అనెడి తుమ్మెదల గుంపును పడవేయుచున్నదో ఆ హయగ్రీవుని నేను శరణు వేడుచున్నాను.

**శ్లో॥ లసన్నాభీ పద్మానుమిత సురగఙ్గాత్వ సుషమా**
**ప్రవాహాభిక్రాన్తి ప్రథిత హిమభూమీధరతులమ్।**
**జగత్త్రైతోన్మేషాతిశయ సహనాత్యన్త విపుల**
**స్ఫుర న్నాభీపద్మం హయవదన మిన్దుస్థిత మయే॥ 25**

**ప్రతిపదార్థము:–**లసన్నాభీ ..... ధరతులమ్–లసత్=ప్రకాశించుచున్న (వికసించు చున్న), నాభీ=బొడ్డు అనెడి, పద్మ=పద్మముచే, అనుమిత=ఊహింపబడిన, సుర గంగాత్వ=స్వర్గ గంగాత్వము కల, సుషమా ప్రవాహ=గొప్ప కాంతి ప్రవాహము యొక్క, అభిక్రాంతి=వ్యాపనము చేత, ప్రథిత=ప్రకటింపబడిన, హిమ భూమీధర తులమ్=హిమవత్ప ర్వతముతో పోలిక కలవాడును, జగత్త్రైతోన్మేషాతిశయ .....పద్మమ్–జగత్త్రైతా=మూడు లోకముల యొక్క, ఉన్మేష= ప్రాదుర్భావము యొక్క, అతిశయ=గొప్పదనమును, సహన=సహించునట్టి, అత్యన్త విపుల=మిక్కిలి విస్తార మైన, స్ఫురన్నాభీపద్మమ్=ప్రకాశించు బొడ్డు అనెడి పద్మము కలవాడును, ఇన్దు

స్థితమ్= చంద్రుని యందు ఉన్నటువంటి వాడును అగు, హయవదనమ్= హయ గ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ బొడ్డు పద్మము వంటిది. పద్మము నీ తెల్లని శరీరమున ఉన్నది. కనుక నీ కాంతి దేవగంగ అని ఊహించుచున్నాను. ఈ కాంతికి ఉత్పత్తిస్థానము కనుక నీ శరీరము గంగా ప్రవాహ నిలయమైన హిమవంతునితో సమానమైనది. నీ నాభీపద్మము అత్యన్త విపులమైనది. గొప్ప సహనశక్తి కలది కనుకనే దానినుండి మూడులోకములు జనించినవి. చన్ద్రమణ్డలము నందు ఉన్న అట్టి నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**– హయగ్రీవమధ్యవర్ణన –**

**శ్లో॥ అపి బ్రూషే త్వం నః స్వనరహరి మధ్యావతరతాం**
**వలగ్నే నానేన వ్యతికలిత నిర్మధ్య లలన।**
**త్వయా త్రాతో దన్తీత్యపర మివ నః కౌతుకపదం**
**మదాత్మారామ! త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 26**

**ప్రతిపదార్థము:–** వ్యతికలిత నిర్మధ్యలలన! – వ్యతికలిత=తోడు చేసికొనబడిన, నిర్మధ్య=మధ్యము (నడుము) లేని, (ఆకాశము శూన్యము గనుక శూన్యమధ్యముగల, మఱియు ఆదిమధ్యాన్తములు లేని), లలన=స్త్రీ (లక్ష్మీ) గలవాడా!, త్వమ్=నీవు, నః=మాకు, స్వనరహరి మధ్యావతరతామ్ – స్వ=నీ యొక్క, నరహరి=నరసింహుడు, మధ్యావతరతామ్=మధ్యలోని అవతారము అగుటను, అనగా విరాట్ పురుషత్వ మును (లేదా) స్వనర=పరమాత్మ అయిన తనయొక్క, హరిమధ్య=సింహము నడుమువంటి నడుముకల, అవతరతామ్=అవతారము గలిగి యుండుటను, అనేన= ఈ సన్నని ఆకాశమువంటి, మఱియు ఆకాశమే అయిన, వలగ్నేన=నడుముతో, అపి బ్రూషే=చెప్పుచున్నావా?, హే మదాత్మారామ!=నా మనస్సుయందు క్రీడించు ఓ హయగ్రీవా!, త్వయా=(సింహమాధ్యావతారుడవైన) నీచేత, దన్తీ=గజేన్ద్రుడు, త్రాతః=రక్షింపబడెను, ఇతి=అనువిషయము, నః=మాకు, అపరమ్=మఱియొక, కౌతుకపద మివ=ఆశ్చర్య కుతూహల స్థానముగా అనిపించుచున్నది, ఇన్దుస్థితమ్= చంద్రమండల నివాసి ఐన, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.



**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీవు హరిమధ్యుడవు. అనగా సింహపునడుమువలె సన్నని నడుము గలవాడవు. అట్టి నడుము వద్దనే నీవు నీ భార్య అయిన లక్ష్మీదేవిని ధరించియున్నావు. ఆమె నిర్మధ్య. అనగా నడుము లేనిది. అనగా 'లేదు' అనిపించు నంత సూక్ష్మమయిన నడుము గలది. పురుషుల నడుము కన్న స్త్రీల నడుము మఱింత సన్నముగా కవులు వర్ణించెదరు. కనుక ఆయన హరి మధ్యుడు. ఆమె అసలు నిర్మధ్య. అట్టి ఆమెను నడుము వద్ద, అనగా తొడపై ధరించితివి. మీ ఇరువురి నడుములు ఈడుజోడు సరిపోయినది. అంతేగాక పరమాత్మవయిన నీవే ఈ సన్నని నడుము గల, అనగా శరీరము దాల్చి హయగ్రీవుడవయినావు.

మఱియు, ఈ సన్నని నడుము సింహమును పోలుట వలన నీవే ఆనాటి 'నరహరి' వి అని తెలియుచున్నది. కాన సర్వాధారమూలతత్త్వమయిన 'విరాట్టు'వు నీవేనని ఈ నడుము మాకు తెలుపుచున్నది. మఱియు, విరాట్పురుషునకు నడుము అన్తరిక్షము అని సంప్రదాయము. అంతరిక్షము శూన్యమే. కనుక సన్నని నీ 'హరిమధ్యము' విరాట్పురుష శరీరమును సూచించును. అట్టి విరాట్పురుషునకు భార్య అయిన లక్ష్మియు విరాట్టువలె నిర్మధ్య. అనగా మధ్యము లేనిది. ఆదిమధ్యాన్తములు లేనిది. కనుక 'మధ్యము లేనిది' అని సంగ్రహముగా చెప్పబడినది. అట్లే

మధ్యము అనగా ప్రకృతికి వర్తమాన ప్రపంచము. అదియును పరమాత్మ యందు ఆరోపింపబడినదే గాని వాస్తవము గాదు. ఆమె మధ్యము మిథ్య కావున ఆమె నిర్మధ్య. పైగా పరమాత్మను విరాట్టుగా అంగీకరించుటకు కారణము ప్రకృతియే. ప్రకృతి లేనిదే విరాట్టు, అన్తర్యామి అను పదముల అవసరము లేదు. కనుక హరిమధ్యుడు అయిన విరాట్టునకు నిర్మధ్య అయిన ప్రకృతి సరి అయిన భార్య. ఈ దాంపత్యము 'వలగ్నము'. అనగా నడుము వలన లగ్నము అయినది.

ఇట్లే సింహ మధ్యుడయిన స్వామి ఒకనాడు గజేన్ద్రుని రక్షించుట జరిగినది. సింహమధ్యుడు అయినవాడు అనగా నరసింహుడుగా గాని, నడుమును బట్టిగాని, ఆయనలో సింహలక్షణము గలదు. పైగా సింహమధ్యుడు అనగా ఆయనలో సింహము ఉన్నదని కూడ అర్థము వచ్చును. ఇట్టి నరసింహ లక్షణము గల పరమాత్మ ఏనుగును అనగా సింహ విరుద్ధజన్తువును రక్షించుట మాకు మఱియొక వింత.

**విశేషములు:–**

1) మధ్యము అనగా నడుము అని ఒక అర్థము. ఆది మధ్య అంతములలో నున్న మధ్యము అని మఱియొక అర్థము. లక్ష్మీదేవికి ఈ రెండు గుణములు లేవు. ఎట్లనగా –

a) నడుము మిక్కిలి సన్నము అగుటచే లేనట్లే లెక్క.

b) లక్ష్మీదేవి శాశ్వతురాలు. సర్వవ్యాపిని కనుక ఆమెకు మొదలు మధ్య చివరలు అనగా ఆదిమధ్యాన్తములు లేవు. కనుక సంగ్రహముగా మధ్యము లేనిది అని చెప్పబడెను.

c) భూతభవిష్యద్వర్తమానములయిన ప్రపంచములో వర్తమాన ప్రపంచము మధ్యము. ఈ మధ్యము అద్వైత మతముననుసరించి మిథ్య అగును. వాస్తవముగా లేనిది. పరమాత్మయందు మాయచే ఆరోపించబడినది. కాన మధ్యము లేనిది.

2) నరసింహావతారము దశావతారముల మధ్యలోనున్నదిగాన అది మధ్యావతారము.

3) అవతారములన్నియు విరాట్టు నుండి వచ్చును. కనుక హయగ్రీవుడే ఆ విరాట్టు అని సూచన. అట్టి విరాట్టునకు శిరస్సు సత్యలోకము. నడుము అన్తరిక్షము. పాదములు పాతాళము. అన్తరిక్షము అనగా సూర్యచన్ద్రాదులు తిరుగు ఆకాశ భాగము.

"**నాభ్యా ఆసీ దన్తరిక్షం శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత**" అని పురుషసూక్తము. సన్నని నడుము చేత, అనగా లేనట్టున్న నడుముచేత హయగ్రీవుడు తన నడుము అన్తరిక్షమని సూచించుచున్నాడు. తద్ద్వారా తానే విరాట్టు అని సూచన.

4) తానే పరమాత్మ అని, తానే విరాట్టునని, తానే నరసింహావతారమని ఆయన సూచన. నర=నరీయతే=నాశము లేనివాడు. పరమాత్మ అని అర్థము.

5) 'నర'–'హరి మధ్య' అను పదములచేత పైన చెప్పిన విషయములు ఆశ్చర్య జనకములు అనియు వ్యక్తము.

6) సింహ మధ్యుడయ్యును విరోధి అయిన గజమును భక్తి కారణముగా రక్షించుట మఱియొక వింత. కాని సర్పశయనుడు, గరుడవాహనుడు అయిన నీకు ఇది వింత కాదు. సహజమే. ఈ భావమునకు "అపర మివ" అనుచోట 'ఇవ' అను పదము సూచకము.



7) అట్లే భక్తి కారణముగా విరుద్ధజంతువునైనను రక్షించినవాడు నరత్వముగల నన్ను తప్పక రక్షించగలడు – నరహరి మధ్యుడు కావున – అని భావము.

8) వలగ్నేనానేన అను పదమును ఉభయాన్వయిగా చేసినచో వలగ్నము నందు నిర్మధ్యలలనను మోయుచున్నవాడు అని అర్థము వచ్చును.

**– రోమావళి వర్ణన –**

**శ్లో॥ అపూర్వాత్మామ్భోజాభిపతదళిమాలా తుహిన రు**
**గ్దృషత్తీర్థచ్ఛాయా వ్యతికరసితా బ్రూత ఇవ తే।**
**ప్రపన్న ప్రస్తార ప్రబల మల సంక్షాళన యశః**
**ప్రభో! నః శ్రీశ! త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 27**

**ప్రతిపదార్థము:–** హే ప్రభో!=ఓ ప్రభూ!, హే శ్రీశ!=ఓ లక్ష్మీపతీ!, అపూర్వాత్మా..... మాలా – అపూర్వ=నూతనమైన, ఆత్మ=తన యొక్క(నీ యొక్క), అమ్భోజ=(నాభి అనెడు) పద్మమునకు, అభిపతత్=అభిముఖముగా ప్రసరించు, అళిమాలా= (రోమావళి అనెడు)తుమ్మెదల వరుస, తుహిన......సితా–తుహినరుగ్దృషత్=చంద్ర కాన్తమణి మయమైన, తీర్థ=మెట్టుల యొక్క (త్రివళుల యొక్క), ఛాయా=కాన్తి యొక్క, వ్యతికర=సంబంధము చేత, సితా=తెల్లనిది అగుచూ, తే=నీ యొక్క, ప్రపన్న ...యశ –ప్రపన్న ప్రస్తార=భక్త సమూహముయొక్క, ప్రబల=గొప్పదియగు,మల= మాలిన్యమును, సంక్షాళన=కడిగివేయువాడు అను, యశః=కీర్తిని, నః=మమ్ములను గురించి, బ్రూతే ఇవ=చెప్పుచున్నచో అనునట్లున్నది. ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్నవాడవును, హయవదనమ్=అశ్వముఖుడవును, అగు, (త్వామ్= నిన్ను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! అపూర్వమైన నీ నాభి అనెడు పద్మమునందలి మకరందమును గ్రోలుటకు ఆ నాభికి అభిముఖముగా రోమావళి అనెడు తుమ్మెదల వరుస పోవు చున్నది. ఆ తుమ్మెదల వరుస సహజముగా నల్లనిదే అయినను నీ ఉదరమునందలి త్రివళులు (మూడు ముడుతలు) అనెడు చన్ద్రకాన్తమణిమయమైన మెట్లనుండి పయనించుటచే వాటి యొక్క తెల్లని కాన్తివలన తాను కూడ నల్లదనమును పోగొట్టు కొని తెల్లనిది అయినది. ఈ విధముగా తెల్లనిది అయిన తుమ్మెదల వరుస 'నీవు పతితపావనుడవు. నిన్ను ఆశ్రయించిన నీ భక్తసమూహము

యొక్క మాలిన్యమును కడగివేయువాడవు" అను నీ కీర్తిని మాకు చాటి చెప్పుచున్నదా అనునట్లున్నది.

**విశేషములు:-**

1) హయగ్రీవుడు సహజముగా తెల్లనివాడు. కాన ఆయన రోమావళి కూడ తెల్లనిదే! అయినను ఆ తెల్లదనమునకు కారణము త్రివళుల కాన్తి సంపర్కమే అయి ఉండవచ్చునని కవి ఉత్ప్రేక్షించుచున్నాడు.

2) హయగ్రీవుడు తనను ఆశ్రయించిన భక్తుల మాలిన్యమును కడగివైచి వారికి ముక్తిని ఒసగును అను కీర్తి కలిగినవాడు. ప్రకృతమున తుమ్మెదల వరుస ఆయన యొక్క నాభికి అభిముఖముగా పోవుచుండుటచే ఆయనకు భక్తుని వంటిది అయినది. దానిలోని నల్లదనము అను మాలిన్యమును పోగొట్టి తెల్లదనమును ఇచ్చుటచే హయగ్రీవుడు రోమావళికి సారూప్యముక్తిని ఇచ్చినట్లైనది. ఈ విషయమును తుమ్మెదల వరుస మనకు చెప్పుచున్నట్లుగానున్నది.

3) నాభిని అపూర్వమైనదిగా కవి చెప్పినాడు. అనగా అసాధారణమైనది, ఎక్కువ మకరందము కలిగినది అని తెలియుచున్నది. అందువలననే సామాన్య పద్మము నందు ఒక తుమ్మెదకే సరిపడు తేనె యుండును. నాభి అనెడు పద్మమునందు మాత్రము తుమ్మెదలవరుస ప్రవేశించుచున్నను ఈనాటి వరకు తేనె అన్నింటికి లభించుచునే యున్నది. కాన ఈ నాభి అనెడు పద్మము అపూర్వమైనది.

### - హయగ్రీవుని త్రివళివర్ణన -

**శ్లో॥ జగత్త్రేతాధార త్రివళి లలితోదార జఠర**
**ప్రభా ధ్యాతృ ప్రత్త ప్రథమలపితత్రయ్యభినుతమ్।**
**తనుచ్ఛాయా హ్రాదిన్యభినవ తరఙ్గ త్రివళికా**
**లస న్నాభీపద్మం హయవదన మిన్దుస్థిత మయే॥ 28**

ప్రతిపదార్థము:- జగత్త్రేతాధార ... త్రయ్యభినుతమ్-జగత్త్రేతాధార=ముల్లోకములకు ఆధారమైనదియు, త్రివళిలలిత=మూడు ముడుతలతో అందమైనదియు, ఉదార= గొప్పదియును అగు, జఠర=ఉదరము యొక్క ప్రభా=కాన్తిని, ధ్యాతృ=ధ్యానము చేయువారలకు, ప్రత్త= ఈయబడిన, ప్రథమలపితత్రయా=మూడు వేదములచే, అభినుతమ్=స్తోత్రము చేయబడిన వాడును, తనుచ్ఛాయా....పద్మం -తనుచ్ఛాయా=



శరీరకాన్తి అనెడు, హ్రాదినీ=నదికి, అభినవ తరఙ్గత్=నూతన తరఙ్గములవలెనున్న, త్రివళికా=మూడు ముడుతలతో, లసత్=ప్రకాశించుచున్న, నాభీపద్మమ్=బొడ్డు అనెడి పద్మముకలవాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్నవాడును, అగు, హయ వదనమ్ =హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** ఓ హయగ్రీవా! నీ ఉదరము లోపల మూడు లోకములు విడివిడిగా కలవు. అందువలననే నీ ఉదరముపై భాగమున మూడు ముడుతలు కనపడు చున్నవి. ఈ మూడు ముడుతలతో కూడిన గొప్పది యగు నీ ఉదరమును ధ్యానించు వారలకు నీవు మూడు వేదములను ఇచ్చెదవు. ఆ వేదములచే స్తుతింప బడిన వాడవును నీవే. మరియును, నీ శరీరకాంతి అనెడు నది నుండి వచ్చు నూతనమైన తరంగములవలె నున్న మూడు ముడతలతో నీ నాభి అను పద్మము విరాజిల్లు చున్నది. అట్టి నిన్ను నేను శరణు వేడుచున్నాను.

### - లక్ష్మీదేవి త్రివళివర్ణన -

**శ్లో॥ మహేన్ద్రాశ్మస్తోమ స్థగిత పథ కార్తస్వరమయ**
**జ్వల త్తీర్థత్రేతాభిగమ సుభగ స్వర్ణ సరసీమ్।**
**దృశా సౌన్దర్యోర్వీం సితజలజ శోభాహరణయా**
**బహూకుర్వన్తం తం హయవదన మిన్దుస్థిత మయే॥ 29**

**ప్రతిపదార్థము:-**మహేన్ద్రాశ్మ....స్వర్ణస్వరసీమ్-మహేన్ద్రాశ్మస్తోమ=ఇన్ద్రనీలమణుల సముదాయముతో, స్థగిత=బిగించబడిన. పథ=మార్గముతో కూడిన, కార్తస్వరమయ =స్వర్ణమయమైన, జ్వలత్తీర్థత్రేతా=ప్రకాశమానమైన మూడు మెట్లను, అభిగమ= పొందుటచేత, సుభగ స్వర్ణసరసీమ్=అందమైన బంగారు సరస్సు కలదియును, సౌన్దర్యోర్వీమ్=సౌన్దర్యమునకు స్థానము అయినదియును అగు లక్ష్మీదేవిని, సితజలజ శోభా హరణయా=తెల్లనిపద్మముయొక్క శోభను హరించు, దృశా=తన చూపుతో, బహూకుర్వన్తమ్=గౌరవించు, తం హయవదనమ్=ఆ హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :-** బంగారుకాంతి గల లక్ష్మీదేవి యొక్క నాభి బంగారు నేలయందు త్రవ్వబడిన సరస్సువలెనున్నది. ఆ సరస్సులో ప్రవేశించుటకు ఇన్ద్రనీలమణులు బిగించబడిన మూడుమెట్లుకల బంగారు మార్గమో అనునట్లుగా రోమావళి,

త్రివళులు కలవు. అట్టి నాభికలదియును, సౌన్దర్యమునకు స్థానము ఐనదియును అగు లక్ష్మీదేవిని తెల్లని తన చూపులతో విలాసముగా చూచుచున్న హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు :-** బంగారు సరస్సు వంటి నాభి గల లక్ష్మీదేవిని తెల్లని పద్మము వంటి చూపుతో బహూకరించుచున్నాడు అనుటలో హయగ్రీవుడు లక్ష్మీ నాభి సరస్సునకు ఒక తెల్లని పద్మమును బహుమతిగా ఇచ్చుచున్నట్లు ధ్వని. దీనిలో హయగ్రీవుని శృంగారచేష్ట వ్యక్తమగుచున్నది.

**- స్తనవర్ణన -**

**శ్లో॥ స్వశోభాసన్తాన వ్యతికలన ముక్తాభి రివ హా**
**వృతం ముక్తాభి స్స్వం స్తనయుగ ముదుచ్చాన మమలమ్**
**తులస్యా పూజన్త్యా పరినుతగుణం భృఙ్గనినదైః**
**ప్రపన్న స్వర్భూజం హయవదన మిన్దుస్థిత మయే॥ 30**

**ప్రతిపదార్థము:-** హా!=ఎంత ఆశ్చర్యము!, స్వశో...ముక్తాభి-స్వ=తన యొక్క (హయగ్రీవుని రెండు స్తనములయొక్క), శోభాసన్తాన=కాన్తి సమూహము యొక్క వ్యతికలన =సంపర్కముచేత, ముక్తాభిః=ముక్తిని పొందిన (సారూప్యము అను ముక్తిని పొందిన), ముక్తాభిః=ముత్యములతో,వృతమ్=ఆవరింపబడినదియును, ఉదుచ్చానమ్ = కొంచెముగా ఉన్నతమైనదియును, అమలమ్= నిర్మలమైనదియును అగు, స్వమ్=నీ, స్తనయుగమ్=రెండు స్తనములను, పూజన్త్యా= పూజచేయుచున్న, తులస్యా=తులసీ మాలచేత, భృఙ్గనినదైః=తుమ్మెదల ధ్వనుల ద్వారా, పరినుత గుణమ్ =స్తోత్రము చేయబడుచున్న గుణములు కలవాడును, ప్రపన్నస్వర్భూజమ్=భక్తుల పాలిటి కల్పవృక్షమైన వాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు వుండువాడును అగు, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :-** భక్తులపాలిట కల్పవృక్షమైన ఓ హయగ్రీవా! నీ కంఠమున గల ముత్యముల హారములు నీ రెండు స్తనముల మీదుగా పడుచూ వాటి కాన్తి సంపర్కము చేత సారూప్యముక్తిని పొందినవి. నిరన్తరము భగవన్తుని ధ్యానించుట ద్వారా భగవన్తుని కాన్తితో సంబన్ధము కలవారే కదా ముక్తులు. ముత్యములును భగవంతుని స్తనములతో నిత్యము సంబన్ధము కలిగియుండుటచే వాటివలె తెల్లని



కాన్తిని పొందినవి. వాటివలె గుండ్రముగానున్నవి. అందువలన ముత్యములు ముక్తిని పొందినవి అను విషయములో సందేహము లేదు. ఈ విధముగా ముక్తిని పొందుట చేతనే వాటికి ముక్తలు అను పేరు వచ్చినది. లేనియెడల జలబిన్దు స్వరూపములైన వాటికి ముక్తలు అను పేరు ఎట్లు వచ్చును? తెల్లని కాన్తి ఎట్లువచ్చును? ఇట్టి ముత్యములతో నీ స్తనములు రెండునూ కప్పివేయబడినవి. అట్టి స్తనములపై తులసీ మాలలు కూడా కలవు. ఆ తులసీ మాలలు తమయందు ఉండు తుమ్మెదల ఝుంకారము ద్వారా భగవంతుని గుణగణములను స్తోత్రము చేయుచున్నవా అనునట్లున్నది.

**- శ్రీవత్సవర్ణన (31-34) -**

**శ్లో॥ సుధీ ధీమన్థాద్ర్యున్మథిత తనుభా దుగ్ధజలధి**
**ప్రభూతాపూర్వేన్ద్రోపల మివ మహోరస్స్థలగతమ్।**
**సితామ్భోజాతస్థం భ్రమర మివ సవ్యేరసి ముదా**
**దధానం శ్రీవత్సం హయవదన మిన్దుస్థిత మయే॥ 31**

**ప్రతిపదార్థము :-** మహోరస్థలగతమ్=గొప్ప వక్షస్థలమును పొందినటువంటి, సుధీ....మివ-సుధీ=విద్వాంసుల యొక్క (యోగుల యొక్క), ధీ=బుద్ధి అనెడి, మన్థాద్రి=మందర పర్వతము చేత, ఉన్మథిత=బాగుగ మథించబడిన, తనుభా= శరీర కాంతి అనెడి, దుగ్ధజలధి=పాలసముద్రము నుండి, ప్రభూత=పుట్టిన, అపూర్వ =క్రొత్తది ఐన(విలక్షణమైన), ఇన్ద్రోపలమివ=ఇన్ద్రనీలమణివలె ఉన్నటువంటిదియును, సితామ్భోజాతస్థమ్=తెల్లనిపద్మమునందున్న, భ్రమర మివ=తుమ్మెదవలె వున్నటువంటి దియును అగు, శ్రీవత్సమ్=శ్రీవత్సము అను పుట్టుమచ్చను, సవ్యేరసి =ఎడమ వక్షస్స్థలము నందు, ముదా=సంతోషముతో, దధానమ్=ధరించుచున్న వాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు వున్నవాడును అగు, హయవదనమ్= హయగ్రీవుని (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :-** హయగ్రీవుని వక్షస్స్థలము యొక్క ఎడమ భాగమునందు శ్రీవత్సము అను పేరుగల నల్లని అందమైన పుట్టుమచ్చ కలదు. అది ఎట్లున్నదనగా ఆయన శరీరము యొక్క తెల్లని కాంతి అనెడు పాల సముద్రమును యోగులు తమ బుద్ధి అనెడు మందర పర్వతముతో బాగుగా మథించగా ఆ పాలసముద్రము నుండి

పుట్టిన విలక్షణమైన ఇంద్రనీలమణివలె వున్నది. మఱియును, తెల్లని పద్మము నందున్న నల్లని తుమ్మెదవలె వున్నది. అట్టి పుట్టుమచ్చను ధరించియున్న హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :- పాలసముద్రమును మథించగా అందునుండి కౌస్తుభము అను పచ్చనిమణి ఉద్భవించినది. దానిని విష్ణువు కంఠమున ధరించినాడు. హయగ్రీవుని శరీరకాంతి అనెడి పాలసముద్రమును యోగులు బుద్ధి అనెడు మందరపర్వతముతో మథించగా నల్లని ఇంద్రనీలమణి పుట్టినది. కాన ఇది అపూర్వము, విలక్షణము. దానిని కంఠమున ధరించిన రెంటికిని సవతులవలె విరోధము వచ్చునను భయముతో హయగ్రీవుడు కంఠమున కాక వక్షస్స్థలమునందు ధరించినాడు అని కవి చమత్కారము. మఱియును 'కౌస్తుభమణి గొప్పశ్రమతో మథించగా పుట్టినది. ఈ ఇంద్రనీలమణి మాత్రము అనాయాసముగా తన శరీర కాంతియందు పుట్టినది అను కారణముతో సంతోషముతో ధరించినాడు' అని కవి చెప్పుచున్నాడు.

**శ్లో॥ సహాఙ్క త్వద్వక్షః కలన విమలాత్మా హిమరుచిః**
**సహాఙ్కం స్వమ్ బిమ్బం స్మితవిలసనై ర్దర్శయతి నః।**
**హరి ద్వన్ద్వాశ్మాభా వ్యతికలనజాపూర్వసుషమా**
**క్వ వేయం లోకే త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 32**

**ప్రతిపదార్థము** :- (ప్రభో!=ఓ ప్రభూ! హయగ్రీవా!) సహాఙ్క=మచ్చతో కూడిన, త్వ ద్వక్షః=నీ వక్షఃస్థలము యొక్క, కలన=దర్శనము చేత, విమల=నిర్మలమైన, ఆత్మా= మనస్సుకల, హిమరుచిః=చన్ద్రుడు, నః=మాకు, సహాఙ్కమ్=మచ్చతో కూడిన, స్వమ్=తనదియగు, బిమ్బమ్=బిమ్బమును, స్మిత విలసనైః=నవ్వుయొక్క విలాసములతో (వెన్నెలలతో), దర్శయతి=చూపుచున్నాడు. హరి ద్వన్ద్వ=ఇన్ద్ర చన్ద్రుల యొక్క, అశ్మ= ఱాళ్ళయొక్క(మణులయొక్క), ఆభా=కాన్తుల యొక్క, వ్యతికలన= మేళనము చేత, జా=పుట్టిన, ఇయమ్=ఈ, అపూర్వ=కొత్తదియైన, సుషమా=గొప్ప శోభ, లోకే= లోకము నందు, క్వవా=ఎక్కడ? ఇన్దుస్థితమ్=చన్ద్రునియందుఉన్నవాడవును, హయవదనమ్ =హయగ్రీవుడవును అగు, త్వామ్=నిన్ను, అహమ్=నేను, అయే= పొందుచున్నాను.



**తాత్పర్యము** :- ఓ హయగ్రీవా! చన్ద్రుడు తనయందు కళంకము ఉండుటచే జనులు తనను చూసి పరిహసింతురను సంకోచముతో ఉండెడువాడు. ఆ చన్ద్రుడు వక్షస్థ్సలమునందు శ్రీవత్సము అను మచ్చగల నిన్ను చూచిన పిమ్మట సర్వేశ్వరుడు భగవంతుడును అయిన హయగ్రీవునికే మచ్చ ఉండగా నా మచ్చను చూసి జనులు ఏల పరిహసింతురు? అను ధైర్యముతో వెనుకటి సంకోచమును వీడి తన ముఖమును నవ్వులు అనెడి విలాసములతో (వెన్నెలలతో) మాకు చూపుచున్నాడు. అశ్వానవా! నీవు చంద్రకాన్తమణి వలె తెల్లని కాన్తికల వాడవు. నీ పుట్టుమచ్చ ఇన్ద్రనీలమణివలె నల్లని కాన్తికలది. రెంటి కాన్తుల మేళనముచేత ఏర్పడిన గొప్ప శోభ లోకమునందు మరెచ్చటను లేదు కదా! అట్టి విలక్షణశోభ కలిగిన నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :- 1. చంద్రునికి మచ్చ ఉన్నను, ఆ మచ్చకు కాంతి లేదు. కాన అది శోభాహీనమైనది. నీ పుట్టుమచ్చ మాత్రము ఇన్ద్రనీలమణివలె మెరయుచున్నది. కాన చంద్రునకు నీతో సంపూర్ణముగ పోలిక లేదు. కాన చన్ద్రునకు గల ఈ సన్తోషము వ్యర్థమైనది. విలక్షణశోభగల నీ వక్షసలము ఉండగా చన్ద్రుడు ఉదయించుట కూడా వ్యర్థము అని కవి ఆశయము. 2) హయగ్రీవుని నిరన్తరము ధ్యానించుటచేత కవియొక్క హృదయమునందు చన్ద్రకాన్తమణి, ఇన్ద్రనీలమణుల మిళిత శోభవలె ఒక గొప్ప శోభ ఉదయించినది. అది లోకమునందు మరెచ్చటను లేదు అని కవి తాత్పర్యము. 3) మచ్చ కలిగిన నీవు నా హృదయమునందు ఉండుటచే అచట విలక్షణ శోభ ఏర్పడినది. లోకమునందు మచ్చకలిగిన చన్ద్రుడు ఉన్నను అచట విలక్షణ శోభలేదు. కేవలము తెల్లని కాన్తి మాత్రమే ఉన్నది అని కూడా కవి తాత్పర్యము.

**శ్లో॥ తవోరః పద్మస్రఙ్నిలయ బహుళ శ్రీపదపదం**
**నిరీక్షన్త్యా లక్ష్మ్యా లగతి కి మపాఙ్గ స్త్వదురసి।**
**హరి ర్లక్ష్మీవక్షా వ్యభిచరతి నేతి స్మృతి రతః**
**ప్రకృష్టప్రజ్ఞ! త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 33**

**ప్రతిపదార్థము** :-హే ప్రకృష్ట ప్రజ్ఞ!=గొప్ప ప్రజ్ఞ కలిగినవాడా! (భక్తులకు గొప్ప ప్రజ్ఞను ఇచ్చువాడా! అని కూడా అర్థము వచ్చును), పద్మ.....పదమ్-పద్మస్రఙ్నిలయ

=పద్మమాల యందు పుట్టిన, బహుళ= గొప్పదియగు, శ్రీ=శోభ అనెడు, పద= వస్తువునకు, పదమ్=స్థానముఅగు, (పద్మస్రజ్నిలయ=పద్మమాల యందు పుట్టిన, బహుళ=భక్తులకు అనేక సంపదలను ఇచ్చు, శ్రీ=లక్ష్మీదేవి యొక్క, పద= పాదములకు, పదమ్=స్థానముఅగు అనుఅర్థము కూడా ధ్వనించుచున్నది) తవ= నీయొక్క, ఉరః=వక్షస్స్థలమును, నిరీక్షన్త్యాః=చూచుచున్న, లక్ష్మ్యాః=లక్ష్మీదేవియొక్క, అపాఙ్గః=క్రీగంటి చూపు, త్వదురసి=నీ వక్షస్స్థలమునందు, లగతి కిమ్?=(శ్రీ వత్సము అను పుట్టుమచ్చ రూపమున) లగ్నమైనదా ఏమి?, అతః= అందువలన, (హయగ్రీవుని వక్షస్స్థలమునందు లక్ష్మీదేవి యొక్క అపాంగము లగ్నమగుట వలన మరియు హయగ్రీవుని వక్షస్స్థలము పద్మస్రజ్నిలయ బహుళశ్రీ పదపదము అగుట వలన), హరిః=విష్ణుమూర్తి, లక్ష్మీవక్షాః=లక్ష్మీదేవి వక్షస్స్థలము నందు కలవాడు, ఇతి=అను, స్మృతి= పెద్దల మాట, న వ్యభిచరతి= తప్పుకాకున్నది. ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్నవాడవును, హయవదనమ్= హయగ్రీవుడవును అగు, త్వామ్=నిన్ను, అహమ్=నేను, అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :–** సర్వజ్ఞుడవైన ఓ హయగ్రీవా! నీ వక్షస్స్థలమునందు కల పద్మమాల యందు గొప్ప శోభ పుట్టుచున్నది. ఆ శోభకు నీ వక్షస్స్థలము ఆశ్రయము అగుచున్నది. అట్టి నీ వక్షస్స్థలమును లక్ష్మీదేవి చూచుచుండుటచేత ఆమెయొక్క క్రీగంటిచూపు పుట్టుమచ్చగా నీ వక్షస్స్థలమున లగ్నమైనదా ఏమి? అందువలననే విష్ణువు యొక్క వక్షస్స్థలమున లక్ష్మియుండును' అను పెద్దలమాట యథార్థమగు చున్నది.

**విశేషములు :–** విష్ణువు యొక్క అవతారము అగు హయగ్రీవుని యొక్క ఎడమతొడ యందు లక్ష్మీదేవి యుండును. కాని విష్ణువుయొక్క వక్షస్స్థలమునందు లక్ష్మి ఉండునని పెద్దలు చెప్పెదరు. ఇది ఎట్లు పొసగును అను సంశయమునకు కవి చమత్కారముగా సమాధానమును ఇట్లు చెప్పుచున్నాడు. హయగ్రీవుని వక్షస్స్థలము 'పద్మస్రజ్నిలయ బహుళశ్రీ పదపదము' అనగా హయగ్రీవుడు పద్మమాలలచే అలంకరింపబడినవాడు అగుటచే ఆ పద్మమాలల యందు పుట్టిన లక్ష్మి(శోభ) ఆయన వక్షస్స్థలమునందు భాసించు చున్నది. కాన శోభ ఉండుటచే లక్ష్మి వక్ష స్స్థలమునందు ఉన్నదని పెద్దలు అనుచున్నారు. ఇన్దుస్థితమ్=చంద్రమండల నివాసి



ఐన, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను. శ్రీ అను పదమునకు లక్ష్మీదేవి, శోభ అను రెండు అర్థములు కలవు. ఇంతే కాని లక్ష్మీదేవి అను పేరున ఒకస్త్రీ ఆయన వక్షస్స్థలమున లేదు. మరియును, అంతటి శోభ కల ఆయన వక్షస్స్థలమును ఆయన వామాంకము నందుకల లక్ష్మీదేవి ఆసక్తితో చూచుచున్నది. ఆమెయొక్క నల్లని క్రీగంటి చూపు పుట్టుమచ్చ రూపమున హయగ్రీవుని వక్షస్స్థలమున విరాజిల్లుచున్నది. ఇట్లు లక్ష్మీదేవి యొక్క కటాక్ష వీక్షణము పుట్టుమచ్చ రూపమున హయగ్రీవుని వక్షస్స్థలమున ఉండుటచే హయగ్రీవుని వక్షస్స్థలమున లక్ష్మి ఉన్నదని అను చున్నారు. వాస్తవమునకు లక్ష్మీదేవి హయగ్రీవుని వామాంకమున కలదు కాని, వక్షస్స్థలమున కాదు. అయినను విష్ణువు లక్ష్మీవక్షస్కుడు అను పెద్దల మాట తప్పుకాదు. అని కవియొక్క ఆశయము.

**శ్లో॥ శ్రియ శ్శోభాయాః కి న్న్వజని కి మత శ్శ్రీ రుదగమత్**
**శ్రియా యుక్తం వత్సం కిము తవ పదత్వేన భజతే।**
**అత శ్శ్రీ ర్వత్సే తే భవతి కి మిదం లక్ష్మ రుచిరం**
**హరే! శ్రీవత్సాఖ్యం హయవదన మిన్దుస్థిత మయే॥** **34**

**ప్రతిపదార్థము :–** హే హరే!=ఓ హరీ!, ఇదమ్=ఈ, రుచిరమ్=అందమైన, శ్రీవత్సాఖ్యమ్=శ్రీవత్సము అను పేరుగల, లక్ష్మ=పుట్టుమచ్చ, శ్రియః=శ్రీ అను పదమునకు అర్థమైన, శోభాయాః=శోభనుండి, అజని కిం ను?=పుట్టినదా ఏమి? (లేక), అతః=ఈ మచ్చ నుండియే, శ్రీః=శోభ, ఉదగమత్ కిమ్?=పుట్టినదా? (లేక) శ్రియా= లక్ష్మీదేవిచేత, యుక్తమ్=కూడిన, తవ=నీయొక్క, వత్సమ్= వక్షస్స్థలమును, పదత్వేన=స్థానముగా, భజతే కిము=పొందుచున్నదా? (లేక) అతః = ఈ పుట్టుమచ్చ నుండియే, శ్రీః=లక్ష్మీదేవి, తే=నీయొక్క, వత్సే=వక్షస్స్థలము నందు, భవతి కిమ్?= నివసించుచున్నదా? ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు వున్న, హయవదనమ్=హయ గ్రీవుని (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :–** ఓ హరీ! నీ వక్షస్స్థలమునందు వున్న శ్రీవత్సము అను పేరుగల పుట్టుమచ్చ చాలా మనోహరముగా వున్నది. అందువలన మాకు అనేక విధములుగా సంశయములు వచ్చుచున్నవి. ఎట్లనగా– లక్ష్మీదేవి యొక్క శోభనుండియే సాక్షాత్తుగా

ఈ పుట్టుమచ్చ పుట్టినదా అని ఒక సందేహము. అందువలననే దీనికి ఇంతటి శోభ వచ్చియుండును అని ఊహించుచున్నాము. లేదా ఈ పుట్టుమచ్చ లక్ష్మీదేవి కంటే అధికమైన శోభ కలది అగుటచే ఈ పుట్టుమచ్చనుండియే లక్ష్మీదేవి పుట్టియుండునా అని మఱియొక సంశయము. లేదా లక్ష్మీదేవితో కూడియున్న నీ వక్షస్థలమును ఉత్పత్తిస్థానముగా పొందినదా! అని ఇంకొక సంశయము. లేక ఈ మచ్చనుండియే నీ వక్షస్థలము నందు లక్ష్మి (శోభ) పుట్టుచున్నదా! అని వేరొక సంశయము. ఈ విధముగా పలురకముల సంశయములను కలిగించు కాంతికల పుట్టుమచ్చ కలిగిన ఓ హయగ్రీవా! నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు :–** భక్తుల అజ్ఞానమును పోగొట్టువాడు అని హరి శబ్దమునకు అర్థము. నా అజ్ఞానమును నాశనము చేయుట కొరకు నిన్ను నేను సేవించుచున్నాను అని సూచించుటకు హరిశబ్దముతో కవి సంబోధించుచున్నాడు విష్ణుమూర్తి వక్షస్థలము నందు గల పుట్టుమచ్చకు శ్రీవత్సము అనుపేరు కలదు. ఆ పేరునకు నాలుగు రకములుగా విగ్రహములు చెప్పవచ్చును. ఎట్లు చెప్పినను ఆ అర్థము చక్కగా సరిపోవుచున్నందున ఏ అర్థము స్వీకరించవలెనని సంశయము.

1. శ్రియః వత్సః=శ్రీవత్సః–షష్ఠీతత్పురుష సమాసము. శ్రియః=శోభ యొక్క, వత్సః=సంతానము.

2. శ్రీః వత్సా యస్య తత్=శ్రీవత్సమ్–బహువ్రీహి సమాసము. శ్రీః =శోభ, వత్సా=సంతానము, యస్య=ఏ పుట్టుమచ్చకో, తత్=ఆ పుట్టుమచ్చ

3. శ్రీయుక్తం వత్సమ్=శ్రీవత్సమ్–మధ్యమపదలోపి సమాసము. శ్రీవత్సం అస్య అస్తి ఇతి=శ్రీవత్సమ్ (అర్శ ఆద్యచ్) శ్రీయుక్తం= లక్ష్మీదేవితో కూడిన, వత్సం= వక్షస్థలము, అస్య= పుట్టుమచ్చకు, శ్రీవత్సం అస్య అస్తి ఇతి=శ్రీవత్సమ్ (అర్శ ఆద్యచ్) అస్తి ఉత్పత్తిస్థానముగా కలదో

4. శ్రీః వత్సే యస్మాత్ తత్–బహువ్రీహి సమాసము. శ్రీః=లక్ష్మి, వత్సే= వక్షస్థలమునందు, యస్మాత్=ఏ పుట్టుమచ్చవలన నివసించుచున్నదో, తత్= ఆ పుట్టుమచ్చ. ఈ నాలుగు సంశయములు శ్లోకమున వర్ణింపబడినవి.

**– లక్ష్మీదేవిస్తనద్వయవర్ణన –**

**శ్లో॥ స్తనచ్ఛాయోన్మేష స్థగిత మణి హారావళి రుచి**
**ప్రఫుల్లాస్మచ్చేతః కమల సదన శ్రీ సహచరమ్।**



**రమాచక్ర ద్వన్ద్వావిరత తమ సంయుక్త్యనుమిత**
**ప్రతాపాదిత్యం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 35**

**ప్రతిపదార్థము :–** స్తన .....సహచరమ్–స్తనచ్ఛాయోన్మేష=స్తనకాంత్యతిశయముచేత, స్థగిత=పూతపూయబడిన, మణిహారావళి రుచి=మణిమయమైన హార సముదాయము యొక్క కాంతిచేత, ప్రఫుల్ల=వికసించిన, అస్మచ్చేతః కమల=మా మనస్సు అనెడి పద్మమునందు, సదన=ఉన్న, శ్రీ=లక్ష్మీదేవికి, సహచరమ్ = తోడుగా వున్నవాడవును, రమా.... ప్రతాపాదిత్యమ్–రమాచక్ర ద్వంద్వ=లక్ష్మీదేవియొక్క రెండు స్తనములు అనెడి చక్రవాకపు పక్షులజంటయొక్క, అవిరత తమ సంయుక్తి=అత్యన్త సంయోగము చేత, అనుమిత=ఊహింపబడిన, ప్రతిపాదిత్యమ్=ప్రతాపము అనెడి సూర్యుడు కలిగిన వాడవును, ఇన్దుస్థితమ్= చన్ద్రునియందు ఉన్నవాడవును, హయవదనమ్= అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=శరణు పొందు చున్నాను.

**తాత్పర్యము :–** ఓ హయగ్రీవా! నీ వామాంకమునందున్న లక్ష్మీదేవి స్తనములపై అనేక మణిహారములు కలవు. ఆ మణిహారములు సహజముగా గొప్పకాంతి కలవి ఐనను, వాటికంటే గొప్పకాంతి కల స్తనముల సమీపమున ఉండుటచే స్తనముల కాన్తితో పూతపూయబడినవో అనునట్లుండుటచే మరింత మెరయుచున్నవి. అట్లు మెరయుచున్న మణిహారములతో మా మనస్సు అను పద్మము వికసించగా అందు లక్ష్మీదేవితో కలసి నీవు ఉంటివి. మరియును లక్ష్మీదేవి యొక్క రెండు స్తనములు అనెడి చక్రవాక పక్షుల జంట బాగుగా కలసివున్నది. సామాన్యముగా చక్రవాకపక్షులు సూర్యుడు వున్న సమయములోనే కదా కలసి యుండునది. స్తనములు అనెడు చక్రవాక పక్షులు అత్యంత సంయోగము వలన నీయందు ప్రతాపము అను సూర్యుడు ఉన్నట్లుగా మేము ఊహించుచున్నాము. చన్ద్రమణ్డలము నందు ఉండు ఓ హయగ్రీవా! అట్టి నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు :–**తన మనస్సుయందు లక్ష్మీసహచరుడై కొలువుదీరిన హయగ్రీవుని కవి వర్ణించుచున్నాడు. ఈ శ్లోకమునందు మణిహారావళి స్తనకాన్తులతో పూత పూయబడినది అని వర్ణించుటచే బంగారు ద్రవముతో పూతపూయబడిన రాగితో మణిహారావళికి పోలిక ధ్వనించుచున్నది. మరియును మణిహారావళి కంటె స్తనములు అధికమైన కాంతి కలవి అని కూడా తెలియుచున్నది. మణిహారావళి

యొక్క కాంతి సూర్యకాన్తితో సమానమైనది అగుట వలన సామాన్యపద్మములు వికసించవచ్చును. కాని మనస్సు అనెడి పద్మము వికసించుటకు మణిహారావళి కాంతి చాలదు. అందువలన మణిహారావళికి స్తనకాంతితో పూత అవసరమైనది అనికూడా తెలియుచున్నది. మనస్సునకు వికాసము అనగా ఆనందము అని అర్థము. ఆ ఆనందము కేవలము హారములను చూచుటవలన కలుగదు. ఆమె స్తనములను చూచినపుడే కలుగును కావున కవి ఇట్లు వర్ణించినాడు. ఇది ఎంతయో యుక్తము. బ్రహ్మశ్రీ వేదమూర్తులు శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారు 'నాకు తోచిన మాట' అను గ్రంథములో ఇట్లు వ్రాసినారు. **స్త్రీయొక్క ముఖము చూసి సంతోషించువాడు తండ్రి. ఆమె నాభి క్రింది ప్రదేశము చూసి సంతోషించే వాడు భర్త. కేవలము స్తనములను చూసి సంతోషించువాడు పుత్రుడు** అని.

కావుననే భక్తులమగు మనము ఆమెకు పుత్రులతో సమానమగుటచే మనకు ఆమె స్తనదర్శనముచే ఆనందము కలుగుట సహజము.

**– కౌస్తుభమణివర్ణన(36,37) –**

**శ్లో॥ శ్రియం త్వత్తోఽధ్యేతుం తవ కిముపకణ్ఠం విజయతే**
**గళచ్ఛాయా మగ్నః కిము రుచి రసాలేపన కృతే।**
**త్వయా సారూప్యార్థం కిము ను విధృతః కౌస్తుభమణిః**
**వద శ్రీమన్! తం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 36**

**ప్రతిపదార్థము** :– హే శ్రీమన్!=శోభకు నిధివంటి వాడా! ఓ హయగ్రీవా!, త్వత్తః =నీనుండి, శ్రియమ్=శోభను, అధ్యేతుమ్=నేర్చుకొనుటకు, కౌస్తుభమణిః= కౌస్తుభము అనుపేరు కల మణి, తవ=నీయొక్క, ఉపకణ్ఠమ్=కణ్ఠము యొక్క సమీపము నందు, విజయతే కిమ్?=విరాజిల్లుచున్నదా? రుచిరసాలేపన కృతే=నీ కణ్ఠకాన్తితో పూత పూసికొనుట కొరకు, గళచ్ఛాయా=కణ్ఠకాన్తి యందు, మగ్నః కిము=మునిగి పోయినదా ఏమి? సారూప్యార్థమ్=నీతో సమానమైన రూపమును పొందుటకొరకు, త్వయా=నీచేత, విధృతః కిము ను?=ధరింపబడినదా!, వద= చెప్పుము, తమ్= అటువంటి, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమందు ఉన్నవాడవును, హయవదనమ్= అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను, అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :– ఓ శోభానిధీ! హయగ్రీవా! నీవు కణ్ఠమునందు కౌస్తుభము అను



మణిని ధరించినావు. కౌస్తుభమణిని మించిన శోభ సహజముగనే నీకు కలదు. కాన ఆ మణి నీకు అలంకారము కానేరదు. అయినను దానిని నీవేల ధరించినావు? శిష్యుడు విద్యను నేర్చుకొనుటకై గురువు యొక్క సమీపమున చేరినట్లుగ నీనుండి శోభను నేర్చుకొనుటకు ఆ కౌస్తుభమణియే నీ కణ్ఠమును చేరెనా! రాగి రేకు బంగారు పూతకొరకు బంగారు ద్రవమునందు మునిగినట్లుగా నీ కణ్ఠకాన్తి అనెడు రసముతో పూత పూసికొనుట కొరకు కౌస్తుభమణి నీ కణ్ఠకాన్తిలో మునిగినదా! నీతో సారూప్యమును ఇచ్చుటకై "భ్రమరము కీటకమును వలె" నీవు కౌస్తుభమణిని ధరించితివా! చెప్పుము.

**విశేషము** :– భ్రమరము ఆహారము కొరకు ఏదైనా కీటకమును పట్టుకొనగా ఆ కీటకము భయముతో ఆ భ్రమరమునే ధ్యానించుచుండగా ఇట్టి ధ్యానవశమున ఆ కీటకము అనతి కాలమున భ్రమరమగును. ఇది భ్రమరకీటన్యాయము. అట్లే కౌస్తుభమణికి తనతో సారూప్యము ఇచ్చుటకు హయగ్రీవుడే దయతో దానిని తన కణ్ఠమున ధరించెనా! అని ఒక ఉత్ప్రేక్ష. నన్ను కూడ అట్లే దయతో ధరించి నాకు కూడా సారూప్యము ఇమ్ము అని కవియొక్క ప్రార్థన దీనిలో ధ్వనించుచున్నది.

**శ్లో॥ మణీహారాభిఖ్యాతుల భుజయుగాశ్లిష్ట లలిత**
**స్వసోదర్యాబ్జ శ్రీ రమణ వపురామోహిత రమమ్।**
**తులస్యమ్భోజాతోత్పల ముఖ సుమస్రక్పరిమల**
**ప్రమూర్ఛత్కాష్ఠాభ్రం హయవదన మిన్దుస్థిత మయే॥ 37**

**ప్రతిపదార్థము** :– మణీహారా...రమమ్–మణీహారాభిఖ్య=మణిహారము అను పేరు కల, అతుల=సాటిలేని, భుజయుగ=రెండు భుజముల చేత, ఆశ్లిష్ట=కౌగిలించు కొనబడిన, లలిత=అందమైన, స్వసోదర్య=తన సోదరుడు అగు కౌస్తుభమణి కల, అబ్జ=శంఖము యొక్క (శంఖము వలెనున్న హయగ్రీవుని కణ్ఠము యొక్క) శ్రీ= కాన్తితో, రమణ=అందమైన, వపుః=శరీరముతో, ఆమోహిత=మోహము కలుగ జేయబడిన, రమమ్= లక్ష్మీదేవి కలవాడును, తులస్యమ్భోజాతోత్పల ..... త్కాష్ఠాభ్రమ్ –తులస్యమ్భోజాతోత్పల ముఖ=తులసి, పద్మము, కలువ మొదలుగా గల, సుమ స్రక్పరిమళ=పూలమాలల సువాసనలతో, ప్రమూర్ఛత్=సొమ్మసిల్లిన, కాష్ఠాభ్రమ్ =దిక్కులు, ఆకాశము కలవాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు

వున్నవాడును అగు, హయవదనమ్= హయగ్రీవుని (అహమ్=నేను) అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము** :- హయగ్రీవుని కంఠము శంఖము. అనగా శంఖము వలె అందమైనది. హయగ్రీవుడు కంఠములో వేసికొనిన మణిమయమైన హారమునకు మధ్యలో కౌస్తుభము అను పెద్ద మణి వ్రేలాడుచుండును. దానిని నాయకమణి అని అందురు. కంఠమునకు అటు నిటు వ్రేలాడు హారపు రెండు ప్రక్కలు రెండు భుజములు వంటివి. ఆ రెండు భుజముల మధ్య కౌస్తుభము ఉండుటచే శంఖము తన రెండు భుజములతో తన సోదరుడైన కౌస్తుభమును కౌగిలించుకొనెనా అనునట్లుండెను. (శంఖము, కౌస్తుభము రెండును సముద్రము నుండి పుట్టుటచే ఆ రెండును సోదరులు అగుదురు). అట్టి శంఖము వంటి కంఠము యొక్క కాన్తితో అందమైన శరీరము గల హయగ్రీవుడు లక్ష్మీదేవికి సైతము మోహమును కలుగజేసెను. మరియు హయగ్రీవుడు కంఠమునందు వేసికొనిన తులసీదళ మాలలు, పద్మములు మొదలుగా గల పూలమాలల సువాసనలతో సమస్త దిక్కుల మూలమూల భాగములు సైతము సుగన్ధ భరితములు అగుచున్నవి. (దీనితో కవియొక్క హృదయాకాశము కూడా పరిమళముతో నిండెనని ధ్వనించుచున్నది.) అట్టి హయగ్రీవుని నేను శరణు వేడుచున్నాను.

**- భుజకీర్తులవర్ణన -**

**శ్లో॥ సమాంస వ్యాలమ్బి ప్రతప తపనీయాఞ్చల లస**
**ద్దుకూల ప్రద్యోత ప్రహసిత సురౌకోలహరికమ్।**
**మధుప్రఖ్యక్షౌఘ క్షతజ భుజకీర్తి ప్రతిలస**
**న్మృదు స్థూలాంసం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 38**

**ప్రతిపదార్థము** :- సమాంస... లహరికమ్-సమాంస=సమానముగానున్న మూపుల నుండి, వ్యాలమ్బి=వ్రేలాడుచున్నదియును, ప్రతపతపనీయాఞ్చల =కాచిన బంగారపు అంచుతో, లసత్=ప్రకాశించుచున్నదియును అగు, దుకూల=తెల్లని వస్త్రము యొక్క, ప్రద్యోత=గొప్ప కాన్తి చేత, ప్రహసిత= పరిహాసము చేయబడిన, సురౌకోలహరికమ్ =స్వర్గలోకపు గంగా ప్రవాహము కలవాడవును, మధు ...స్థూలాంసమ్- మధుప్రఖ్య= మధువు మొదలుగాగల, క్ష+ఓఘ=రాక్షస సమూహమును, (క్షః=రాక్షసుడు. 'నామైక



దేశగ్రహణేనామగ్రహణమ్' అను వచనము ననుసరించి రాక్షసః అను పదములోని 'క్ష' అను ఏకదేశమునకు కూడ ఆ అర్థము వచ్చును) క్షతజ=సంహరించుటచే పుట్టిన, భుజకీర్తి=భుజముల యొక్క కీర్తులు అనెడి, భుజకీర్తులు అను అలంకారము లతో, ప్రతిలసత్= ప్రకాశించు, మృదు స్థూలాంసమ్=మెత్తనివియు, లావైనవియును అగు భుజములు కలవాడవును, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు ఉన్నవాడవును, హయవదనమ్=అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను (హయగ్రీవుని) (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** హయగ్రీవుని సమమైన రెండు మూపులనుండి ఆయన వేసికొనిన తెల్లని ఉత్తరీయము వ్రేలాడుచున్నది. ఆ తెల్లని వస్త్రమునకు బంగారపు అంచు కలదు. దానితో ఆ తెల్లని వస్త్రము మరింత మెరయు చున్నది. వస్త్రము తెల్లని కాంతి కలది అగుటచే దేవలోకపు గంగానదితో సమానమైనది ఐనప్పటికి గంగకు బంగారపు అంచుతో వచ్చు శోభ లేకపోవుటచే ఉత్తరీయపు శోభ గంగ యొక్క శోభను మించినది. అందువలననే దుకూలము గంగను పరిహసించుచున్నది. మరియును హయగ్రీవుడు తన భుజములతో మధువు, కైటభుడు మొదలుగా కల రాక్షసులను సంహరించుటచే భుజములకు కీర్తులు వచ్చినవి. ఆ కీర్తులే భుజకీర్తులు అను పేరున అలంకారముగా మారి ఆయన భుజములయందు ప్రకాశించుచున్నవి.

అట్టి ఉత్తరీయము, భుజకీర్తులు కల హయగ్రీవుని నేను శరణు వేడుచున్నాను.

**విశేషములు:-**

1) గంగ ఒక రకముగనే ప్రవహించును. దుకూలము హయగ్రీవుని రెండు భుజములనుండి ప్రకాశించుచున్నది. అందువలన గంగ కంటె దుకూలము ఎక్కువగా శోభించుచున్నది. గంగ విష్ణుపాదముల నుండి వచ్చును. ఉత్తరీయము భుజము నుండి వచ్చును. అది ఒక గొప్పతనము.

2) భుజకీర్తులు మణిమయములుకాన ఎఱ్ఱగానుండును. ఎఱ్ఱనివైనను హయగ్రీవ శరీరకాన్తి ప్రభావమున అవి కూడ తెల్లగా భాసించుచున్నవి. అందువలననే తెల్లని కీర్తి, భుజకీర్తులుగా మారెనని కవి చెప్పుచున్నాడు.

3) హయగ్రీవునకు భుజములు నాలుగు ఐనప్పటికి భుజ మూలములు రెండేనని, అందువలన భుజకీర్తులు కూడ రెండేననియు తెలిసికొనవలసినది.

– బాహుచతుష్టయవర్ణన –

శ్లో॥ మహా భోగ్యాభోగ ప్రతిభట భుజాదణ్డయుగళ
ద్వయీ నిర్ధూతార్ద్రత్విడుపలమయ స్తమ్భ సుషమమ్।
అశోకస్రగ్లక్ష్మీ హసనచణ లక్ష్మీభుజలతా
వరుగ్ణాంసోత్సేధం హయవదన మిన్దుస్థిత మయే॥ 39

**ప్రతిపదార్థము:–** మహా...సుషమమ్–మహాభోగీ=ఆదిశేషుని యొక్క, ఆభోగ= శరీరమునకు, ప్రతిభట=పోటీగానున్న, భుజాదండయుగళ ద్వయీ=నాలుగు బాహువులచే, నిర్ధూత=పోగొట్టబడిన, ఆర్ద్రత్విడుపలమయ స్తమ్భ సుషమమ్= చన్ద్రకాన్తమణిమయమైన స్తమ్భముల శోభ కలవాడును, అశోక......దమ్ – అశోక స్రగ్లక్ష్మీ=అశోక పుష్పమాలల యొక్క శోభను, హసనచణ=పరిహసించు సామర్థ్యము కల, లక్ష్మీభుజలతా=లక్ష్మీ దేవి యొక్క తీగెవంటి కుడి భుజముతో, అవరుగ్ణ =ఖండింపబడిన, అంస+ఉత్సేధమ్=కుడిమూపు యొక్క ఔన్నత్యము కలవాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు ఉన్నవాడును అగు, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము:–** హయగ్రీవునకు నాలుగు బాహువులు కలవు. ఆ నాలుగు బాహువులు సర్పములలో గొప్పవాడైన ఆదిశేషుని శరీరముతో పోటీపడగలిగినవి. అనగా ఆదిశేషుని శరీరమును మించిన శోభ కలవి. అట్టి హయగ్రీవుని తెల్లని బాహువులు చన్ద్రకాన్తమణిమయస్తమ్భముల వలె నున్నప్పటికి ఆ స్తమ్భములలో లేని మెత్తదనము అను గుణము బాహువులయందు అధికముగా ఉండుట వలన బాహువుల శోభతో చన్ద్రకాన్తమణిమయస్తమ్భముల శోభ కూడ ఓడిపోయినది. మరియును హయగ్రీవుని ఎడమతొడయందు కూర్చొనియున్న లక్ష్మీదేవి అశోక పుష్పమాల కంటే అరుణ వర్ణమైన తన కుడిచేతిని హయగ్రీవుని కుడిమూపు మీదుగా ఆయన వక్షస్థలము మీద నుంచుచూ ఆయన కుడిమూపు యొక్క ఔన్నత్యమును పోగొట్టుచున్నది. అనగా ఉన్నతమైన హయగ్రీవుని మూపు పై భాగమున లక్ష్మీదేవి కుడిచేయి ఉండుటచే మూపు యొక్క ఔన్నత్యము పోయెను. ఈ విధముగా గొప్ప శోభ కల బాహువులు కలవాడును, లక్ష్మీదేవి బాహువుచే కౌగలించుకొనబడిన వాడును, చన్ద్రమండలము నందు ఉన్నవాడును అగు హయగ్రీవుని నేను శరణు పొందు చున్నాను.



**విశేషములు:–** లక్ష్మీదేవియొక్క బాహువు అశోక పుష్పమాల కంటే ఎరుపైనదనియు, అట్టి బాహువును హయగ్రీవుని మూపుయందు ఆమె ఉంచినది అని చెప్పుటచే లక్ష్మీదేవి తన బాహులత అనెడి అశోక పుష్పమాలతో హయగ్రీవుని పూజించుచున్నది అను అర్థము ధ్వనించుచున్నది.

– చక్రాయుధవర్ణన (40,41,42) –

శ్లో॥ సహస్రారచ్ఛాయా గతి ధృత సహస్రాంశు తపన
ప్రవేశాగ్ని జ్వాలా మణివలయ సంవేల్లిత కరమ్।
కరామ్భోజచ్ఛాయా విషయ జన హంస వ్రతతికా
వగాఢచ్ఛాయామ్బుం హయవదన మిన్దుస్థిత మయే॥ 40

**ప్రతిపదార్థము:–** సహస్రార ... కరమ్ – సహస్రార=వేయి అంచులు గల చక్రము యొక్క, ఛాయా=కాన్తిని, గతి=పొందుటకై, ధృత=ధరించబడిన, సహస్రాంశు =వేయి కిరణములు గల, తపన=సూర్యుని యొక్క, ప్రవేశ=ప్రవేశము కల, అగ్ని=అగ్ని యొక్క జ్వాలా=జ్వాలలు అనెడి, మణివలయ=రత్నకంకణములచే, సంవేల్లిత= చుట్టుకొనబడిన, కరమ్=చేయి కలవాడును, కరామ్భోజ...చ్ఛాయామ్బుమ్– కరామ్భోజ= పద్మము వంటి చేయి యొక్క, ఛాయా విషయ= నీడకు విషయములైన (నీడలోనున్న)జన=జనులు అనెడి, హంస వ్రతతికా=రాజ హంసల సముదాయము చే (పణ్డితసముదాయముచే), వగాఢ=మునుగబడిన, ఛాయామ్బుమ్= శరీరకాన్తి అనెడి జలము కలవాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్నవాడును అగు, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** సుదర్శన చక్రము సహస్రారము. అనగా వేయి అంచులు గలది. మహాకాన్తివన్తమైనది. సూర్యుడు దానితో సమానమైన దీప్తిని పొందగోరి తాను కూడ వేయి కిరణములను మొలిపించుకొనెను. అయినను ఆ కాన్తిని పొందలేక నిరాశపడి అగ్నిలో పడిపోయి ఉండును. అప్పుడు అగ్నికి సూర్యకాన్తి కూడ తోడయి మహాకాన్తి లభించెను. అట్టి అగ్నిజ్వాలలే హయగ్రీవునకు కరకంకణములైనవి. అనగా హయగ్రీవుని ఆభరణములైన కరకంకణములే సూర్యుని మించిపోయినవి. ఇక అగ్ని సంగతి చెప్పనవసరములేదు. అగ్నిలో పడినను సూర్యునకు చేతిక్రిందుగా ఉండెడి కంకణముల హోదాయే లభించినది కాని చక్రాయుధముతో సామ్యము

రాలేదు. అట్టి చక్రాయుధధారియగు హయగ్రీవుని హస్తచ్ఛాయలో నిలచిన పండిత హంసలు ఆ దేవుని లావణ్యచ్ఛాయలో సాయుజ్యమును పొందిరి. అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:-** సూర్యునితో కలసి అగ్నికి కూడ చక్రము యొక్క కాన్తి లేకపోవుటచే అగ్ని మిక్కిలి బాధపడెను. భగవంతుని చేతియందు ఉండుటవలననే చక్రమునకు అట్టి కాన్తి కలిగెనని తెలిసికొనెను. అందువలన అగ్ని రత్న కంకణ రూపమును ధరించి చేతులను ఆశ్రయించెనని ధ్వనించుచున్నది. మరియును కేవల సూర్యునికి వేయి కిరణములున్నను చక్రముతో సమానమగు కాన్తి లేక అగ్నిలో కలసెను. అగ్నిలో కలసినను ఆ కాన్తిని పొందలేక బాధతో ముక్కలాయెను. పిమ్మట భగవంతుని కరకమలమును శరణుజొచ్చెను అని కూడ ధ్వనించుచున్నది. అట్లు శరణు పొందిన వారికి సాయుజ్యము లభించునని కూడ ధ్వనించుచున్నది.

**శ్లో॥ సహస్రాంశు ప్రజ్ఞా విషయ నిజబిమ్బోదర గతా-**
**నలజ్వాలోద్వాన్తి క్షపిత సురవిద్వేషి తమసమ్।**
**సహస్రారం బిభ్రత్ కరజలరుహి త్వం విజయసే**
**సుహృత్సర్వేషాం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 41**

**ప్రతిపదార్థము:-** సహస్రాంశు...తమసమ్ - సహస్రాంశు=సూర్యుడు అను, ప్రజ్ఞా=జ్ఞానమునకు, విషయ=ఆశ్రయమగు, నిజ=తన యొక్క (చక్రము యొక్క), బిమ్బ=మణ్డలము యొక్క, ఉదర=లోపలి ప్రదేశమును, గత=పొందిన, అనల=అగ్ని యొక్క, జ్వాలా=జ్వాలలను, ఉద్వాన్తి=క్రక్కుటలతో, క్షపిత=నాశనము చేయబడిన, సురవిద్వేషి =రాక్షసులు అనెడి, తమసమ్=చీకటలు కలిగిన, సహస్రారమ్=వేయి అంచులుగల చక్రమును, కరజలరుహి=కరపద్మమునందు, బిభ్రత్=ధరించుచూ, సర్వేషామ్=అందరకు, సుహృత్=మిత్రుడవు అగుచూ, త్వమ్=నీవు, విజయసే= వర్ధిల్లుచున్నావు, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందుఉన్నవాడవును, హయవదనమ్=అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** ఓ హయగ్రీవా! పగటిపూట అగ్ని తన కాన్తిని సూర్యునిలో ఉంచుననియు, సాయం సమయములందు సూర్యుడు తన తేజస్సును అగ్నియందు ఉంచుననియు వేదములు చెప్పుచున్నవి. అందువలననే పగటిపూట అగ్నితేజో



విహీనముగా ఉండి రాత్రివేళలందు మరింత తేజస్సుతో వెలుగొందుచుండును. నీ చేతి యందు గల చక్రము సూర్యుని కంటే గొప్ప తేజస్సుతో విరాజిల్లుచూ అగ్ని జ్వాలలను బయటకు క్రక్కుచూ విరాజిల్లుచున్నది. అందుచేత మాకు ఇట్లు అనిపించుచున్నది. పగటిపూట సూర్యునిలో ప్రవేశించు అగ్ని నీ చక్రమును సూర్యబిమ్బముగా భ్రమపడి చక్రములో ప్రవేశించియుండును. తనకంటే తక్కువ ప్రకాశము గల అగ్ని తనలో ప్రవేశించుటను సహించలేక చక్రము అగ్నిని బయటకు క్రక్కుచూ ఉండి ఉండవచ్చును. అందువలననే నీ చక్రము నుండి అగ్నిజ్వాలలు వచ్చుచున్నవి. అట్టి అగ్నిజ్వాలలచే చక్రము రాక్షసులు అనెడి చీకటులను నాశనము చేయుచున్నది. అటువంటి చక్రాయుధమును నీవు నీ కరపద్మమునందు ధరించి యున్నావు. నీ చక్రాయుధము వలన భయపడి శత్రువులు కూడ నిన్ను శరణు పొందుటచే నీవు అందరకును మిత్రుడవైనావు. అట్టి నిన్ను నేను శరణు పొందు చున్నాను.

**విశేషములు:-** 1) హయగ్రీవుడు తన చేతిలో చక్రాయుధమును ధరించుటచే అందరకు మిత్రుడైనాడు అని బాహ్యార్థము. వాస్తవమునకు హయగ్రీవుడు సర్వప్రాణులకు ఆత్మ అగుటచేతను, ఆత్మ ఎల్లరకు ప్రియమైనదే అగుటచేతను హయగ్రీవుడు అందరకు మిత్రుడు అగుచున్నాడు. లోకములో ఇతరులను ద్వేషించువారు ఉందురు కాని తనను తాను ద్వేషించువారు ఉండరు కదా!
2) చక్రము అగ్నిజ్వాలలను వెడలగ్రక్కుచున్నది అని చెప్పుటచే గొప్ప తేజస్సుతో విరాజిల్లుచున్నది అని తెలియుచున్నది.

**శ్లో॥ విభో! త్వచ్చక్రాగ్న్యుజ్జ్వల రుచి పతఙ్గీకృత తనోః**
**పతఙ్గస్యాద్యాపి ప్రతిలసతి బిమ్బం వ్యవయవమ్।**
**భవత్తేజః పిణ్డః కి మిద మథవాముష్య జగతి**
**ప్రతిద్వన్ద్వీ న త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 42**

**ప్రతిపదార్థము:-** విభో!=ఓ ప్రభూ! హయగ్రీవా!, త్వచ్చక్రాగ్న్యుజ్జ్వల పతఙ్గీకృతతనోః - త్వ చ్చక్రాగ్ని=నీ చక్రము అనెడి అగ్నిచే, ఉజ్జ్వల రుచి=తన గొప్ప కాన్తియందు, పతఙ్గీకృత తనోః=పక్షిగా చేయబడిన శరీరము కల, పతఙ్గస్య= సూర్యుని యొక్క, బిమ్బమ్=మణ్డలము, అద్యాపి=ఈ రోజునకు కూడ, వి+అవయవమ్=అవయవములు

లేనిదిగా, ప్రతిలసతి=భాసించుచున్నది, అథవా=లేక, ఇదమ్=ఈ సూర్యబిమ్బము, భవత్తేజః పిణ్డః కిమ్=నీ తేజస్సుయొక్క ముద్దయా!, (కుతః= ఎందువలననగా), అముష్య=ఈ చక్రమునకు, జగతి=లోకమునందు, ప్రతిద్వన్ద్వీ= సాటియగు ప్రతిపక్షి, న=లేదు, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందున్నవాడవును, హయవదనమ్=అశ్వముఖుడవును అగు, తమ్=అటువంటి, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ చక్రాయుధము అగ్ని స్వరూపము అయి ఉండును. అందువలననే ఆ చక్రాయుధపు తేజస్సు నందు పక్షివలె పడిపోయిన సూర్యుడు అవయవములను కోల్పోయి ఎఱ్ఱని మాంసపుముద్దవలె ఈనాటికిని భాసించుచున్నాడు. లేదా, నీ చక్రాయుధము అగ్ని తేజస్సు కంటే గొప్పదియగు నీ తేజస్సు యొక్క ముద్ద అయి ఉండును. ఎందువలననగా నీ తేజస్సుతో సమానమైన వస్తువు లోకమునందు లేనట్లుగనే నీ చక్రాయుధమునకు కూడ సాటియగు వస్తువు లోకమున లేదుకదా!

**విశేషములు:–** పతఙ్గము అను పదమునకు సూర్యుడు, పక్షి అను రెండు అర్థములు కలవు. హయగ్రీవుని చక్రాయుధము అనెడి అగ్నియందు పక్షివలె పడి ఎఱ్ఱని మాంసపు ముద్దవలె మారుట చేతనే సూర్యునకు పతఙ్గము అను పేరు వచ్చియుండును అని కవి గూఢాశయము.

**– శంఖవర్ణన (43,44) –**

**శ్లో॥ బుధప్రజ్ఞా భూభృన్మథిత నిజకీర్త్యుద్ధత పయ**
**స్సరస్వన్మధ్య ప్రోద్గమిత నవనీతద్దరకరమ్।**
**కరామ్భోజచ్ఛాయా నిలయ కలహంస ద్దరవర**
**ప్రభా పూతాత్మీయం హయవదన మిన్దుస్థిత మయే॥ 43**

**ప్రతిపదార్థము:–** బుధప్రజ్ఞా... దరకరమ్ – బుధప్రజ్ఞా=పండితుల ప్రజ్ఞ అనెడి, భూభృత్=మన్దర పర్వతముతో, మథిత=చిలుకబడిన, నిజకీర్తి=హయగ్రీవుని కీర్తి అనెడి, ఉద్ధత పయస్సరస్వత్=గొప్ప పాలసముద్రము యొక్క, మధ్య=మధ్య భాగమునుండి, ప్రోద్గమిత=పైకి వచ్చిన, నవనీతత్=వెన్న వలెనున్న, దర=శంఖము, కరమ్=చేతియందు కలవాడును, కరామ్భోజ ...పూతాత్మీయమ్ – కరామ్భోజ



చ్ఛాయానిలయ=పద్మము వంటి చేతి యొక్క కాన్తియందు ఉన్న, కలహంసత్=రాజహంస వలెనున్నదియును అగు, దరవర=గొప్ప శంఖము యొక్క, ప్రభా=కాన్తితో, పూత=పవిత్రముచేయబడిన, ఆత్మీయమ్=తన భక్తులు కలవాడను, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్నవాడును అగు, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** పూర్వము దేవతలు మన్దరపర్వతముతో పాల సముద్రమును చిలుకగా ఆ సముద్ర మధ్యభాగమునుండి వెన్నవలె అమృతము పుట్టినది. అట్లే పండితులు తమ ప్రజ్ఞ అనెడి మందర పర్వతముతో హయగ్రీవుని కీర్తి అనెడి పాలసముద్రమును మథించగా (అనగా పండితులు హయగ్రీవుని ధ్యానించగా) దానినుండి నవనీతము వలెనున్న శంఖము పుట్టినది. ఆ శంఖమును హయగ్రీవుడు చేతియందు ధరించెను. మఱియును హయగ్రీవుని పద్మము వంటి చేతి కాంతులయందు రాజహంస వలెనున్న శ్రేష్ఠమగు శంఖము యొక్క కాన్తి హయగ్రీవుని భక్తులను పవిత్రము చేయుచున్నది. అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–** హయగ్రీవుని శంఖము యొక్క కాన్తి గంగా ప్రవాహమువలె ఆయన భక్తుల హృదయమునందు వ్యాపించి వారిని పవిత్రము చేయును అని ద్వితీయార్థము యొక్క భావము. అందు శంఖమునకు రాజహంసతో పోలిక చెప్పబడినది. ఆ పోలికతో కరామ్భోజ కాన్తికి గంగతో పోలిక ధ్వనించుచున్నది. కాన గంగవంటి పవిత్రహస్త కాన్తిలో రాజహంస వంటి శంఖము ఉన్నది. అందుచేత శంఖ కాంతి హయగ్రీవ భక్తులను గంగాస్నానము వలె పవిత్రము చేయుచున్నది.

**శ్లో॥ త్వదీయానాం ముక్తి స్త్రృతుల కరపీడామయ విధౌ**
**ధ్వన త్యేష శ్రీమన్! స్వయ మభినవానన్దమకరః।**
**రవ శ్శ్రోత్రే లగ్నో దిశతి రిపవే ముక్తిలలనామ్**
**అముష్యాపి బ్రహ్మన్! హయవదన మిన్దుస్థిత మయే॥ 44**

**ప్రతిపదార్థము:–** హే శ్రీమన్!=లక్ష్మితో కూడుకొనియున్నవాడా!, బ్రహ్మన్!=ఓ పరబ్రహ్మస్వరూపా!, అభినవానన్దమకరః=నూతనమైన ఆనన్దములకు నిధి అయిన, ఏషః=ఈ, దరః=శంఖము (ఈ పదము పూర్వ శ్లోకమునుండి తెచ్చుకొనబడినది), త్వదీయానామ్=నీ భక్తజనులకు, ముక్తి.....విధౌ – ముక్తిస్త్రీ= మోక్షము అనెడు

స్త్రీతో, అతుల=సాటిలేని, కరపీడామయ విధౌ=పాణిగ్రహణ విధియందు, స్వయమ్= తనంతట తానుగానే, ధ్వనతి=ధ్వని చేయుచున్నది, అముష్య =ఈ శంఖము యొక్క, రవః=శబ్దము,శ్రోత్రే=చెవియందు, లగ్నః=తగులుకొనుచూ,రిపవేఽపి= శత్రువునకు కూడ, ముక్తి లలనామ్=ముక్తి అనెడు స్త్రీని, దిశతి=ఇచ్చు చున్నది, ఇన్దుస్థితమ్= చన్ద్రునియందు ఉన్న,హయవదనమ్=హయగ్రీవుని,అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:**– ఓ హయగ్రీవా! నీ చేతియందు గల ఈ శంఖము నూతన నూతనములగు అనన్దములకు నిధి వంటిది. అట్టి ఈ శంఖము నీ భక్త జనులకు ముక్తి అనెడు స్త్రీతో వివాహము జరుగు సమయమున మంగళకరముగా స్వయముగనే ధ్వనించుచున్నది. మరియును తన ధ్వనిని వినిన శత్రువులకు కూడ నీ శంఖము ముక్తి కాన్తను ఇచ్చుచున్నది. (హయగ్రీవుని శంఖధ్వని విని మరణించిన శత్రువులు కూడ ముక్తిని పొందుదురు గాన కవి ఇట్లు వర్ణించుచున్నాడు.)

**విశేషములు:**– 1) ఈ శ్లోకమునందు హయగ్రీవునకు శ్రీమన్, బ్రహ్మన్ అని రెండు సంబోధనలు కలవు. లక్ష్మీదేవితో కూడియున్నను నిర్వికారుడు అని చెప్పుటకే రెండు సంబోధనములను కవి ప్రయోగించినాడు. 2) హయగ్రీవుని శంఖ ధ్వని మంగళహేతువు అని ప్రథమార్ధమునందును, వివాహమునకు కారణమగుచున్నది అని శ్లోకముయొక్క ద్వితీయార్ధమునందు కవి చెప్పుచున్నాడు. 3) శత్రువునకు కూడ ముక్తి కాన్త నొసగును అని చెప్పుటచే భక్తులకు ముక్తి నొసగును అను విషయమున సందేహించనవసరము లేదని భావము. 4) శంఖము యొక్క ధ్వనివలననే శత్రువులు మరణింతురు అని చెప్పుటచే చక్రాయుధము యొక్క ఆవశ్యకతయే లేదని గూఢముగా చెప్పుచున్నాడు. 5) శంఖము తనను చూచువారలకు, తన ధ్వని వినినవారలకు, ధ్యానించిన వారలకు కూడ నూతనానన్దములను ఇచ్చుటచే శంఖమును 'అభినవానన్దమకర' మని కవి చెప్పినాడు. 6) మకరము అనగా నవనిధులలో ఒక నిధి పేరు కనుక 'నిధి' అని అర్థము.

### – పుస్తకవర్ణన –

శ్లో॥ ద్విరేఫ ప్రస్తార ప్రతిలసిత పత్రాన్తరుదయ
న్మరన్ద త్రిస్రోత స్స్నపిత కలహంసం సువిపులమ్।



**కరాబ్జచ్ఛాయాభిః సితజలరుహం పుస్తకమయం**
**బహూకుర్వన్తం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 45**

**ప్రతిపదార్థము:**– ద్విరేఫప్రస్తార...కలహంసమ్– ద్విరేఫప్రస్తార=అక్షర రూపములో నున్న తుమ్మెదల సమూహము చేత, ప్రతిలసిత=విరాజిల్లుచున్న, పత్ర =కాగితముల యొక్క(పద్మదలములయొక్క), అన్తః=మధ్యభాగమునుండి, ఉదయత్ =ఆవిర్భవించు చున్న, మరంద=తేనె అనెడి, త్రిస్రోతస్=గంగానదియందు, స్నపిత= స్నానముచేసిన, కలహంసమ్=కలధ్వనికల పండితులు కలదియును (రాజహంసలు కలదియును), సువిపులమ్=అతి విస్తృతమైనదియును, పుస్తకమయమ్=పుస్తక స్వరూపమగు, సితజలరుహమ్=తెల్లని పద్మమును, కరాబ్జచ్ఛాయాభిః=పద్మము వంటి చేతి కాన్తులతో, బహూకుర్వన్తమ్=గౌరవించుచున్నవాడవును, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు ఉన్నవాడవును, హయవదనమ్=అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:**– హయగ్రీవుని నాలుగు చేతులలో ఒక చేతియందు పుస్తకము ఉండును. ఆ పుస్తకము కూడ ఒక తెల్లని పద్మము వంటిది. ఎట్లనగా తెల్లని పద్మము నందు తెల్లని పద్మ దళములు ఉండును. పుస్తకమునందు కూడ తెల్లని కాగితములు కలవు. పద్మము నందు నల్లని తుమ్మెదల సముదాయము ఉండును. పుస్తకమునందు తుమ్మెదల వంటి నల్లని అక్షరముల సమూహము కలదు. ఈ విధముగా పద్మముతో సామ్యముకల పుస్తకమునందు ఉన్న అక్షరములనుండి రసము అనెడి మకరందము స్రవించును. ఇట్టి మకరందము అనెడి గంగయందు రాజహంసలవలె గొప్పపండితులు స్నానమాడెదరు. అటువంటి అతి విస్తృతమగు పుస్తకమును హయగ్రీవుడు తన చేతికాన్తులతో అలంకరించుచుండెను. చన్ద్ర మణ్డలమునందు ఉన్న అటువంటి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

### – చిన్ముద్రవర్ణన –

శ్లో॥ ప్రభో! వ్యాఖ్యాసి త్వం శ్రుతినికరసారం సువిమలం
స్వకేభ్య శ్చిన్ముద్రా రుచిర కర పఙ్కేరుహరుచా।
శ్రుతి శ్రోత్రే లగ్నం మమ కమలమేవేదమితి నః
కృపాక్షీరాబ్ధిం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 46

**ప్రతిపదార్థము**:– హే ప్రభో!=ఓ స్వామీ!, శ్రుతిశ్రోత్రే=శ్రుతి అను పేరు కల స్త్రీ యొక్క చెవియందు, లగ్నమ్=తగులుకొన్న(ఉన్న), ఇదమ్=ఈ, కమలమ్=పద్మము, మమ ఏవ=నా (హయగ్రీవుని) హస్తమే!, ఇతి=అని, సువిమలమ్=అత్యన్తము పరిశుద్ధమగు, శ్రుతి నికరసారమ్=సమస్త వేదముల సారాంశమును, స్వకేభ్యః= నీ భక్తులమగు, నః=మాకు, చిన్ముద్రా....రుచా–చిన్ముద్రా=చూపుడువ్రేలు, బొటన వ్రేలుల కలయిక అనురూపముకల చిన్ముద్రతో, రుచిర=మనోహరమైన, కరపఙ్కే రుహరుచా=చేయి అనెడి పద్మముయొక్క కాన్తితో, త్వమ్=నీవు, వ్యాఖ్యాసి= వివరించు చున్నావు, కృపాక్షీరాబ్ధిమ్=కరుణాసముద్రుడవును, ఇన్దుస్థితమ్= చన్ద్రమణ్డలము నందు ఉన్నవాడవును, హయవదనమ్=అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను, అహమ్=నేను, అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము**:– స్వామీ! ఓ హయగ్రీవా! సకల వేదములచేత ప్రధానముగా చెప్పబడు పరబ్రహ్మావు నీవే. ఈ విషయమును కరుణా సముద్రుడవగు నీవే నీ భక్తులమగు మాకు నీ చిన్ముద్రతో చెప్పుచున్నావు. ఎట్లనగా–నీ నాలుగు హస్తములలో ఒక హస్తమునందు చిన్ముద్ర కలదు. బొటనవ్రేలు, చూపుడు వ్రేలు కలసియుండుటను చిన్ముద్ర అందురు. ఈ చిన్ముద్ర చెవిరంధ్రము వలెనున్నది. దీని ప్రక్కనే ఉన్న మిగిలిన హస్తభాగము పద్మమువలెనున్నది. కనుకనే నీ చిన్ముద్ర శ్రుతి అను కామిని తన చెవియందు అలంకారము కొరకు పద్మమును ఉంచుకొనినట్లుగా నున్నది. ఇందు నీ చిన్ముద్ర శ్రుతి అను కామిని చెవి గాను, చిన్ముద్ర ప్రక్కనే ఉన్న మిగిలిన నీ హస్త భాగము చెవియందు ఆమె అలంకారముగ ధరించిన పద్మముగాను మాకు భాసించుచున్నది. శ్రుతి అనగా వేదము. ఆ వేదము తన చెవియందు అలంకారముగా నీ కర పద్మము ధరించుచున్నది. అనగా వేదములకు నీవు మిక్కిలి ప్రియమైనవాడవు అని అర్థము. వేదములకు మిక్కిలి ప్రియమైనది పరబ్రహ్మామే. అందువలననే ప్రధానముగా అవి పరబ్రహ్మానే ప్రతిపాదించును. కనుకనే మూర్తీభవించిన పరబ్రహ్మావు నీవే అను విషయమును కరుణాసాగరుడవగు నీవు నీ చిన్ముద్రతో మాకు తెలియ జెప్పుచున్నావు అని మేము భావించుచున్నాము. అట్టి హయగ్రీవుని నేను శరణుపొందుచున్నాను.

**విశేషములు**:– ఈ శ్లోకమునందు '**శ్రుతి శ్రోత్రే లగ్నమ్**' అనువచనముచే శ్రుతులకు



కూడ నీవు వినబడువాడవే కాని కనబడువాడవు కావు. అందుచేత శ్రుతులచే వెతకదగిన వాడవు అను అర్థము ధ్వనించుచున్నది. మరియును శ్రుతి అను వధువునకు హయగ్రీవుడు మిక్కిలి ప్రియమైన వరుడు అని కూడ ధ్వనించుచున్నది. ఆమె మనస్సునందు హయగ్రీవుని యందు ఆసక్తి లేనిచో హయగ్రీవుడు ఆమె చెవియందు లగ్నము కాడు గదా!

**– హస్తరేఖలవర్ణన (47,48) –**

**శ్లో|| పురా మత్స్యాకారం వదతి తవ రేఖా ఝషమయీ**
**కరామ్భోజస్థేయం తవ చ కమలాయా అవిరహమ్।**
**ఇదం రేఖాయుగ్మం శ్రుతిరమణ రేఖాప్యరిమయీ**
**విరాట్త్వం విష్ణుం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 47**

**ప్రతిపదార్థము:**– శ్రుతిరమణ!=వేదములకు ప్రియమైనవాడా!, తవ=నీ యొక్క, కరామ్భోజస్థా=చేయి అనెడి పద్మమునందు కల, ఇయమ్=ఈ, ఝషమయీ=చేప యొక్క ఆకారము కల, రేఖా=గీత, (మత్స్యరేఖ)పురా=వెనుకటి, తవ= నీయొక్క, మత్స్యాకారమ్=మత్స్యావతారమును, వదతి=చెప్పుచున్నది, ఇదమ్=ఈ, రేఖా యుగ్మమ్=స్త్రీ పురుష రేఖల జత, (అయుర్బుద్ధి రేఖలజత,) తవ=నీయొక్కయు, కమలాయాః చ=లక్ష్మీదేవి యొక్కయు, అవిరహమ్=ఎడబాటులేనితనమును(నిత్య దాంపత్యమును), వదతి=చెప్పుచున్నది, అరిమయీ=చక్రమువలెనున్న, రేఖా=గీత (చక్ర రేఖ), విరాట్త్వమ్=నీ విరాట్పురుషత్వమును, వదతి=చెప్పుచున్నది కనుకనే, ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్నటువంటి, హయవదనమ్=గుఱ్ఱపు ముఖముగల, విష్ణుమ్=విష్ణుస్వరూపుడవైన, త్వామ్=నిన్ను, అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము**:– వేదముల యందు ప్రముఖముగా ప్రతిపాదించబడు ఓ హయగ్రీవా! నీ చేతియందుగల చేపవంటి ఆకారముకల ఈ మత్స్యరేఖ వెనుకటి నీ మత్స్యావతార వైభవమును సూచించుచున్నది. కలసి ఉన్నటువంటి ఈ స్త్రీపురుష రేఖలు నీకును, లక్ష్మీదేవికిని గల నిత్యదాంపత్యమును సూచించుచున్నవి. చక్రమువలె గుండ్రముగా నున్న ఈ చక్రరేఖ నీవు విరాట్ పురుషుడవని చెప్పుచున్నది.

కనుకనే ఓ హయగ్రీవా! నీవు విష్ణుస్వరూపుడవు. అట్టి నిన్ను నేను శరణు పొందుచున్నాను.

శ్లో॥ కరామ్భోజచ్ఛాయా జలనిధిచరోఽయం తవ ఝషః
శ్రుతీ ర్దత్తే పాదామ్బుజ నఖ విభా ధూత తమసే।
విధాత్రే ప్రద్యోత న్మణివలయ సఙ్ఘ ధ్వని మిషాత్
ధరా భారోద్ధారం హయవదన మిన్దుస్థిత మయే॥ **48**

**ప్రతిపదార్థము**:– (హే శ్రుతి రమణ!=వేదములకు ప్రియమైన వాడా! వేదప్రతిపాద్యుడా!), తవ=నీయొక్క, కరామ్భోజ ...చరః–కరామ్భోజ=పద్మము వంటి కరము నందు కల, ఛాయా=ఛాయా రూపముననున్న (రేఖారూపముననున్న) జలనిధిచరః =సముద్రమున సంచరించు, అయమ్=ఈ, ఝషః=చేప, పాదామ్బుజ... తమసే– పాదామ్బుజ=నీ పాదపద్మముల యొక్క, నఖ=గోళ్లయొక్క, విభా=కాన్తిచేత, ధూత= పోగొట్టబడిన, తమసే=(రాక్షసులు చేసిన అవమానముచే కలిగిన) శోకము గల, విధాత్రే=బ్రహ్మకు, ప్రద్యోతన్మణి ...మిషాత్–ప్రద్యోతత్= మ్రోగుచున్న, మణివలయ సంఘ=మణులతో కూడిన కంకణముల సమూహము యొక్క, ధ్వని మిషాత్=ధ్వని అను నెపమున, శ్రుతీః=వేదములను, దత్తే=ఇచ్చు చున్నది, ధరాభారోద్ధారమ్– ధరా=భూమికి, భార=భారము అయిన రాక్షసులను, ఉద్ధారమ్= సంహరించిన వాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు నివసించువాడును అగు, హయవదనమ్= హయగ్రీవుని, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము**:– ఓ హయగ్రీవా! పూర్వము రాక్షసులు బ్రహ్మదేవుని ఓడించి ఆయన వద్దనున్న వేదములను కొనిపోవుచుండగా బ్రహ్మదేవుడు మిగుల శోకించుచు విష్ణువును వేదరక్షణ చేయవలసినదిగా ప్రార్థించెను. అప్పుడు విష్ణువు మత్స్య రూపమున అవతరించి రాక్షసులను సంహరించి వేదములను తిరిగి బ్రహ్మకు ఇచ్చి ఆయన శోకమును పోగొట్టినాడు. ఈ విధముగా మత్స్యరూపమున అవతరించిన నారాయణుడవు నీవే. ఎట్లనగా నీ హస్తము నందుగల ఈ మత్స్య రేఖయే అప్పుడు అవతరించిన ఆ మత్స్యము. రేఖకు సమీపముననే కంకణములు కలవు. అవి ఒకదానికి మరియొకటి తగులుకొనుట వలన శబ్దమును చేయుచున్నవి. అట్టి శబ్దము అను నెపమున వేదములను ఈ మత్స్యమే బ్రహ్మదేవునకు ఇచ్చి ఆయన యొక్క శోకమును పోగొట్టుచున్నది. ఈ విధముగా భూభారమును హరించు హరివి నీవే. అట్టి హయగ్రీవుని నేను శరణువేడుచున్నాను.



**– లక్ష్మీహస్తవర్ణన –**

శ్లో॥ ముఖాఞ్చ న్మాణిక్యచ్ఛద పరిలసత్ కోకనదక
ప్రతిద్వన్ద్వి శ్రీ మా కర లలిత కాసార దురసమ్।
విభూషా నిక్వాణ స్ఫురిత కమలాహస్త జలజ
చ్ఛద క్షిప్త స్వేదం హయవదన మిన్దుస్థిత మయే॥ **49**

**ప్రతిపదార్థము** :– ముఖాఞ్చ....ఉరసమ్– ముఖ=అగ్రభాగములందు, అఞ్చత్= ప్రకాశించు, మాణిక్య=కెంపులుగల,ఛద=(ఐదు) దళములతో, పరిలసత్= విరాజిల్లు, కోకనదక=ఎఱ్ఱపద్మమునకు, ప్రతిద్వన్ద్వి=పోటీగానున్న, శ్రీమాకర=శోభగల లక్ష్మీదేవి చేతితో, లలిత=అందమైన, కాసారత్=చెఱువువలె వున్న, ఉరసమ్ = వక్షస్థలము కలవాడును, విభూషా... స్వేదమ్–విభూషా=కంకణముల యొక్క, నిక్వాణ= ధ్వనుల చే,స్ఫురిత= సముద్దీప్తమైన, కమలా హస్త=లక్ష్మీదేవి హస్తము నందలి, జలజ= పద్మము యొక్క, ఛద=దళములతో, క్షిప్త=కదల్చబడిన, స్వేదమ్= చెమట బిందువులు కలవాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందు ఉన్నవాడును అగు, హయవదనమ్= హయగ్రీవుని (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :– హయగ్రీవుని ఎడమ తొడయందు కూర్చునియున్న లక్ష్మీదేవి తన కుడి చేతిని స్వామి కుడి మూపునుండి ఆయన వక్షస్థలము మీద నుంచినది. అప్పుడు హయగ్రీవుని వక్షస్థలము సరోవరము వలె నున్నది. వక్షస్థలమునందు గల లక్ష్మీదేవి హస్తము సరోవరమునందు గల ఎఱ్ఱని పద్మమువలె నున్నది. ఆమె చేతి యందుగల ఐదువ్రేళ్లు పద్మదళములవలె నున్నవి. వ్రేళ్లయందలి గోళ్లు మాణిక్యములవలె నున్నవి. పద్మదళముల చివరలందు మాణిక్యములు ఉండక పోయినను, అట్లు ఉన్నచో పద్మము ఎట్లు ఉండునో ఆ విధముగానున్న లక్ష్మీదేవి కరపద్మము హయగ్రీవుని వక్షస్థలమునందు కలదు అని కవి వర్ణించుచున్నాడు. మరియును లక్ష్మీదేవి ఎడమచేతియందు గల పద్మముతో హయగ్రీవుని విసరుచు ఆయన చెమట బిందువులను కదుపుచున్నది. ఈవిధముగా విసరు చున్నప్పుడు ఆ ఎడమ చేతియందు గల మణిమయమైన కంకణములు ఒకదానితో మరియొకటి కొట్టుకొనుచు అందమైన ధ్వని చేయుచుండగా ఆ ధ్వనితో చేయి మరింత ప్రకాశించు చున్నది. ఈ విధముగా లక్ష్మీదేవి చేత సేవించబడు హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :- భగవంతుడగు హయగ్రీవునకు చెమట బిందువులు ఉండవు. కాని ఆయన వక్షస్స్థలమునందుగల ముత్యాల హారమునందలి ముత్యములు స్వేద బిందువులను పోలియుండుటచే, లక్ష్మీదేవి విసరుచున్నప్పుడు ఆ ముత్యములు కదలుచుండగా స్వేదబిందువులు కదలుచున్నవని కవి వర్ణించుచున్నాడు.

- హయగ్రీవౌష్ఠవర్ణన -

**శ్లో॥ రదచ్ఛాయోద్బుద్ధ ప్రతిపద నవత్ ఫేన సుషమా**
**సముద్దీప్త స్మేర ద్యుతి నిచయ సృష్టాభ్రసరితమ్।**
**వివక్షుం నః కిఞ్చిత్ స్ఫురితమివ నిర్లమ్బ మధరం**
**దధానం సర్వజ్ఞం హయవదన మిన్దుస్థిత మయే॥ 50**

**ప్రతిపదార్థము** :- రద ....సరితమ్-రదచ్ఛాయోద్బుద్ధ=దంతకాంతితో వికసించినది యును, ప్రతిపద నవత్ ఫేన=మాటిమాటికి కొత్తదానివలెనున్న నురగ యొక్క సుషమా సముద్దీప్త=కాన్తితో మరింత ప్రకాశించుచున్నదియును అగు, స్మేర=నవ్వు యొక్క ద్యుతినిచయ=కాన్తి సమూహముచే, సృష్ట=సృజించబడిన, అభ్రసరితమ్ =గంగానది కలదియు,నః=మమ్ములను గురించి,కించిత్=ఏదియో ఒక విషయము ను, వివక్షుమివ=చెప్పుటకో అనునట్లుగ, స్ఫురితమ్=చంచల మైనదియు, నిర్లమ్బమ్ =బాగుగా క్రిందకు వచ్చుచున్నదియును అగు, అధరమ్= క్రింది పెదవిని, దధానమ్ =ధరించువాడును, సర్వజ్ఞమ్=అన్ని విషయములను తెలిసిన వాడును, ఇన్దుస్థితమ్ =చన్ద్రునియందు ఉన్నవాడును అగు, హయవదనమ్= హయగ్రీవుని, అహమ్=నేను, అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :-** హయగ్రీవుని చిరునవ్వు సహజముగానే తెల్లని కాన్తి కలది. అది దంతముల కాన్తితోను, ఎప్పటికప్పుడు కొత్తదానివలె నున్న నురగయొక్క కాన్తితోను మరింత ప్రకాశించుచున్నది. అట్టి చిరునవ్వు యొక్క కాన్తి సమూహముతో హయగ్రీవుని పెదవి ఆకాశగంగను సృజించినది. (హయగ్రీవుని ధ్యానము చేయువాని హృదయాకాశమునందు చిరునవ్వు వ్యాపించి గంగానది వలె భాసించును అని అంతరార్థము). మరియును సర్వజ్ఞుడైన హయగ్రీవుడు భక్తులమగు మనకు ఏదియో ఒక విషయమును చెప్పదలచినాడో అనునట్లుగా వ్రేలాడుచున్న అధరమును కదిలించు చున్నాడు. **(క్రిందుకు బాగుగా వ్రేలాడుచున్న అధరము కలిగివుండుట ఉత్తమాశ్వ లక్షణము).** అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.



- నాసికవర్ణన -

**శ్లో॥ హృదభ్రాభి వ్యాపి ప్రవిమల కృపాక్షీర జలధి**
**ప్రజృమ్భద్భఙ్గోష్ఠ ద్వయ కలిత డిణ్డీర రుచిరమ్।**
**మరుద్యాతాయాత ప్రతిఫణిత వేదోచ్చలనసం**
**దధానం విష్ణుం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 51**

**ప్రతిపదార్థము** :- హృద...రుచిరమ్-హృదభ్రాభి వ్యాపి=హృదయాకాశ మంతటను వ్యాపించిన, ప్రవిమల=అతిస్వచ్ఛమగు, కృపాక్షీరజలధి=నీకరుణ అనెడి పాల సముద్రమునందు, ప్రజృమ్భత్= ఎగసిపడుచున్న, భఙ్గ=అలవలెనున్న, ఓష్ఠద్వయ= రెండు పెదవుల యందు, కలిత=లగ్నమైన, డిణ్డీర=నురగతో, రుచిరమ్=మనోహర మైనదియును, మరుద్యాతాయాత...వేదోచ్చలనసమ్- మరుద్యాతాయాత= ఉచ్ఛ్వాస నిశ్వాసవాయువుల రాకపోకలచే, ప్రతిఫణిత=(శిష్యులకు) చెప్పబడిన, వేద= వేదములుగల, ఉచ్చలనసమ్=ఎగురుచున్న ముక్కుకలదియును అగు, హయ వదనమ్=అశ్వముఖమును,దధానమ్=ధరించువాడవును,విష్ణుమ్=సర్వ వ్యాపకుడవు ను,ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు వున్నవాడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :- హయగ్రీవుని హృదయము అంతయును కరుణ అనెడి పాల సముద్రముతో నిండిపోయినది. అందువలన లోపల అవకాశము లేక ఆ పాల సముద్రము యొక్క రెండు తరంగములు ఎగసిపడుచూ రెండు పెదవుల రూపమున పైకి వచ్చినవి. ఆ రెండు పెదవులపై గల లాలాజలము తరంగములపై నుండు నురగవలె భాసించుచున్నది. అట్టి నురగతో హయగ్రీవుని ముఖము మనోహరముగా భాసించుచున్నది. మరియును హయగ్రీవుని ముక్కునుండి ఉచ్ఛ్వాస నిశ్వాస వాయువుల రాకపోకలచే ఆ దేవుని ముక్కు ఎగురుచున్నది. ముక్కునుండి ధ్వని కూడా వచ్చుచున్నది. ఈ విధముగానున్న ముక్కు శిష్యులకు వేదమును చెప్పుచున్నదా అనునట్లున్నది. ఇట్టి ముక్కుతో హయగ్రీవుని ముఖము మనోహరముగా వున్నది. ఇట్టి ముఖము గల విష్ణు స్వరూపుడగు హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :- 1. 'యస్య నిశ్వసితం వేదాః' అను వచనము ననుసరించి విష్ణువు యొక్క నిశ్వాస వాయువులే వేదములు. హయగ్రీవుడు సాక్షాత్తుగా విష్ణువు. అందు వలననే ఆయన నిశ్వాసములను వేదములుగా భావించి కవి ఇట్లు వర్ణించినాడు.

2. ఉప్పు సముద్రపుతరంగములు కొంచెము నల్లగా వుండును. హయగ్రీవుని పెదవులు బాగుగా తెల్లగా వుండుటచే పాలసముద్రపు తరంగములతో కవి పోల్చినాడు.

**- హయగ్రీవశ్రోత్రనేత్రవర్ణన (52,53) -**

**శ్లో॥ సమఞ్చ చ్ఛ్రుత్యన్త జ్వలిత మణిమత్కుణ్డల రుచి**
**ప్రదీప ప్రస్తార ప్రతిపద వినీరాజిత ముఖమ్।**
**లసద్గణ్డచ్ఛాయా జలజ సిత పఙ్కేరుహ దృశం**
**స్మరామోహభ్రూకం హయవదన మిన్దుస్థిత మయే॥ 52**

**ప్రతిపదార్థము** :- సమఞ్చ...ముఖమ్-సమఞ్చత్=బాగుగా కదలుచున్న, శ్రుత్యన్త= చెవి చివరిభాగములతో, (వేదాన్తములతో), జ్వలిత మణిమత్=వెలుగుచున్న మణులు గల, కుణ్డల=కుణ్డలములయొక్క, రుచి=కాన్తి అనెడు, ప్రదీపప్రస్తార= దీప సముదాయముచే, ప్రతిపద=ప్రతిక్షణము, వినీరాజిత=నీరాజనము ఇవ్వబడిన, ముఖమ్=ముఖము కలవాడును, లసద్గణ్డ...దృశమ్-లసత్=ప్రకాశించుచున్న, గణ్డ =చెంపలయొక్క, ఛాయా=కాన్తి అనెడి, జల=నీటియందు, జ=పుట్టిన, సితపఙ్కేరుహ =తెల్లని పద్మమువంటి, దృశమ్=కన్నులు కలవాడును, స్మరామోహభ్రూకమ్-స్మర= మన్మథునికి సైతము, ఆమోహ=బాగుగా మోహము కలుగజేయు, భ్రూకమ్= బొమముడి కలవాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉండువాడును అగు, హయ వదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :-** శ్రుత్యన్తములు అనగా చెవితమ్మెలు, ఉపనిషత్తులు అని రెండు అర్థములు. చెవులకు వ్రేలాడుచున్న కుణ్డలములలోని మణులు కదలినప్పుడల్లా తళుకులీనుచూ హయగ్రీవునకు శోభను పెంచుచున్నవి. ఈ దృశ్యమును వేదాన్త సరస్వతులు మణిమయదీపములతో పరమాత్మరూపుడైన హయగ్రీవునకు హారతులు పట్టినట్లు కవి చమత్కరించెను. ఆ స్వామి చెంపల నుండి జాలువారు లావణ్య సరస్సులో ఆయన కన్నులే తెల్లని పద్మముల వలె విలసిల్లినవి. అనగా పుణ్డరీకాక్షుడు అని చెప్పినట్లైనది. ఆయన కనుబొమల అందము మన్మథునే మైమరపించుచున్నది. అట్టి హయగ్రీవుని నేను శరణుపొందుచున్నాను.

**శ్లో॥ ప్రహీరాలఙ్కార ద్యుతిభర పరీహాస విషయ**
**స్ఫురత్సవ్యావర్తామ్బుజ సులలిత శ్రోత్రయుగళమ్।**



**స్ఫుటశ్వేతామ్భోజద్యుతి పరికరాధ్యాపక దృశం**
**దధానం శ్రీశం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 53**

ప్రతిపదార్థము :- ప్రహీరా....యుగళమ్-ప్రహీరాలఙ్కార=గొప్ప వజ్రముతో కూడిన కుణ్డలము అను అలంకారము యొక్క, ద్యుతిభర=కాన్తి సమూహము అను రూపము కల (లేదా) కాన్తి సమూహము చేత చేయబడు, పరీహాస= పరిహాసమునకు, విషయ=విషయమైన (పాత్రమైన), స్ఫురత్సవ్యావర్తామ్బుజ =ప్రకాశించు దక్షిణావర్త శఙ్ఖము కల, సులలిత=అందమైన, శ్రోత్ర యుగళమ్=రెండు చెవులు కలదియును, స్ఫుట....దృశమ్-స్ఫుట=వికసించిన, శ్వేతామ్భోజ=తెల్లని పద్మమునకు, ద్యుతి పరికర=కాన్తి సమూహమును కలిగియుండుట అనువిద్యను, అధ్యాపక=బోధించు, దృశమ్=కన్నులు కలదియును అగు, హయవదనమ్= గుఱ్ఱపుముఖమును, దధానమ్=ధరించువాడవును, శ్రీశమ్=లక్ష్మీపతియును, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్నవాడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :- ఓ హయగ్రీవా! నీ రెండు శ్రోత్రములు దక్షిణావర్త శఙ్ఖములను మించిన శోభతో విరాజిల్లుతున్నవి. ఆ శ్రోత్రములందు వజ్రములతో చేయబడిన కుణ్డలములు కలవు. ఆ కుణ్డలములు తెల్లని కాన్తి సమూహమును ప్రసరింపజేయు చుండగా, శ్రోత్రములు, కుణ్డలముల కాన్తి రూపమున దక్షిణావర్త శఙ్ఖమును పరిహసించుచున్నవా అనునట్లుండెను. అట్టి శ్రోత్రములతో నీ వదనము శోభాయ మానముగ వున్నది. మరియును నీ కన్నులు తెల్లని పద్మమును మించిన కాన్తి కలిగినవై ఆ పద్మములకు సైతము కాన్తి సమూహమును కలిగియుండుట అను విద్యను బోధించుచున్నవా అనునట్లు ఉన్నవి. ఇట్టి కన్నులతో కూడ నీ ముఖము మనోహరముగా నున్నది. ఇట్టి ముఖము కలవాడవును, చన్ద్రమండలము నందు వున్నవాడవును, లక్ష్మీపతివియును అగు నిన్ను నేను శరణుపొందుచున్నాను.

**- ఊర్ధ్వత్రిపుణ్డ్ర వర్ణన -**

**శ్లో॥ ద్విమూర్త్యో రద్వైతం తవ ముఖవిభాయాం హి గతయో**
**ర్హరి ర్మధ్యస్థ స్త్వం లససి మృగనాభీ తిలకవత్।**
**భవత్ఫాలౌపమ్యాధిగమనకృతే చిహ్న మవహత్**
**హిమాంశుః కిం మధ్యే హయవదన మిన్దుస్థిత మయే॥ 54**

**ప్రతిపదార్థము** :– అయే!=ఓ హయగ్రీవా! తవ=నీయొక్క, ముఖావిభాయామ్=ముఖకాన్తియందు, ద్విమూర్త్యోః=బ్రహ్మ, మహేశ్వరుడు అను ఇద్దరు మూర్తులు, అద్వైతమ్=ఏకత్వమును, గతయోః=పొందినవారు అగుచుండగా, మధ్యస్థః=బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అను త్రిమూర్తులలో మధ్యలో వున్న, హరిః=విష్ణువు అగు, త్వమ్=నీవు, మృగనాభీతిలకవత్=కస్తూరీతిలకము వలె, లససి=విరాజిల్లుచున్నావు. హిమాంశుః=చన్ద్రుడు, భవత్ఫాలౌపమ్యాధిగమన కృతే=నీ ముఖముతో పోలికను పొందుట కొరకు, మధ్యే=తన మధ్య భాగమునందు, చిహ్నామ్=కళంకమును, కిం అవహత్=ధరించినాడా ఏమి? ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుని (అహమ్=నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము**:– ఓ హయగ్రీవా! నీ ముఖమునందు ఉన్న త్రిపుండ్రములు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపమగు త్రిమూర్తులకు ప్రతీకలు. అందు అటునిటునున్న తెల్లని నిలువు గీతలు బ్రహ్మ, మహేశ్వరులకు ప్రతీకలు కాగా మధ్యలోని నల్లని గీతను విష్ణువునకు ప్రతీకగా భావించుచున్నాను. అందువలననే నీ ముఖకాన్తియందు బ్రహ్మ, మహేశ్వరులు లయము కాగా మధ్యలో విష్ణు స్వరూపుడవైన నీవు కస్తూరీ తిలకము వలె విరాజిల్లుచున్నావు అని మాకు అనిపించుచున్నది. ఓ హయగ్రీవా! ఇట్టి నీ ముఖముతో సంపూర్ణమగు సామ్యమును పొందుటకు చన్ద్రుడు తనలో నల్లని కళంకమును ధరించినాడో ఏమో నను సందేహము మాకు కలుగుచున్నది. చన్ద్ర మణ్డలమునందున్న అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**– కిరీట వర్ణన (55,56,57) –**

**శ్లో॥ కిరీటాధో బిమ్బ స్థగిత నవహీరవ్రజ మహా**
**విశాలం తే ఫాలం మృగమదరజ స్సఙ్కుచితభమ్।**
**కిరీటాన్తర్వీరవ్రతతి మిషతోఽ ముష్య సుషమా**
**పరీవాహోత్క్రాన్తి ర్హయవదన మిన్దుస్థిత మయే॥ 55**

**ప్రతిపదార్థము** :– అయే!=ఓ హయగ్రీవా!, కిరీటాధో...విశాలమ్–కిరీట=కిరీటము యొక్క, అధోబిమ్బ=క్రింది వలయమునందు, స్థగిత=బిగించబడిన, నవ=నూతనమైన, హీర=వజ్రములయొక్క, వ్రజ=సముదాయముచే, మహావిశాలమ్=బాగుగ



విశాలమైన, తే=నీయొక్క, ఫాలం=నుదురు, మృగమదరజస్సఙ్కుచితభమ్–మృగమదరజః=తిలకముగా మారిన కస్తూరితో, సఙ్కుచిత=సంకోచమునొందిన, భమ్=కాన్తి కలది, అముష్య=ఈ నీ నుదురు యొక్క, సుషమా పరీవాహోత్క్రాన్తిః=సౌందర్య ప్రవాహము యొక్క ఊర్ధ్వ ప్రసరణము, కిరీటాన్తర్వీరవ్రతతి మిషతః=కిరీటములోని వజ్రపు తీగ అనుమిషతో, భాతి=ప్రకాశించుచున్నది. ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :– హయగ్రీవుడు వజ్రపుకొండవంటి వాడు. ఆయన కిరీటపు క్రింది భాగమున వజ్రములు బిగించబడినవి. హయగ్రీవుని నుదురు సహజముగనే విశాలమైనది. నుదురు వజ్రము వలె తెల్లని కాన్తి కలిగి యుండుటచేతను, నుదురుపై నున్న కిరీటపు క్రిందిభాగము వజ్రములతో బిగించబడి యుండుటచేతను, నుదురునకు, కిరీటపు క్రింది భాగముననున్న వజ్రమణి పట్టికకును భేదము గ్రహించుటకు వీలుకాకున్నది. అందువలన హయగ్రీవుని నుదురు మరింత విశాలముగ కన్పట్టుచున్నది. హయగ్రీవుని నుదుటనున్న మూడు ఊర్ధ్వ పుండ్రములలో అటునిటునున్న రెండు తెల్లని ఊర్ధ్వ పుండ్రములు కూడా ఆయన ముఖకాన్తిలో కలసిపోయినవి. మధ్యలోని కస్తూరీతిలకపు ఊర్ధ్వ పుండ్రము మాత్రమే నల్లగా మెరయుచూ కనబడుచున్నది. ఆ నల్లని ఊర్ధ్వ పుండ్రమే ఆయన నుదురు ఇంతవరకే వున్నది, పై భాగము వజ్రమణి పట్టిక అని తెలియచెప్పుచూ హయగ్రీవుని అతి విశాలమగు ఫాలమును చిన్నదిగా చేయుచున్నది. హయగ్రీవుని నుదురు మొదలుకొని కిరీటపు శిఖరము వరకును కిరీట మధ్యభాగమునందు వజ్రములు లతవలె బిగించబడినవి. ఈ వజ్రమణిలత ఆ దేవుని సౌన్దర్య ప్రవాహమువలె భాసించుచున్నది.

**శ్లో॥ కిరీటాన్తర్వీర వ్రతతి పరిపార్శ్వ ప్రతిలస**
**న్నవోదఞ్చద్రత్నప్రకర పరిదీప్తం హృదయఖమ్।**
**మదీయం ఖం నిన్దత్యధికరుణ! నక్తం దివమపి**
**ప్రభో! తం త్వాం దేవం హయవదన మిన్దుస్థిత మయే॥ 56**

**ప్రతిపదార్థము** :– హే అధికరుణ!=గొప్ప దయకలిగిన ఓ హయగ్రీవా!, ప్రభో!=స్వామీ!, కిరీటాన్త...పరిదీప్తమ్–కిరీటాన్తః=నీ కిరీటపు మధ్యభాగము నందు ఉన్న,

హీరవ్రతతి=వజ్రమణిమాల యొక్క, పరిపార్శ్వ=ఇరుప్రక్కల యందు అంతటను, ప్రతిలసత్=బిగించబడిన, నవోదఞ్చద్రత్నప్రకర=బాగుగ ప్రకాశించుచున్న నవ రత్నముల సమూహముతో, పరిదీప్తమ్=వెలుగొందుచున్న, మదీయమ్= నాయొక్క, హృదయఖమ్=హృదయాకాశము, ఖమ్=మహాకాశమును, నక్తందివ మపి= రాత్రింబవళులయందు, నిన్దతి=అవహేళన చేయుచున్నది. తమ్=అట్టి కిరీటముగల వాడవును, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు ఉన్నవాడవును, దేవమ్= భగవంతుడవును, హయవదనమ్=అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్=నేను) అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము** :– కరుణానిధీ! ఓ హయగ్రీవా! నిన్ను నిరన్తరము నా హృదయమునందు ధ్యానము చేయుచుండుటచే నీవు నా హృదయమునందు స్థిర నివాసమేర్పరచు కొంటివి. అందువలన నీ కిరీట మధ్య భాగములో నిలువుగనున్న వజ్ర మణిమాల యొక్క కాన్తులు, ఆ వజ్రమణిమాలకు ఇరువైపుల సంపూర్ణముగా నిండివున్న నవరత్నముల కాన్తులు నా హృదయాకాశమున అలముకున్నవి. ఇందు వజ్రమణి మాలకాన్తులు వెన్నెలవలెను, నవరత్నకాన్తులు సూర్యకాన్తి వలెను ఉన్నవి. బాహ్య ప్రదేశమునందున్న మహాకాశమునందు పగటిపూట సూర్యకాన్తి మాత్రమే ఉండును. రాత్రివేళలందు చన్ద్రకాన్తి మాత్రమే ఉండును. రెండు కాన్తులు ఒకసారిగా మహాకాశమునందు ఉండవు. హృదయాకాశము నందు మాత్రము చన్ద్రకాన్తి వంటి వజ్రమణిమాల కాన్తులు, సూర్యకాన్తివంటి నవరత్నకాన్తులు ఎల్లప్పుడు ఉండును. అందువలననే అట్టి కాన్తి కల హృదయాకాశము తక్కువ కాన్తికల మహాకాశమును పరిహసించుచున్నది. అట్టి గొప్పకాన్తిని ఇచ్చు కిరీటమును ధరించిన హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

శ్లో॥ **న తే కూటస్యాగ్రే లసతి తపనో నాపి హిమరుజ్**
**న తారా నో శమ్పా న చ శుచి రముష్యైవ విభయా।**
**విభాతీదం సర్వం త దిద మయతే బ్రహ్మపదవీం**
**మహానన్ద! త్వాం శ్రీ హయవదన మిన్దుస్థిత మయే॥** **57**

**ప్రతిపదార్థము** :– హే మహానన్ద!=గొప్ప ఆనన్దమే స్వరూపముగా కల ఓ హయగ్రీవా! తే కూటస్య=నీ కిరీటము యొక్క, అగ్రే=ఎట్ట ఎదుట, తపనః=సూర్యుడు నలసతి



=ప్రకాశించుటలేదు, హిమరుక్=చంద్రుడు, న లసతి=ప్రకాశించుటలేదు, తారాః =నక్షత్రములు, న లసన్తి= ప్రకాశించుట లేదు, శమ్పాః=మెఱుపులు, నో లసన్తి= ప్రకాశించవు, శుచిః=అగ్ని, న లసతి= ప్రకాశించదు, అముష్య=ఈ కిరీటము యొక్క, విభయా+ఏవ=కాన్తితోనే, ఇదమ్= ఈ, సర్వమ్=సూర్యచన్ద్రాదులతో కూడిన సమస్త ప్రపంచమును, విభాతి= ప్రకాశించుచున్నది, తత్=అందువలన, ఇదమ్=ఈ కిరీటము, బ్రహ్మ పదవీమ్=బ్రహ్మ అనెడి ప్రతిష్ఠను, అయతే=పొందుచున్నది. ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు వున్న వాడవును, హయవదనమ్=అశ్వముఖుడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :– ఓ హయగ్రీవా! నీ కిరీటము గొప్ప ప్రకాశము కలది. దానియొక్క ప్రకాశము ముందు సూర్యుడు వెలవెలపోవుచున్నాడు. నక్షత్రములు, మెఱుపులు, అగ్ని కూడా ప్రకాశించుటలేదు. కిరీటముయొక్క కాన్తితోనే లోకమంతయు భాసించుచున్నది. '**న తస్య పురత స్సూర్యోభాతి న చన్ద్రతారకా నేమా విద్యుతో భాన్తి కుతోయ మగ్నిః**' శ్రుతి వచనము ననుసరించి దేని కాన్తియందు సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మెఱుపులు, అగ్ని ప్రకాశించవో, దేని కాన్తితో సర్వమూ ప్రకాశించునో అదియే కదా బ్రహ్మము. కిరీటమునకు అట్టి బ్రహ్మ లక్షణము సంపూర్ణముగా సరిపోవుటచే నీ కిరీటమే బ్రహ్మ అను ప్రతిష్ఠను పొందుటకు అర్హమైనది. ఓ హయగ్రీవా! నేను నిన్ను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :– మనుష్యానందము, దేవానందము మొదలగు ఆనందముల కంటే గొప్ప ఆనందము బ్రహ్మానందము. దానిని మించిన ఆనందము లేదు. ఆ బ్రహ్మానందమే హయగ్రీవుడు. కాన హయగ్రీవుని మహానందా! అని కవి సంబోధించినాడు.

**– కటాక్ష వర్ణన –**

శ్లో॥ **రమావక్త్రానూనామృత రుచి శుచిస్మేర సుషమా**
**ద్యుగఙ్గాభిస్నానా దివ శిశిరసమ్మోద సుషమామ్।**
**వమన్తం దృఙ్మాలా మమల కరుణావీచి కపటాం**
**సితామ్భోజాక్షాభ్యాం హయవదన మిన్దుస్థిత మయే॥** **58**

**ప్రతిపదార్థము:–** రమా ..... స్నానాత్ – రమా=లక్ష్మీదేవి యొక్క, వక్త్ర=ముఖము

అనెడి, అనూనామృతరుచి=పూర్ణచంద్రుని యొక్క, శుచిస్మేర=పరిశుద్ధమగు చిరునవ్వు అనెడి, సుషమా=వెన్నెల అను, ద్యుగఙ్గా=ఆకాశగంగ యందు, అభి స్నానాత్ ఇవ=అభ్యఙ్గన స్నానము చేయుట వలన, శిశిర సమ్మోద సుషమామ్=చల్లని హర్ష కాన్తి కలిగినదియు, అమలకరుణావీచి కపటామ్=నిర్మలమగు కరుణా తరంగములు అనుపేరుగల, దృఙ్మాలామ్=చూపుల వరుసను, సితామ్భోజాక్షాభ్యామ్ =తెల్లని పద్మము వంటి కన్నుల నుండి, వమన్తమ్=క్రుక్కుచున్న వాడును, (ప్రసరింప జేయుచున్నవాడును), ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్నవాడును అగు, హయ వదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** చన్ద్రబిమ్బము కలఙ్కితము. వృద్ధిక్షయములతో అనిత్యమైనది. లక్ష్మీముఖ చన్ద్రబిమ్బము అమృతస్వరూపము. అనగా నిత్యము. నిష్కలఙ్కము. పైగా దరహాస భరితమైయున్నది. సంతోష చిహ్నామైన ఈ అమృత దరహాస చన్ద్రికలు ఆకాశగంగ వలె తెల్లనైనవి, చల్లనైనవి, పైగా ఆనందమయమైనవి. వీనియందు హయగ్రీవుడు అభ్యంగ స్నానముచేసినాడు. అనగా లక్ష్మీకటాక్షప్రవాహములు ఆయనను ముంచెత్తినవి. లోకములో అభ్యంగస్నానము చేసినవారికి ఆ ప్రభావముచే కళ్లు చల్లబడుట అనుభవమే. అట్టి అనుభవమే హయగ్రీవునకు కలిగినది. కనుక ఆయన చూపులు అమృత కాన్తివలన చల్లదనమును, దరహాసమువలన ఆనందమును పొందినవి. ఇట్లు ఆనంద శీతలములైన కటాక్షములను కరుణాకటాక్షములు అను వంకతో మనపై సారించుచున్నాడు. పైగా చన్ద్రకాన్తితో నేత్రపుణ్డరీకములు ఆనన్దసౌరభములను వెదజల్లుట ఒక వింత. పైగా హయగ్రీవుని కరుణాకటాక్షములు లక్ష్మీదాయకములనియు వ్యంగ్యము.

**– స్మేర వర్ణన మరియు ఆలింగన వర్ణన –**

**శ్లో॥ రమా వక్త్రాప్పుష్పార్పిత గళగతేన్దీవరమయ**
**స్ర గుల్లాస స్మేర ద్యు విహృత చకోరీ పరికరమ్।**
**రమాలావణ్యాబ్ధ్యుద్భవ దమృత కుమ్భ ప్రతికృతి**
**ప్రరజ్య ద్వక్షస్కం హయవదన మిన్దుస్థిత మయే॥ 59**

**ప్రతిపదార్థము:–** రమా ..... పరికరమ్ – రమా=లక్ష్మీదేవియొక్క, వక్త్ర=ముఖము అనెడి, అప్పుష్ప=చన్ద్రునిచేత, అర్పిత=అర్పించబడిన, గళగత=తన కణ్ఠమునందున్న,



ఇన్దీవరమయస్రక్=కలువపూలమాలకు, ఉల్లాస=ఉల్లాసమును కలుగజేయు, స్మేర=చిరునవ్వుయొక్క, ద్యు=కాన్తియందు, విహృత=విహరించు, చకోరీ=చకోర పక్షుల యొక్క, పరికరమ్=సముదాయము కలవాడును, రమా.... ద్వక్షస్కమ్ – రమా=లక్ష్మీదేవి అనెడు, లావణ్యాబ్ధి=సౌన్దర్యసముద్రమునందు, ఉద్భవత్=పుట్టుచున్న, అమృత కుమ్భ=అమృతముతో నిండిన కుండలయొక్క, ప్రతికృతి=ప్రతిబింబము లతో, ప్రరజ్యత్=బాగుగ రంజింపబడిన, వక్షస్కమ్=వక్షఃస్థలము కలవాడును, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందు ఉండువాడును అగు, హయవదనమ్=హయ గ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** లక్ష్మీదేవి ముఖము చన్ద్రబిమ్బమువలెనున్నది. ఆమె కన్నులు నల్లని కలువపూల వలె నున్నవి. లక్ష్మీదేవి తన కనులతో హయగ్రీవునిపై ప్రేమతో చూపులను ప్రసరింపజేయుచుండగా చన్ద్రుడు హయగ్రీవుని కణ్ఠముపై కలువపూల మాలను అర్పించుచున్నట్లుగ నుండెను. (చన్ద్రుడు కలువపూలను ఇష్టపడును. అందువలన భగవంతునికి కూడ తనకు ఇష్టమైన కలువపూలమాలను సమర్పించెను అని చెప్పబడెను.) లక్ష్మీదేవి ప్రేమతో తన మీద చూపులను ప్రసరింపజేయుచుండగా హయగ్రీవుడు "సకల జగన్మోహినియగు లక్ష్మీదేవికి కూడ నా శరీరము మోహమును కలుగజేయుచున్నది గదా!" అను సంతోషముతో చిఱునవ్వు నవ్వుచున్నాడు. వెన్నెలవంటి ఈ చిఱునవ్వు ఆయన మెడయందు చన్ద్రునిచే అర్పించబడిన కలువ పూలమాలను వికసింపజేయుచున్నది. సహజముగ వెన్నెల కలువపూలను వికసింప జేయును గదా! హయగ్రీవుని ఈ చిఱునగవును శచీదేవి మొదలగు దేవకాన్తలు అనురాగముతో చూచుచుండగా హయగ్రీవుని చిఱునగవులు అను వెన్నెలయందు దేవకాన్తల కన్నులు అనెడి చక్రవాకపు పక్షులు విహరించుచున్నట్లుగ నున్నది. ఈ విధముగ తనను అనురాగముతో చూచుచున్న లక్ష్మీదేవిని హయగ్రీవుడును కౌగిలించుకొనినాడు. ఈ దృశ్యము ఎట్లున్నదనగా –

లావణ్యముతో నిండిన లక్ష్మీదేవి లావణ్యమునకు సముద్రమువలె నున్నది. పూర్వము పాలసముద్రమును మందర పర్వతముతో మథించగా దానినుండి అమృత కుమ్భము పుట్టినది. అట్లే ఈ లావణ్య సముద్రమునందు మన్మథమథనముచే పుట్టుచున్న రెండు అమృతకుమ్భములవలె ఆమె రెండు స్తనములు కలవు.

హయగ్రీవుని వక్షఃస్థలము దర్పణమువలె నున్నది. అందువలననే హయగ్రీవుడు లక్ష్మీదేవిని కౌగిలించుకొనగా ఆమె స్తనముల ప్రతిబింబములతో ఆయన వక్షః స్థలము ఎఱ్ఱగా రంజింపబడెను. ఇట్టి హయగ్రీవుని నేను శరణుపొందుచున్నాను.

## - లక్ష్మీ తిలక వర్ణన -

**శ్లో॥ తమిస్రం నీలాభ్రం ద్వయమపి మిళిత్వామృతరుచిం**
**సమాక్రామ త్పార్శ్వ ప్రపతిత మివాలోక్య సుదృఢమ్।**
**కరాబ్జే నిష్పీడ్య క్షిపసి కి మభీత్యై హిమరుచౌ**
**సుకస్తూరీరేణుం హయవదన మిన్దుస్థిత మయే॥ 60**

**ప్రతిపదార్థము:-** అయే!=ఓ అశ్వాననా!, తవ=నీ యొక్క, పార్శ్వప్రపతితమ్=ప్రక్కనే పడిఉన్న, అమృతరుచిమ్=చన్ద్రుని, సమాక్రామత్ ఇవ=ఆక్రమించుచున్నదో అను నట్లున్న, మిళిత్వా=కలసియున్న, తమిస్రమ్=చీకటిని, నీలాభ్రమ్=నల్లని మేఘమును, ద్వయమపి=ఈ రెంటిని, కరాబ్జే=పద్మమువంటి నీ చేతియందు, నిష్పీడ్య =బాగుగ వత్తి, సుకస్తూరీరేణుమ్=శోభనమగు ఈ కస్తూరీచూర్ణముగా, హిమరుచౌ= చన్ద్రుని యందు, అభీత్యై=భయములేకుండుట కొరకు, క్షిపసికిమ్=ఉంచుచున్నావా ఏమి?, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** చన్ద్రునకు చీకటి, నల్లని మేఘము అను ఇరువురు శత్రువులు కలరు. వీరిరువురును ఒక్కొక్కరుగా చన్ద్రుని ఆక్రమించవలెనని ప్రయత్నించి ఆక్రమించలేక అనేక పర్యాయములు విఫలమాయిరి. అనంతరము వీరిద్దరును కలసి మరింత నల్లగా మారి లక్ష్మీదేవి కేశములుగా రూపాన్తరమును పొంది ఆమె ముఖము అనెడి చన్ద్రుని ఆక్రమించుటకు ప్రయత్నించుచున్నారా అనునటుల ఆమె ముఖముపై పడుచున్న ముంగురులు ఉన్నవి. అందుకు భయపడిన చన్ద్రుడు హయగ్రీవుని శరణు జొచ్చెనా అనునటుల హయగ్రీవుని ప్రక్కనే గల లక్ష్మీదేవి ముఖము ఉండెను. అప్పుడు శరణాగతవత్సలుడైన హయగ్రీవుడు చన్ద్రుని భయము పోగొట్టుటకై కేశములుగా మారిన చీకటిని, నీలమేఘమును తన చేతిలోనికి తీసికొని బాగుగ నూరి ఆ నల్లని చూర్ణమును చన్ద్రుని ముఖముపై పూసినాడా అనునటుల లక్ష్మీదేవి ముఖమున కస్తూరీ చూర్ణముగలదు. చన్ద్రమణ్డలనివాసియగు అట్టి హయగ్రీవుని నేను శరణుపొందుచున్నాను.



## - సీమన్త వర్ణన -

**శ్లో॥ శిరోజ వ్యూహోద్య త్పరిమళ పరీవాహ సుభగ**
**స్వసీమన్తచ్ఛాయా ధవళిత మనోనాథ నయనా।**
**మణీభూషా శిఞ్జా ముఖరిత కరామ్భోజ మరుతా**
**రమా యత్ స్వేదాదా హయవదన మిన్దుస్థిత మయే॥ 61**

**ప్రతిపదార్థము:-** శిరోజ ..... నయనా - శిరోజవ్యూహ=(నల్లకలువపూలవంటి) కేశసమూహమునుండి, ఉద్యత్=ఆవిర్భవించుచున్న, పరిమళపరీవాహ=సౌరభ ప్రవాహము వలె, సుభగ=మనోహరమైన, స్వ=తనయొక్క (లక్ష్మీదేవి యొక్క) సీమన్త చ్ఛాయా=పాపటకాన్తిచే, ధవళిత=తెల్లనైన, మనోనాథ నయనా=ప్రాణేశ్వరుని కన్నులు గల, రమా=లక్ష్మీదేవి, మణీ ... మరుతా - మణీభూషా=మణికంకణముల, శిఞ్జా =నాదములచేత, ముఖరిత=ధ్వనించుచున్న, కర=చేతియందలి, అమ్భోజ= పద్మము యొక్క, మరుతా=గాలితో, యత్స్వేదాదా=ఎవరి చెమటను పోగొట్టునది, (భవతి =అగుచున్నదో), ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్=అట్టి హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** లక్ష్మీ శిరోజముల మధ్య పొడవుగానున్న సీమన్త రేఖ గంగవలె, చన్ద్రరేఖవలె, తెల్లగనున్నది. ఈ తెల్లని కాన్తి శిరోజముల పరిమళ ప్రవాహము వలె నున్నది. దీనిని చూచి హయగ్రీవుని నయనములు ఆనన్దముతో వికసించినవట. నిరన్తర దేవతా సమావేశము చేతగాని, లక్ష్మీ సీమన్తసౌన్దర్య దర్శనము చేతగాని చెమర్చుచున్నట్లున్న హయగ్రీవునకు మణికఙ్కణ ధ్వనులు తోడుగా తనచేతి విలాస కమలముతో లక్ష్మీదేవి వింజామరలు వీచుచున్నది. చన్ద్రమణ్డల నివాసియైన అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:-** 1) సీమన్త రేఖ చన్ద్రరేఖవలె నుండుటచే శిరోజములకు చీకటితో పోలిక - ఉపమాలంకారధ్వని.

2) సీమన్త శోభ హయగ్రీవుని నయన కమలములను వికసింపజేయుచున్నది. గనుక గంగతో పోలిక ధ్వనించుచున్నది. దీనివలన శిరోజములకు నీలాకాశముతో పోలిక ధ్వనించుచున్నది.

3) సీమన్త రేఖను పరిమళప్రవాహముగ చెప్పుటవలన శిరోజములకు

మేఘముతో పోలిక వచ్చుచున్నది. (లేదా) నల్లకలువతో నిండిన చెఱువుతో పోలిక వచ్చుచున్నది. కాగా శిరస్సు చెఱువు, పరిమళము జలము, కేశములు కలువలు, పాపట కాలువ అని సావయవ రూపక ధ్వని.

4) హయవదనుడు దేవుడు కనుక స్వేదము ఉండదు. కనుక మెడపైని ముత్యములే స్వేదముగా చెప్పబడినది. ఇది అతిశయోక్తి. ఈ స్వేదమును ఆపుటకై లక్ష్మీదేవి కరకమలముతో వింజామరలు వీచుటవలన భ్రాన్తిమదలంకారము ధ్వని.

**– నాసిక – ముఖ – కర వర్ణన –**

**శ్లో॥ విధాత్రబ్ధ్యాయాయి శ్రుతిమయ సరిన్మౌళి జనిభూ**
**ర్యదీయా శ్రీనాసా ముఖ మమర విద్వేషి లయభూః।**
**కరామ్భోజం శమ్భుప్రముఖ సుర రక్షాగృహ మహో!**
**మహేశ! త్వా మీశం హయవదన మిన్దుస్థిత మయే॥ 62**

**ప్రతిపదార్థము:–** యదీయా=ఏ హయగ్రీవుని యొక్క శ్రీనాసా=గొప్పదియగు ముక్కు, విధాత్రబ్ధ్యాయాయి.....జనిభూః – విధాతృ=బ్రహ్మఅనెడి, అబ్ధి=సముద్రమును గురించి, ఆయాయి=వచ్చునటువంటి, శ్రుతిమయ=వేదస్వరూపమగు, సరిన్మౌళి=నదీశ్రేష్ఠమగు గంగకు, జనిభూః=పుట్టుక స్థానమో, యదీయమ్=ఏ దేవునికి సంబంధించిన, ముఖమ్=ముఖము, అమర విద్వేషిలయభూః=మధుకైటభాది రాక్షసుల నాశనమునకు మూలకారణమో, యదీయమ్=ఏదేవునికి సంబంధించిన, కరామ్భోజమ్=కరకమలము, శమ్భు...గృహమ్ – శమ్భుప్రముఖ=పరమేశ్వరుడు మొదలుగా కల, సుర=దేవతలకు, రక్షాగృహమ్=రక్షణ లభించు గృహమో!, అహో!= ఎంత ఆశ్చర్యము, మహేశ!=ఓ ప్రభూ!, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలము నందున్న వాడవును, ఈశమ్=పరమేశ్వరుడవును, హయవదనమ్=హయగ్రీవుడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** హయగ్రీవుని నాసిక వేదములకు, ఉపనిషత్తులకు జన్మభూమి వీటినే విధాత నిత్యము అధ్యయనము చేయుచుండును. హయగ్రీవుని ముఖము నుండి వచ్చిన హేషారవమే మధుకైటభాది రాక్షసులను సంహరించినది. ఈ హయగ్రీవుని కరకమలమే (అనగా అభయహస్తమే) పరమేశ్వరాది దేవతా ప్రముఖులకు రక్షణ నిలయము. అట్టి హయగ్రీవునకు నమస్కారము.



**విశేషములు:–** 1) హయగ్రీవుని నాసిక నుండియే వేదములు ప్రభవించినవి. చూ. **వాచో బభూవు రుశతీః శ్వసతోఽస్య నస్తః** – భాగవతము. **తస్యైవ మహతో భూతస్య నిశ్వసితమేతత్ యదృగ్వేదో యజుర్వేద స్సామవేద ఇతి**–శ్రుతి 2) వేదగంగా జన్మస్థలము అనుటచే నాసికకు హిమాలయ గుహతో పోలిక ధ్వనించుచున్నది. 3) ఆయన నిశ్వాసములను విధాత మననముచేయుటవలన హయగ్రీవుని మహిమ వ్యక్తముచేయబడుచున్నది. 4) గంగాప్రవాహముతో పోలికవలన వేదము ఆడంబరముగా ప్రవహించు చున్నట్లును, ఆ ప్రవాహమును పొందిన బ్రహ్మ సముద్రుడైనట్లును రూపకాలంకారము ధ్వనించుచున్నది. 5) హయగ్రీవునిదండకము ప్రకారము హయగ్రీవుని హేషారవముతోనే మధు కైటభాదులు చనిపోయినట్లు వర్ణన. 6) ఈశ అనుట చేత సర్వజ్ఞత్వము మొదలైన అంతర్గతగుణము సర్వశక్తిమన్తుడు సర్వకర్త అను బహిర్గతగుణములు సూచింప బడినవి.

**– నేత్ర వర్ణన –**

**శ్లో॥ రవీన్దుభ్యాం సర్వం జగ దఖివిభో! పశ్యతి భవాన్**
**ఇతీయం సత్యా హి స్మృతి రఖిలలోకః ఖలు విరాట్।**
**అసృగ్రేఖా సౌరీ హిమరుచిమయోఽయం ధవళిమా**
**కళఙ్క స్తారా వా హయవదన మిన్దుస్థిత మయే॥ 63**

**ప్రతిపదార్థము:–** హే అఖివిభో!=ఓ సర్వేశ్వరా!, భవాన్=నీవు, రవీన్దుభ్యామ్=సూర్య చన్ద్రులతో, సర్వమ్=సమస్తమైన, జగత్=లోకమును, పశ్యతి=చూచుచున్నావు, ఇతి=అను, ఇయమ్=ఈ, స్మృతిః=స్మృతివాక్యము, సత్యా=యథార్థమైనది, హి= ఎందువలననగా, భవాన్=నీవు, అఖిల లోకః=సమస్త లోకములు (శరీరముగా) కల, విరాట్=విరాట్పురుషుడవు, వా=లేదా, అసృగ్రేఖా=నీ కంటిలోని నెత్తుటి గీత (ఎఱ్ఱని జీర), సౌరీ=సూర్యుని యొక్క అంశ, (భవతి=అగును), అయమ్=ఈ, ధవళిమా=తెల్లదనము, హిమరుచిమయః=చన్ద్రుని యొక్క అంశ, (భవతి=అగును), తారా=నల్లని గ్రుడ్డు, కళఙ్కః=చంద్రునిలోని కళఙ్కము యొక్క అంశ, (భవతి= అగును),ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉండు,హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్ =నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** సర్వేశ్వరుడవైన ఓ హయగ్రీవా! నీవు సూర్యచన్ద్రులతో సకలమైన జగత్తును చూచుచుందువు అని పెద్దలు చెప్పెదరు. ఈ మాట సంపూర్ణముగా యథార్థమైనది. ఎట్లనగా సమస్తలోకములు శరీరముగా కల విరాట్పురుషుడవు నీవే కదా! ఆ విరాట్పురుషునకు సూర్యచంద్రులే కదా నేత్రములు. (పురుషుని యొక్క ఆకారమునకు తగినట్లుగా కన్నులు ఉండును. సకల లోకములు శరీరముగా కల విరాట్పురుషునకు సూర్యుడు, చన్ద్రుడు నేత్రములుగా ఉండుట యుక్తమే కదా! అనగా ఒక కన్ను సూర్యుడు కాగా మరియొక కన్ను చంద్రుడు అగును. ఆ రెండు కన్నులతో నీవు అన్ని లోకములను చూచుచుందువు. కన్నులు రెండును ఒకరకముగా ఉండవలెను కాన ఒక కన్ను సూర్యుడు మరియొక కన్ను చన్ద్రుడు ఎట్లగునని ఎవరైన ప్రశ్నింతురేమో! అట్లయిన పెద్దలు చెప్పు పై స్మృతి వాక్యమునకు అర్థమును ఇట్లు చెప్పికొందము. నీ కన్నులు రెండును సూర్య చంద్రమయమైనవే. అనగా రెండు కన్నులలోను సూర్యచంద్రుల అంశములు కలవు. ఎట్లనగా నీ కన్నులలోని ఎఱ్ఱని జీర సూర్యుని యొక్క అంశము. (కనులలో ఎఱ్ఱని జీర యుండుట సాముద్రికశాస్త్రరీత్యా ఉత్తమ పురుషలక్షణము). కన్నులలోని తెల్లదనము చంద్రుని యొక్క అంశ. నల్లని కనుగ్రుడ్డు చంద్రునిలోని కళఙ్కము యొక్క అంశ. ఈ విధముగా రెండు కన్నులలోను సూర్య చంద్రాంశలు కలవు.

**– పాద వర్ణన –**

**శ్లో॥ రజః పాదామ్భోజం శ్రుతిభిరపి మృగ్యం తవ విభో।**
**క్వ పాదః క్వామ్భోజం భ్రమరసులభం యస్య తు రజః।**
**అహో! ధన్యా లక్ష్మీ ర్యదభిరుచిరాపాఙ్గ మధుపాః**
**భవత్పాదామ్భోజే హయవదన మిన్దుస్థిత మయే॥ 64**

**ప్రతిపదార్థము:–** హే విభో!=ఓ సర్వేశ్వరా!, తవ=నీయొక్క, పాదామ్భోజమ్=పద పద్మముల యందలి, రజః=రజస్సు, శ్రుతిభిఃఅపి=వేదములచేత కూడ, మృగ్యమ్=వెతుకదగినదియే, యస్య=ఏ పద్మము యొక్క, రజః=పుప్పొడి, తు=మాత్రము, భ్రమర సులభమ్=తుమ్మెదలచేతసైతము తేలికగా పొందుటకు వీలయినదో, (తత్=అట్టి), అమ్భోజమ్=పద్మము, క్వ=ఎక్కడ?, పాదః=నీ యొక్క పాదము, క్వ=ఎక్కడ?, అహో!=ఎంత ఆశ్చర్యము!, యదభిరుచిరాపాఙ్గమధుపాః=ఏ లక్ష్మీదేవి యొక్క అందమైన కటాక్షములు అనెడి తుమ్మెదలు, భవత్పాదామ్భోజే=నీ పాద



పద్మములయందు, (సన్తి=కలవో, సా=ఆ), లక్ష్మీః=లక్ష్మి, ధన్యా=ధన్యురాలు, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ ప్రభూ! హయగ్రీవా! పద్మములవంటి నీ పాదముల యందలి రజస్సు శ్రుతులకు సైతము తేలికగా లభ్యమగుట లేదు. పోనిమ్ము. పాదములకంటే పద్మములే గొప్పవి గదా! అందువలననే వాటిని పాదములకు ఉపమానముగా స్వీకరించితిరి. కాన ఆ పద్మముల రజస్సునే శ్రుతులు గ్రహించవచ్చును గదా అని అందురేమో! తుమ్మెదలచేత కూడ పొందబడు రజస్సు కల పద్మము లెక్కడ? హయగ్రీవుని పాదము లెక్కడ? పద్మములకు హయగ్రీవుని పాదములకు పోలికయే లేదు. అట్లయిన హయగ్రీవుని పాదములు పద్మముల వంటివి అని ఎలా అంటిరి? అని అందురేమో? పోలిక లేకపోయినను లక్ష్మీదేవి యొక్క కటాక్షములు అనెడి తుమ్మెదలు హయగ్రీవుని యొక్క పాదములయందుండుట అను ఒకే కారణమున హయగ్రీవుని పాదములు పద్మములవంటివి అని అనుచున్నాము. హయగ్రీవుని పాద పద్మముల యందు లక్ష్మీదేవి కటాక్షములు ఉండుటచే లక్ష్మీదేవి ధన్యురాలు.

**విశేషములు:–** హయగ్రీవుని పాద పద్మముల యందలి రజస్సు శ్రుతులచేత కూడ వెతుక దగియున్నది అని అనుటచే శ్రుతుల అనంతరము పుట్టిన బ్రహ్మ రుద్రాదులకు కూడ తేలికగా లభించునది కాదు అని తెలియుచున్నది. మరియును శ్రుతి శబ్దము స్త్రీలింగ మగుటచే శ్రుతి అనెడి స్త్రీ సీమంతమునందు సిందూరముగా ధరించుటకు నీ పాదపద్మములయందలి రజస్సు వెతుకుచున్నవి అని ధ్వనించుచున్నది.

**– కటాక్ష మహిమ వర్ణన –**

**శ్లో॥ కటాక్ష స్తే యత్ర క్వచన నిపతే త్సద్విజశిశుః**
**సుపర్వబ్రాహ్మ్యా సత్కర గతమణీ కఙ్కణరవమ్।**
**స్వయం కణ్ఠే శ్లిష్టో భవదురుగుణాన్ గాయతి ముదా**
**హరే! కారుణ్యాబ్ధే! హయవదన మిన్దుస్థిత మయే॥ 65**

**ప్రతిపదార్థము:–** హే హరే!=ఓ హయగ్రీవా!, కారుణ్యాబ్ధే!=కరుణాసముద్రా!, తే=నీ యొక్క, కటాక్షః=కటాక్షము, యత్ర క్వచన=ఎక్కడైతే, నిపతేత్=పడునో, సఃద్విజశిశుః =ఆ ద్విజ బాలకుడు, సత్కర గత మణీ కంకణరవమ్=మణీకంకణ ధ్వనులతో

సత్పురుషులు చప్పట్లు కొట్టునట్లుగ, సుపర్వబ్రాహ్మ్యా=దేవభాషయగు సంస్కృతము చేత, స్వయమ్= తనంతటతానుగా, కణ్ఠే=కణ్ఠమునందు, శ్లిష్టః=కౌగిలించుకొన బడినవాడై, ముదా=సంతోషముతో, భవదురుగుణాన్=నీ గొప్ప గుణములను, గాయతి=గానము చేయుచున్నాడు, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయ వదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** కరుణామయా! హయగ్రీవా! నీ దివ్య కటాక్షపాత్రమైన విప్రబాలకుని కణ్ఠసీమను గీర్వాణ సరస్వతి కౌగిలించుకొనును. ఆతడు చేయుచున్న నీ కల్యాణ గుణ వర్ణనము విని మణికంకణములు మారుమ్రోగునట్లుగ సజ్జనులు కరతాళ ధ్వనులు చేయగలరు. చన్ద్ర సింహాసనాధీశా! హయగ్రీవా! నీకు నమస్కారము.

**విశేషములు:–** 1) ఈ శ్లోకమునందు కవి తన చరిత్రనే వ్యంగ్యముగా ప్రస్తావించినాడు. బ్రహ్మశ్రీ వేదమూర్తులు శ్రీ బెల్లకొండ రామరాయకవి గారు కేవలము హయగ్రీవోపాసనవలననే సకల విద్యలను పొంది తాను జీవించిన 38 సంవత్సరముల లోనే 150 గ్రంథములను రచించి జీవన్ముక్తులైనారు. హయ గ్రీవుని కటాక్షమహిమకు ఇంతకన్న నిదర్శనమేమి కావలయును? 2) భగవంతుని యందు భక్తి కలిగి ఆయనను స్తోత్రము చేయుటకు కూడ ఆ భగవన్తుని అనుగ్రహమే కావలయును అని ఈ శ్లోకములో కవి చెప్పినాడు. అందువలననే ప్రహ్లాదుడు సైతము నరసింహస్వామి కోరికనేదియైన కోరుకొనుము తీర్చెదను అని ఆనతీయగా “స్వామీ! నీ యందు భక్తి బాగుగ పెరుగునట్లు అనుగ్రహించుము” అని కోరుకొనెను. సకలార్థసాధకమగు భక్తి ఉన్న యెడల మనుజులకు కావలసినది ఏమి ఉన్నది?

**– కీర్తి గాన మహిమ –**

**శ్లో॥ భవద్వార్తా గానామృత జలధి భఙ్గోద్గత పృష**
**త్సమూహాసఙ్గార్ద్ర శ్వసన హృత తాపత్రయ రుజః।**
**హరత్వం బ్రహ్మత్వం సురనగర నేతృత్వ మపి హో**
**తృణమ్మన్యన్తే జ్ఞాః హయవదన మిన్దుస్థిత మయే॥ 66**

**ప్రతిపదార్థము:–** అయే!=ఓ హయగ్రీవా!, జ్ఞాః=పణ్డితులు, భవద్వార్తా ...... రుజః – భవత్=నీ యొక్క, వార్తా=మధుకైటభహననము మొదలగు గాథలయొక్క, గానామృత=గానము అనెడి అమృతము యొక్క, జలధి=సముద్రము యొక్క, భఙ్గ=



తరంగములనుండి, ఉద్గత=పైకివచ్చిన, పృషత్ సమూహ=బిన్దు సమూహము యొక్క, ఆసఙ్గ=సంయోగము చేత, ఆర్ద్ర=చల్లనైన, శ్వసన=గాలిచేత, హృత= పోగొట్టబడిన, తాపత్రయరుజః=తాపత్రయముచే ఏర్పడిన బాధ కలవారు అగుచు, హరత్వమ్= పరమేశ్వరుని పదవిని, బ్రహ్మత్వమ్=బ్రహ్మపదవిని, సురనగర నేతృత్వ మపి=ఇన్ద్రపదవిని కూడ, తృణమ్=గడ్డిపోచనుగా, మన్యన్తే=తలచుచున్నారు. హో!= ఎంత ఆశ్చర్యము!, ఇన్దుస్థితమ్= చన్ద్రమణ్డలము నందున్న, హయవదనమ్=హయ గ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** హయగ్రీవా! నీ దివ్య చరిత్రగానామృత సముద్రము నుండి ఎగసిపడిన తుంపురులు చేత చల్లబడిన గాలియే లేదా ప్రాణవాయువే తమ తాపత్రయములను పోగొట్టుచుండగా పండితులెవరైనను ఇంద్రపదవిని గాని, బ్రహ్మపదవిని గాని, శివపదవిని గాని తృణీకరించెదరు. కారణమేమనగా ఆయా లోకములకు వెళ్ళువారికి తాపత్రయములు మాత్రమే శాంతించును. శాశ్వత మోక్షము లేదు. నీ గుణములను స్వయముగ గానము చేయుట చేతగాని అసమర్థులకైనను ఆ తాపత్రయములను హరించుచుండగా వివేకవంతులు ఎవరైనను ఆయా పదవులను ఆశింపరుగదా!

**– చరణధ్యాన మహిమ –**

**శ్లో॥ యది ధ్యాతు శ్చిత్తే తవ చరణపద్మో విజయతే**
**న తత్ర స్యా త్పద్మో న ఖలు సుఖపద్మో ధ్రువరసః।**
**మహాపద్మో నో వా త దయ సదురః పద్మ! మదురః**
**ప్రసీద త్వాం దేవం హయవదన మిన్దుస్థిత మయే॥ 67**

**ప్రతిపదార్థము:–** హే సదురః పద్మ!=శ్రేష్ఠమగు వక్షస్స్థలము నందు లక్ష్మీదేవికల ఓ హయగ్రీవా!, ధ్యాతుః=ధ్యానము చేయువాని యొక్క, చిత్తే=మనస్సునందు, తవ=నీ యొక్క, చరణపద్మః=పద్మము వంటి చరణము, యది విజయతే= ఉన్న ట్లయితే, తత్ర=ఆ మనస్సునందు,పద్మః=పద్మము,న స్యాత్=ఉండదు,ధ్రువరసః= నిశ్చయముగ రసము కల, సుఖపద్మః= ఆనంద నిధి యగు పరమాత్మ సైతము, న ఖలు స్యాత్=ఉండదు, మహాపద్మః=మహాపద్మము అను పేరుకల నిధి సైతము, నో వా స్యాత్=ఉండదు, తత్=అందువలన, మత్=నా యొక్క, ఉరః=వక్షస్స్థలము లోని హృదయమును(ఉరః అను పదమునకు వక్షఃస్థలము అర్థము. లక్షణావృత్తి

ద్వారా వక్షస్థలము లోపల నుండు హృదయము అని అర్థము వచ్చును. ఆ అర్థము ప్రకృతములో స్వీకరించబడినది.), అయ=పొందుము, ప్రసీద=అనుగ్రహించుము, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న వాడవును, దేవమ్=భగవంతుడవును, హయవదనమ్=హయగ్రీవుడవును అగు, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! ఏ భక్తుని మనస్సునందు నీ పాద పద్మముండునో (అనగా ఏ భక్కుడు ఎల్లప్పుడు భక్తితో నీ పాద పద్మములను మనస్సునందు ధ్యానించుచుండునో) వారి మనస్సునందు పద్మము ఉండదు. అనగా అట్టి భక్తులు తమ మనస్సునందు పద్మమును కోరరు. ఎల్లప్పుడు వికసించియుండు అతి సున్దరమగు నీ చరణ పద్మము లభించిన వారలకు సామాన్య సౌన్దర్యము కలదియు, మరియు పగటిపూట మాత్రమే వికసించి రాత్రివేళలందు ముడుచుకొను నదియును అగు పద్మముపై ఏల కోరిక కలుగును. అట్లే నిశ్చయముగ సుఖమును ఇచ్చు పరబ్రహ్మ కూడ వారి మనస్సున ఉండదు. అనగా పరబ్రహ్మయందు సైతము కోరిక ఉండదు. పరబ్రహ్మానందము కంటె భక్తులకు భగవచ్చరణ సేవానన్దమే గొప్పది అని భాగవత వచనమునుసరించి భగవచ్చరణ సేవానందము గొప్పది గాన అది లభించిన వారలకు పరబ్రహ్మానన్దమేల? అట్లే మహా పద్మము అను నిధి వారి మనస్సున ఉండదు. అనగా ఆ మహాపద్మనిధిపై కూడ వారలకు కోరిక ఉండదు. భగవచ్చరణ సేవాభాగ్యము లభించిన వారలకు ఇతర భాగ్యము లేల? అందువలన ఓ హయగ్రీవా! నీవు నా మనస్సున ఎల్లప్పుడు ఉండుము. అనుగ్రహించుము. చన్ద్రమణ్డలమునందున్న నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–**

**ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రన్థా అప్యురుక్రమే।**
**కుర్వ న్త్యహైతుకీం భక్తి మిత్థం భూతగుణో హరిః॥ – భాగవతము.**

అను భాగవత వచనమునందు బ్రహ్మానందముకంటె భగవచ్చరణసేవానందము గొప్పది అని చెప్పబడినది. భక్తి అనగా భగవన్తుని సేవ యందు ఆసక్తి. ఆత్మయే బ్రహ్మ కావున ఆత్మారామాః అనగా బ్రహ్మానందము ననుభవించువారు అని అర్థము. ముక్తులు కూడ అనగా బ్రహ్మానందము ననుభవించువారు కూడ లీలతో శరీరమును ధరించి భగవంతుని సేవించెదరు అని శ్రుతిగీతలయందు చెప్పబడినది.



**– దశావతార వర్ణన (68,69) –**

**శ్లో॥ ఝషా దాసన్ వేదాః కుధర మవహత్ కూర్మ ఉదధౌ**
**వరాహో భూబిమ్బం నృహరి రుదభూ దాయసతలాత్।**
**పదన్యాసై ర్డిమ్భ స్త్రిజగ దహర ద్వా కతిపయైః**
**ఇతీదం తే కృత్యం హయవదన మిన్దుస్థిత మయే॥ 68**

**ప్రతిపదార్థము:–** అయే!=ఓ హయగ్రీవా!, ఝషాత్=చేపనుండి, వేదాః=వేదములు, ఆసన్=పుట్టినవి, ఉదధౌ=సముద్రమునందు, కూర్మః=తాబేలు, కుధరమ్=మందర పర్వతమును, అవహత్=మోసెను, ఉదధౌ=సముద్రమునందు, వరాహః=పంది, భూబిమ్బమ్=భూమణ్డలమును, అవహత్=మోసెను, ఆయసతలాత్=ఇనుపస్తంభపు లోపలి భాగమునుండి, నృహరిః=సింహపు శిరస్సు, నరుని మొండెము కల వింత జంతువు (నరసింహస్వామి), ఉదభూత్=పుట్టెను, కతిపయైః పదన్యాసైః=కొన్ని పాదన్యాసములతో మాత్రమే (మూడు పాదన్యాసములతో), డిమ్భః=చిన్నపిల్లవాడు (వామనుడు), త్రిజగత్=మూడులోకములను, అహరత్ వా ("వా" అనునది వాక్యాలంకారము కొరకు ప్రయోగింపబడినది)=ఆక్రమించెను, ఇతి=అను, ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమును, తే=నీ యొక్క కృత్యమ్=పనియే, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్ =నేను), అయే=శరణు పొందుచున్నాను.

**తాత్పర్యము:–** చేప నుండి వేదములు పుట్టినవి. తాబేలు సముద్రము నందు పర్వతమును మోసెను. పంది భూమండలమునే సముద్రమున మోసెను. ఇనుప స్తమ్భములోనుండి సింహపుతల, మనిషి మొండముగల విచిత్రప్రాణి ఆవిర్భవించెను. చిన్నపిల్లవాడు తన మూడు అడుగులతో ముల్లోకములను ఆక్రమించెను. స్వామీ! ఊహించుటకు కూడ అలవికాని ఈ అద్భుత కార్యము లన్నియు నీవు చేసినవియే కదా!

**విశేషములు:–** ఈ శ్లోకము నందు మత్స్యావతారము, కూర్మావతారము, వరాహావతారము, నరసింహావతారము, వామనావతారము అను ఐదు అవతారములు వర్ణించబడినవి.

1. **మత్స్యావతారము** :– ఈ అవతారము నందు చేప బ్రహ్మదేవునకు వేదముల

నొసగినది. అనగా వేదములు చెప్పినది. మనుష్యులు మాత్రమే ఉచ్చరించగలిగిన వేదములను చేప ఉచ్చరించుట ఆశ్చర్యకరము కదా!

2. **కూర్మావతారము** :– తాబేలు పర్వతమును మోయుటయు ఆశ్చర్యమే

3. **వరహావతారము** :– ఇందు పంది భూమణ్డలమును తన ముట్టెపై మోసెను.

**4. నరసింహావతారము** :– ఇందు నారాయణుడు నరసింహరూపమున ఇనుప స్తంభములో ఆవిర్భవించెను.

5. **వామనావతారము** :– ఇందు చిన్న బ్రాహ్మణ బాలకుడు తన మూడు అడుగులతో మూడు లోకములను ఆక్రమించెను.

**శ్లో॥ కథాశేషం క్షత్రం ద్విజపరశుధారాభి రకృత**
**క్షమాధ్రా ఉన్మగ్నా స్సరిదధిపతౌ గోపశిశునా।**
**అపాయ్యగ్ని శ్రౌతమ్మతక మవరుద్ధే కలిజనః**
**కలిం హన్తా య స్తం హయవదన మిన్దుస్థిత మయే॥ 69**

**ప్రతిపదార్థము :**– ద్విజపరశుధారాభిః–ద్విజ=బ్రాహ్మణుడు ఐన పరశురాముని యొక్క, పరశు=గొడ్డలి యొక్క, ధారాభిః=అంచులతో, క్షత్రమ్=క్షత్రియ జాతిని, కథాశేషమ్=కథ మాత్రమే మిగిలినదిగా, అకృత=చేసెను. క్షమాధ్రాః=పర్వతములు, సరిదధిపతౌ=సాగరమునందు, ఉన్మగ్నాః=తేలియాడినవి, గోపశిశునా=ఆవులు కాచుకొనువాని పిల్లవానితో, అగ్నిః=అగ్ని, అపాయి=త్రాగబడెను, కలిజనః= కలి యుగములోని జనుడు, శ్రౌతమ్=వేదముచే ప్రతిపాదించబడిన, మతకమ్= మతము ను, అవరున్ధే=అడ్డగించుచున్నాడు, ఇతి=అను, ఇదమ్=ఇది అంతయును,తే=నీ యొక్క కృత్యమ్=పనియే, కలిమ్=కలిని, హన్తా=చంపబోవువాడు, యః=ఎవడో, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, తమ్=అట్టి, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :– పూర్వము పరమసాత్త్వికమైన బ్రాహ్మణ జాతిలో పుట్టిన ఒక బ్రాహ్మణుడు తన గండ్రగొడ్డలితో క్షత్రియ జాతినే నిర్మూలించెనెను. గొప్ప బరువు కల పర్వతములను ఒక మానవుడు సముద్రములో తేలియాడునట్లుగా చేసెను. ఆవులు కాచుకొనువాని పిల్లవాడు అగ్నిజ్వాలలను త్రాగివేచెను. కలియుగములో పుట్టిన ఒక జనుడు వేదప్రోక్తమగు మతమును అడ్డగించెను. ఇవి అన్నియును



ఊహించుటకు కూడా సాధ్యము కాని కార్యములే. అయినను ఓ హయగ్రీవా! అఘటన ఘటనా సమర్థుడవగు నీకు అసాధ్యమేమున్నది. ఇవి అన్నియును నీవు చేసిన పనులే కదా! మరియును రాబోవు కల్కి అవతారమునందు కలిని చంపబోవు వాడవును నీవే కదా! అట్టి నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :– ఈ శ్లోకమునందు పరశురామావతారము, రామావతారము, కృష్ణావతారము, బుద్ధావతారము, కల్క్యవతారము వర్ణించబడినవి.

**1. పరశురామావతారము** :– బ్రాహ్మణ జాతియందు పుట్టిన పరశురాముడు తన తండ్రిని అన్యాయముగ చంపిన కార్తవీర్యార్జుననే కాక ఇరువది యొక్కసార్లు దండయాత్ర చేసి గండ్రగొడ్డలితో క్షత్రియజాతిని నిర్మూలించెను.

**2. రామావతారము** :– సేతు నిర్మాణము చేయు సమయములో తన మాహాత్మ్యము చేతనే పర్వతములను సముద్రములో తేలియాడునట్లు చేసెను.

**3. కృష్ణావతారము** :– బాల్యక్రీడల దశయందే ఒకసారి కృష్ణుడు అగ్నిని త్రాగి వైచెను.

**4. బుద్ధావతారము** :– దేవతలను వంచించుటకు రాక్షసులు కలియుగమున మానవ రూపమును ధరించి వేదప్రోక్తములగు ధర్మములను ఆచరించి తమ శక్తులను వృద్ధి చేసికొనుచుండగా విష్ణువు బుద్ధుని రూపమున అవతరించి ఆ వేదములకు అసత్యార్థములను బోధించి వారిని వైదిక మతభ్రష్టులను చేసెను.

**5. కల్క్యవతారము** :– ఈ అవతారము భవిష్యత్తులో జరుగబోయెడిది. కలి యుగము నందు అధర్మము బాగుగా పెరిగిన పిమ్మట విష్ణువు కల్కి అను పేరున అవతరించి కలిని సంహరించును.

**– మహిమల వర్ణన (70,71) –**

**శ్లో॥ కపి స్సర్ప శ్శాబ్దం నిగమ మభిపేదే విషమపాత్**
**కపాలీ క్ష్మాదేవః కరజలరుహాచాన్తజలధిః।**
**జగచ్చక్షుర్నాథో లసతి బడబాయా శ్శశధరో**
**నిశాదీప స్తం త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 70**

**ప్రతిపదార్థము** :– కపిః=హనుమంతుడు, సర్పః=ఆదిశేషుడు (పతంజలి), శాబ్దం నిగమమ్=శబ్దశాస్త్రమును, అభిపేదే=పొందిరి, కపాలీ=శివుడు, విషమ్=హాలా హలము అను విషమును, అపాత్=త్రాగెను, క్ష్మాదేవః=బ్రాహ్మణుడు (అగస్త్యుడు)

కరజలరుహా=పద్మమువంటి తన చేతితో,ఆచాన్తజలధిః=సముద్రమును ఆచమనము చేసిన వాడాయెను (సముద్రమును త్రాగివైచెను), బడబాయాః నాథః= అశ్వమూర్తి అగు సూర్యుడు, జగచ్చక్షుః సన్=లోకములకు కన్ను వంటివాడు అగుచూ, లసతి=ప్రకాశించుచున్నాడు, శశధరః=చంద్రుడు, నిశాదీపః=రాత్రి సమయమందలి దీపముగా, లసతి=ప్రకాశించుచున్నాడు, (ఇతి=అను, ఇదమ్=ఈ, సర్వమపి=సమస్తమును, తే=నీయొక్క కృత్యమ్=పనియే) ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు వున్న, హయవదనమ్=అశ్వముఖుడవైన, తమ్=అటువంటి (వెనుక చెప్పిన పనులను చేసిన వాడవైన), త్వామ్=నిన్ను (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :- వానరుడైన ఆంజనేయుడు, సర్పము ఐన పతంజలి శబ్ద శాస్త్రము నందు గొప్ప పండితులైరి. శివుడు హాలాహలము అను విషమును త్రాగెను. అగస్త్యుడు సముద్రమును తన చేతితో త్రాగివైచెను. అశ్వరూపము గల సూర్యుడు లోకములను ప్రకాశింపజేయుచున్నాడు. చన్ద్రుడు రాత్రివేళలందు దీపముగా వెలుగొందుచున్నాడు. గొప్ప గొప్పవైన ఈ పనులన్నియు హయగ్రీవుడే ఆయా రూపములతో చేయుచున్నాడు. కాన ఇవి అన్నియు ఆయన పనులే. ఇంతటి మహిమ గల హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :- భగవద్గీత విభూతియోగము (10వ అధ్యాయము)నందు శ్రీ కృష్ణుడు ***యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా। తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశ సమ్భవమ్॥*** అని చెప్పినాడు. అనగా లోకమునందు గొప్ప శక్తులతో కూడియున్న పదార్థములన్నియూ నా తేజస్సు యొక్క అంశముతో పుట్టినవేనని భావము. ఆంజనేయుడు, ఆదిశేషువు మొదలైన వారు గొప్ప గొప్ప శక్తులు గలవారు అగుటచే వారు హయగ్రీవుని స్వరూపమేనని కవి చెప్పుచున్నాడు. అట్లు కానిచో సామాన్యములైన మాటలే మాట్లాడుటకు శక్తిలేని కోతి, పాములు సంస్కృత భాషకు సంబంధించిన వ్యాకరణ శాస్త్రములో ఎట్లు నిష్ణాతులగుదురు? శివుడు విషమును ఎట్లు మింగగలడు? అగస్త్యుడు సముద్రమును ఎట్లు త్రాగగలడు? సూర్యచన్ద్రులు లోకములను ఎట్లు ప్రకాశింపజేయగలరు? కాన ఆంజనేయుడు, పతంజలి, శివుడు, అగస్త్యుడు, సూర్యుడు, చంద్రుడు హయగ్రీవుని రూపములే.

**శ్లో॥ భవ న్నాసావాతాగతిగతివశా జ్జన్మవిలయౌ**
**జగత్త్రేతాపోన్తి వ్యతికలిత మేతద్ధి మునినా।**



**శిర స్సత్యం నాభి ర్ధరణిరితి పాదౌ కుతల మి**
**త్యసౌ బ్రహ్మోక్తి స్తే హయవదన మిన్దుస్థిత మయే॥** 71

**ప్రతిపదార్థము :-** జగత్త్రేతా=మూడు లోకములును, భవ...వశాత్-భవన్నాసావాత= నీ ముక్కులోని గాలియొక్క, ఆగతి గతివశాత్=రాకపోకల వలన, జన్మ విలయౌ=పుట్టుక, నాశములను, ఆప్నోతి=పొందుచున్నది, ఏతత్=ఈ విషయము, మునినా= మహర్షిచేత (మార్కండేయ మహర్షిచేత), వ్యతికలితమ్=చూడబడినది. తే=నీయొక్క,శిరః=శిరస్సు,సత్యమ్=సత్యలోకము,నాభిః=బొడ్డు, ధరణిః= భూలోకము, పాదౌ=పాదములు, కుతలమ్=పాతాళలోకము, అసౌ=ఈ మాట, బ్రహ్మోక్తిః=బ్రహ్మ యొక్క వచనము, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు వున్న, హయవదనమ్=హయగ్రీవుని (అహమ్=నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :-** ఓ హయగ్రీవా! ఈ మూడు లోకములును నీ నిశ్వాసము వలన పుట్టుచున్నవి. ఉచ్ఛ్వాసము వలన లయము చెందుచున్నవి. ఈ మాట అతిశయోక్తి కాదు. మార్కణ్డేయ మహర్షి ఒకానొక మాయాప్రళయమునందు వటపత్రశాయి అయిన బాలకుని ఉదరములో మూడు లోకములను, బయట ప్రళయ సాగరమును చూచెనని పురాణములు చెప్పుచున్నవి. మరియును నీవు విరాట్ స్వరూపమున నున్నప్పుడు సత్యలోకము నీ శిరస్సుగాను, భూలోకము బొడ్డుగాను, పాతాళలోకము పాదములు గాను ఉండును. ఈ విషయమును బ్రహ్మయే చెప్పినాడు. అట్టి మహిమ గల నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**- విరాట్ స్వరూప వర్ణన -**

**శ్లో॥ తవాక్షి ద్యౌ శ్చక్షు స్తరణి రమృతాంశుస్తు హృదయమ్**
**భుజాః పాలా వహ్ని ర్ముఖ ముదధయః కుక్షికుహరమ్।**
**తటిన్యో నాడ్యో ఽస్థివ్రతతి రవనీభృ త్సముదయః**
**శిరోజా అమ్భోదా హయవదన మిన్దుస్థిత మయే॥** 72

**ప్రతిపదార్థము :-** తవ=విరాట్స్వరూపుడవైన నీకు, ద్యౌః=అన్తరిక్షము, అక్షి=కన్ను, (భవతి=అగుచున్నది). తరణిః=సూర్యుడు, చక్షుః=కంటిలోని గ్రుడ్డు, భవతి=అగుచున్నాడు. అమృతాంశుః=చన్ద్రుడు, హృదయమ్=గుండె అగుచున్నాడు, పాలాః=దిక్పాలకులు, భుజాః=భుజములు అగుచున్నారు, వహ్నిః=అగ్ని, ముఖమ్=

ముఖము అగుచున్నాడు, ఉదధయః=సముద్రములు, కుక్షికుహరమ్=ఉదరము లోపలి భాగము అగుచున్నది. తటిన్యః=నదులు, నాడ్యః=నాడులు అగుచున్నవి. అవనీభృత్సముదయః=పర్వత సమూహము, అస్థివ్రతతిః=ఎముకల సమూహము అగుచున్నది, అమ్భోదాః=మేఘములు, శిరోజాః=వెంట్రుకలుఅగుచున్నవి, ఇన్దుస్థితమ్ =చన్ద్రునియందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను) అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము** :–హయగ్రీవుడు విరాట్ స్వరూపములోనున్నప్పుడు అన్తరిక్షమే ఆయనకు కన్ను, సూర్యుడు కంటిలోని గ్రుడ్డు, చన్ద్రుడు ఆయనకు గుండె. దిక్పాలకులు ఆయనకు భుజములు. వహ్నియే ముఖము, సముద్రములు ఆయన పొట్టలోపలి భాగము. నదులు ఆయనకు నాడులు. పర్వతములు ఎముకలు. మేఘములే కేశములు. ఈ విధముగా విరాట్ స్వరూపుడైన హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :– "**ద్యౌరక్షిణీ చక్షురభూత్ పతంగః**" అను భాగవత శ్లోకము ఈ శ్లోకమునకు ప్రమాణము.

– నైమిత్తిక ప్రళయ వర్ణన –

**శ్లో॥ ఇదం సర్వం స్వాన్త ర్జఠర ముపసంహృత్య భుజగే**
**శయానః క్షీరోదే నిజసుఖ మయన్ శ్రీ సహచరః।**
**పునఃకాలే నాభీ జలరుహతలోత్పాదిత విధిః**
**సృజ స్యేతత్ భూమన్! హయవదన మిన్దుస్థిత మయే॥ 73**

**ప్రతిపదార్థము :–** హే భూమన్!=పరబ్రహ్మ స్వరూపుడవైన ఓ హయగ్రీవా! ప్రళయే =ప్రళయ కాలమునందు, ఇదమ్=ఈ, సర్వమ్=సమస్తమైన జగత్తును, స్వాన్త ర్జఠరమ్=నీ పొట్టలోపలి భాగము నందు, ఉపసంహృత్య=ఉపసంహారము చేసి (లయము చేసి), క్షీరోదే=పాలసముద్రమునందు, భుజగే=ఆదిశేషునియందు, శయానః=పడుకొనియున్నవాడవై, శ్రీసహచరః= లక్ష్మీదేవితో కూడుకొనిన వాడ వైనప్పటికిని, నిజసుఖమ్=ఆత్మానుభవ సుఖమును, అయన్=పొందుచూ, పునః కాలే= మరల సృష్టికాలమునందు, నాభీజలరుహతలోత్పాదితవిధిః= నాభి అనెడు పద్మము నందు బ్రహ్మదేవుని పుట్టించిన వాడవు అగుచు, ఏతత్=ఈ జగత్తును,



సృజసి= సృష్టించుచున్నావు. ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్= హయగ్రీవుని (అహమ్=నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :–** ఓ హయగ్రీవా! నీవు పరబ్రహ్మ స్వరూపుడవు. నీవు ప్రళయకాలము నందు సమస్త ప్రపంచమును నీ పొట్టలో లయము చేసి పాలసముద్రమునందు ఆదిశేషునిపై పడుకొనియుండెదవు. అప్పుడు లక్ష్మీదేవి నీకు తోడుగా నున్నప్పటికి పామరులవలె కామినీ సౌఖ్యము నాశించక ఆత్మానన్దానుభవ సుఖమును మాత్రమే పొందుచుండెదవు. మరల సృష్టికాలమునందు నీ నాభియందలి కమలము నుండి బ్రహ్మను పుట్టించి ఆ బ్రహ్మద్వారా ఈ జగత్తును సృష్టించెదవు. ఈ విధముగా సృష్టిస్థితిలయములకు నీవే కర్తవు. అట్టినిన్ను నేను శరణుపొందుచున్నాను.

**– మహాప్రళయ వర్ణన (74,75) –**

**శ్లో॥ మహాకల్పే సర్వం జగదపి సపాలం సవిధికం**
**సశేషం సాబ్నాథం సతనుగురుభూతం సదభిభూః।**
**స్వలోకే సంహృత్య ప్రతతతమసః పశ్యతి భవాన్**
**పరం పారాత్మానం హయవదన మిన్దుస్థిత మయే॥ 74**

**ప్రతిపదార్థము :–** హే అభిభూః!=సర్వవ్యాపకుడవైన ఓ హయగ్రీవా! మహాకల్పే =మహా ప్రళయకాలమునందు, సపాలమ్=లోకపాలురతో కూడుకొనినదియును, సవిధికమ్=బ్రహ్మదేవునితో కూడుకొనినదియును, సశేషమ్=ఆదిశేషునితో కూడుకొని యున్నదియును, సాబ్నాథమ్=సముద్రముతో కూడుకొనినదియును, సతనుగురు భూతమ్=సూక్ష్మస్థూల భూతలములతో కూడినదియును అగు, సత్=ఉన్నటువంటి సమస్తమైన జగత్తును, స్వలోకే=పరబ్రహ్మయందు, సంహృత్య=ఉపసంహరించి, ప్రతతతమసః=అపుడు ఉండు గంభీరమగు అజ్ఞానమునకు, పారాత్మానమ్=ఆవలి ఒడ్డుయును, పరమ్=పరమాత్మయును అగు తనను, భవాన్=నీవు, పశ్యతి=చూచు చుండెదవు. ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము :–** మహాప్రళయమునందు దిక్పాలకులతో, బ్రహ్మదేవునితోను, ఆదిశేషునితోను, సముద్రములతోను, స్థూల సూక్ష్మభూతములతోను కూడ మొత్తము జగత్తునంతను పరబ్రహ్మ ఐన తనయందు లయము చేసి గంభీరమగు అజ్ఞానము

అనెడి అంధకారమునకు ఆవలి ఒడ్డువంటి నీ పరమాత్మ స్వరూపమును నీవు చూచుచుండెదవు.

**విశేషములు :–** ప్రళయము రెండు విధములు. (1) నైమిత్తిక ప్రళయము (2) మహా ప్రళయము. జగత్తు విష్ణువు ఉదరము నందు లయమగును, అప్పుడు సముద్రుడు, ఆదిశేషువు, దిక్పాలకులు, సూక్ష్మభూతములు ఉండును, అవి నైమిత్తిక ప్రళయమున నశించవు. నైమిత్తిక ప్రళయము తర్వాత మరల సృష్టి వుండును. మహాప్రళయమున సముద్రములు, ఆదిశేషువు, దిక్పాలకులు, సూక్ష్మభూతములు కూడా జగత్తుతో పాటు లయమగును. ఇవి అన్నియును విష్ణువు నందు లయము చెందును. మహా ప్రళయము తర్వాత జగత్తు వుండదు. మహా ప్రళయము నందు పరమాత్మ తప్ప ఎవ్వరును ఉండరు.

**శ్లో॥ తదేదం సర్వం త్వత్ప్రకృతి పరిలీనం త దముతః**
**శ్రుతి ర్బ్రూతేఽ సత్త్వమ్ పదగుణ విభాగాత్యవిషయమ్।**
**విలీ నా శక్తి స్సా త్వయి నహి పృథక్ త్వత్ శ్రుతినుతో**
**భవా నేక స్సన్ త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 75**

**ప్రతిపదార్థము :–** తదా=ఆ మహా ప్రళయమునందు, సర్వమ్=సమస్త ప్రపంచము, పదగుణ విభాగాత్యవిషయమ్=నామరూప విభాగము లేనిదగుచు, త్వత్ప్రకృతి పరిలీనమ్= నీ మాయాశక్తియందు దాగినది, తత్=అందువలన, అముతః= ఈ జగత్తునకు, అసత్త్వమ్=అభావమును, శ్రుతిః=వేదము, బ్రూతే=చెప్పుచున్నది, సా=నీ మాయాశక్తి, త్వయి=నీయందు, విలీనా హి=లయము చెందినది గదా! సా=ఆ శక్తి, త్వత్=నీకంటే, న పృథక్=వేరు కాదు. (తస్మాత్=అందువలన), శ్రుతినుతః = వేదములచే స్తోత్రము చేయబడిన, ఏకః=ఒకే ఒక, సన్=సత్ పదవాచ్యుడవు, భవాన్=నీవే, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలము నందున్న, హయవదనమ్=అశ్వముఖుడ వైన, త్వామ్=నిన్ను (అహమ్=నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :– మహా ప్రళయమునందు ఈ సమస్తమైన జగత్తు నామరూప విభాగము లేక విత్తనమునందు చెట్టువలె అతిసూక్ష్మావస్థను పొందుచూ హయగ్రీవుని మాయాశక్తియందు లయము చెందినది. అందువలననే 'అసదేవేద మగ్ర ఆసీత్' అను శ్రుతి వాక్యము జగత్తు పూర్తిగా లేనిదేనని చెప్పుచున్నది. జగత్తు స్వకారణమగు



మాయారూపమున నున్నను నామ రూపములు లేకపోవుటచే లేనిదానితో సమానమగుచున్నది అని ఆ వాక్యమునకు భావము. అంతేగాని జగత్తు అసలే లేదని కాదు. అట్టి మాయ నీయందు లీనమైనది. అది నీకంటే వేరు అని చెప్పుటకు వీలు లేదు. ఎందువలననగా మాయ బ్రహ్మయొక్క శక్తి. శక్తికిని, శక్తికలవానికిని భేదము లేదు అని అద్వైత వేదాంతమతము. ఎందువలన అనగా ఆ రెండును వేరువేరుగా మనకు ప్రత్యక్షమగుట లేదు. నీవు ఒక్కడవే మహా ప్రళయము నందు సైతము వున్నవాడవు కాన, నీకంటే వేరుగా మరొకరు లేనందున నీవు ఒక్కడవే సత్ పదవాచ్యుడవు. అందువలననే నీవు పరబ్రహ్మవు అగుచున్నావు. అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**– సుషుప్తి వర్ణన –**

**శ్లో॥ లయే నిత్యే జీవ స్సకల ముపసంహృత్య కరణం**
**నిజాజ్ఞాన ద్వారా త్వయి వసతి నిత్యం స తు పునః।**
**న వేత్తీదం సర్వం హ్యనుభవతి మోదం హ్యనుమితమ్**
**ప్రబుద్ధ స్మృత్యేదం హయవదన మిన్దుస్థిత మయే॥ 76**

**ప్రతిపదార్థము :–** జీవః =జీవుడు, నిత్యే లయే=నిత్యము జరుగు లయమునందు (గాఢ నిద్రయందు) సకలమ్=సమస్తమగు, కరణమ్=ఇంద్రియములను, మనస్సును, ఉపసంహృత్య=లయము చేసి, నిజాజ్ఞాన ద్వారా=తన అజ్ఞానము ద్వారా, త్వయి= పరబ్రహ్మస్వరూపమైన నీయందు, నిత్యమ్=ప్రతిరోజు, వసతి=నివసించుచున్నాడు. స తు పునః= ఆ జీవుడు మాత్రము, ఇదం సర్వమ్=ఈ సమస్త ప్రపంచమును, (తదానీమ్=ఆ గాఢ నిద్రయందు) న వేత్తి=ఎఱుంగుట లేదు. హి=లేదా, మోదమ్ =సంతోషమును, అనుభవతి=అనుభవించుచున్నాడు, ఇదమ్=ఈ విషయము, ప్రబుద్ధస్మృత్యా= నిదురనుంచి మేల్కొనిన వాని స్మృతితో, అనుమితమ్=ఊహింప బడినది. ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్ =నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :– జీవునకు ప్రతిరోజు సంభవించు గాఢమైన నిద్ర కూడా ఒక ప్రళయము వంటిదే. మనకు ఈ ప్రళయము ప్రతిరోజు సంభవించుటచే దీనిని నిత్యప్రళయము అని అందురు. ఈ నిత్య ప్రళయమునందు మనస్సును, ఇంద్రియములను అజ్ఞానమునందు లయము చేసి ఆ అజ్ఞానము ద్వారా నీయందు

నివసించుచున్నాడు. అందువలన ఈ జగత్తు ఏదియును జీవునకు అప్పుడు భాసించుటలేదు. జగత్తు భాసించకపోయినను సుఖమును అనుభవించుచున్నాడు. ఎట్లనగా గాఢ నిదుర నుండి మేల్కొనినవాడు "సుఖముగా నిదురించితిని, ఏమియును నాకు తెలియ లేదు" అని స్మరించుచున్నాడు. ఆ స్మరణముచే గాఢ నిదుర యందు సుఖమును అనుభవించినట్లుగా తెలియుచున్నది. అట్టి హయగ్రీవుని నేను శరణుపొందుచున్నాను.

**విశేషములు** :- ఈ ప్రపంచమంతయును త్రాడుయందు పాము భాసించినట్లు పరబ్రహ్మయందు భాసించుచున్నది. దీనినే సృష్టి అని అనుచున్నాము. త్రాడు యందు పాము భాసించుటకు కారణము అజ్ఞానము. త్రాడును తెలిసికొనినప్పుడు పాము భాసించుట లేదు. అనగా త్రాడుయందు అజ్ఞానముచే పాము పుట్టుచున్నది. జ్ఞానముచే పాము త్రాడుయందు లయమగుచున్నది. ఈ విధముగా పుట్టుక అంతయు అజ్ఞానము చేతనే సంభవించును. లయము అంతయు జ్ఞానముచే సంభవించును.

అట్లే పరబ్రహ్మ యందు అజ్ఞానము చేత జగత్తు పుట్టుచున్నది. జ్ఞానము చేత లయమగుచున్నది. అయితే పరబ్రహ్మయందు ఈ జగత్తు నేరుగా పుట్టలేదు. జగత్తు పుట్టు క్రమమెద్ది యనగా- పరబ్రహ్మయందు మొదట అజ్ఞానము పుట్టినది. ఆ అజ్ఞానమునందు అహంకారము పుట్టినది. అహంకారము యందు మనస్సు పుట్టినది. మనస్సు నందు ఇంద్రియములు పుట్టినవి. ఇంద్రియముల యందు దేహము పుట్టినది. ఆ దేహమునందు ప్రపంచము పుట్టినది. అందువలననే పుట్టుకకు వ్యతిరేక దిశలో లయము జరుగును. గాఢ నిద్ర పుట్టు విధానమును పరిశీలింపుడు. ముందుగా ప్రపంచము దేహమునందు లయమగుచున్నది. అనగా బాహ్య ప్రపంచము భాసించుట లేదు. బాహ్య ప్రపంచము భాసించువానికి నిదుర ఎట్టు సంభవించును? తరువాత ఆ దేహము ఇంద్రియములందు లయమగును. ఇంద్రియములు మనస్సునందు, మనస్సు అహంకారము నందు, అహంకారము అజ్ఞానమునందు లయమగును. అప్పుడు దానినే మనము గాఢ నిద్ర అని అనుచున్నాము. ఆ అజ్ఞానము పరబ్రహ్మ యందు లయమగుటచే మోక్షము లేక మహాప్రళయము అని అందురు. పరబ్రహ్మ గొప్ప ఆనంద స్వరూపమైనది. గాఢ



నిదురయందు అజ్ఞానము ద్వారా జీవుడు పరబ్రహ్మయొక్క ఆనందమును అనుభవించును. కాని అజ్ఞానము ఉండుటచే అప్పుడు తెలిసికొనలేకపోవుచున్నాడు. కాన గాఢనిద్ర యందు జీవుడు అజ్ఞానమును, ఆనందమును రెంటిని అనుభవించు చున్నాడు. అందువలననే నిదుర నుండి మేల్కొనినవాడు "సుఖముగా నిదురించితిని, నాకు ఏమియును తెలియదు" అని అజ్ఞాన సుఖములను స్మరించుచున్నాడు. మోక్షమునందు అజ్ఞానము కూడా లయమగుటచే కేవలము సుఖమునే అనుభవించును. అదియే పరబ్రహ్మ పరమ పురుషార్థము.

**- పరబ్రహ్మ వర్ణన (77-90) -**

**శ్లో॥ అవిద్యాస్మాస్వేత జ్జగ దభివిధత్తే ప్రతినిశం**
**యథాదృష్టం పశ్చా ల్లయ మయతి బోధే స్వత ఇదమ్।**
**తథా మాయా త్వయ్యప్యఖిల మిద మాధత్త ఇవ నః**
**ప్రభో! భాతి శ్రీమన్! హయవదన మిన్దుస్థిత మయే॥ 77**

**ప్రతిపదార్థము :-** ప్రభో!= ఓ ప్రభూ! శ్రీమన్=నిత్యబుద్ధ స్వరూపా! ఓ హయగ్రీవా! ప్రతినిశమ్= ప్రతిరాత్రియందును, అవిద్యా=అజ్ఞానము, అస్మాసు=మాయందు, ఏతత్ జగత్= ఈ స్వప్న ప్రపంచమును, యథా+అదృష్టమ్= మా అదృష్టము ననుసరించి(ఈ శ్లోకమునందలి అదృష్టపదమునకు 'మేల్కొనినప్పుడు మనము చేసిన పనులకు సంబంధించిన సంస్కారము' అని అర్థము. ఈ సంస్కారము మన ఆత్మయందు మనకు కనబడకుండా ఉండుటచే అదృష్టము అని చెప్పబడు చున్నది. దానిని అనుసరించి స్వప్నములు వచ్చుచుండును) అభివిధత్తే=సృజించునో, బోధే=ప్రబోధ దశయందు (మేల్కొనినపుడు), ఇదమ్=ఈ స్వప్న ప్రపంచము, స్వతః =తానంతట తానుగానే, లయమ్=నాశనమును, అయతి=పొందునో, తథా= ఆ విధముగా, మాయా=మాయ, త్వయి అపి=నీయందు కూడా, అఖిలమ్= సమస్త మగు, ఇదమ్= మేల్కొనినప్పుడు మనకు కనిపించు ఈ ప్రపంచమును, ఆధత్తే ఇవ= సృష్టించు చున్నదానివలె, నః=మాకు, భాతి=భాసించుచున్నది. ఇన్దుస్థితమ్ =చన్ద్రునియందు వున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము :-** ప్రతిరోజు మనము లోకమునందు అనేక వస్తువులను చూచెదము.

అనేక పనులను చేసెదము. వీటివలన ఒక సంస్కారము ఏర్పడును. మన ఆత్మయందు కనబడకయుండును. మనము రాత్రి వేళలందు నిద్రించినపుడు అజ్ఞానము మన పాత సంస్కారములను అనుసరించి మనయందు కొత్తకొత్త ప్రపంచములను సృష్టించుచుండును. వానినే మనము స్వప్నములు అనుచున్నాము. మనకు మెలకువ వచ్చినంతటనే ఆ స్వప్న ప్రపంచములు నశించుచున్నవి. అట్లే ఓ హయగ్రీవా! మాయకూడా నీయందు మేము మెలకువ దశలో చూచుచున్న ఈ ప్రపంచమును సృష్టించుచున్నది అని మాకు భాసించుచున్నది. చన్ద్రమణ్డలము నందు నివసించు హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ యథా మాయా రజ్జౌ సృజతి తవ సర్పం నరహరే!**
**ప్రసిద్ధం తేనాయం వ్యవహరతి మూఢస్తు విబుధః।**
**స్మయం స్తూష్ణీమాస్తే జగ దపి తథా త్వయ్యవిబుధో**
**విచష్టే జ్ఞో నైవం హయవదన మిన్దుస్థిత మయే॥ 78**

**ప్రతిపదార్థము :-** హే నరహరే!=ఓ హయగ్రీవా! యథా=ఎట్లైతే, తవ=నీకు సంబంధించిన, మాయా=అజ్ఞానము అను పేరుకల శక్తి, రజ్జౌ=త్రాడు యందు, సర్పమ్=పామును, సృజతి=సృష్టించునో (ఇతి ఇదం=అను ఈ విషయము) ప్రసిద్ధమ్= అందరకు అనుభవగోచరమైనది, అయమ్=ఈ, మూఢః=అవివేకి, తేన= ఆ సర్పముతో, వ్యవహరతి=వ్యవహరించుచున్నాడు (అనగా భయపడుట, ఏడ్చుట, కొట్టుట మొదలగు వ్యవహారములు చేయుచున్నాడు) విబుధః= ఇది త్రాడు, సర్పము కాదు అని తెలిసిన వివేకి మాత్రము, స్మయన్= భ్రాంతులను చూసి నవ్వుచూ, తూష్ణీమ్=ఊరకనే (భ్రమపడుట, ఏడ్చుట, కొట్టుట మొదలగు వ్యవహారములు చేయక) ఆస్తే=ఉన్నాడు. తథా=అట్లే, అవిబుధః=పండితుడు కానివాడు (నీయొక్క యథార్థ స్వరూపమును ఎఱుంగనివాడు) త్వయి=నీయందు, జగత్=లోకమును, విచష్టే=చూచుచున్నాడు, జ్ఞః=తెలిసిన వాడు (నీయొక్క స్వరూపమును తెలిసినవాడు) ఏవమ్=ఈ విధముగా, న విచష్టే=జగత్తును చూచుట లేదు. ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు కల, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను) అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము :-** ఓ హయగ్రీవా! నీ మాయ అనెడి శక్తి త్రాడునందు పామును



సృజించుచున్నది. అట్టి పామును చూసి దాని అసలుస్వరూపము త్రాడేనని తెలియని మూర్ఖులు దానినుండి భయపడుచూ, అది కాటు వేసినదని ఏడ్చుచూ, దానిని కొట్టుచూ దుఃఖించుచున్నారు. అది పాము కాదనియు, త్రాడేననియు తెలిసినవాడు మాత్రము ఆ దుఃఖించుచున్న వారిని చూసి నవ్వుచూ తాను మాత్రము నిశ్చలముగా వున్నాడు. అట్లే నీ స్వరూపమును తెలియని మూఢులకు మాత్రమే నీయందు జగత్తు కనిపించును. వారికి మాత్రమే ఆ జగత్తు వలన దుఃఖములు సంభవించును. నీ స్వరూపమును తెలిసికొనిన పండితులకు మాత్రము జగత్తు భాసించదు. కావున వారికి ఆ జగత్తు వలన సంభవించు దుఃఖములు ఉండవు. పరమానంద సాగరమగ్నులగుదురు. అట్టి హయగ్రీవుని నేను శరణు పొందు చున్నాను.

**శ్లో॥ హరే! మాయాకార్యం సదసదవిభావ్యం జగ దిదం**
**త్వమే వాస్మాత్ప్రాక్త్వం భవసి విలయేఽపీతి గదితమ్।**
**న తేఽచిత్సంసర్గో నిజరుచి విధూతాఖిలమల!**
**ప్రభో! సర్వాత్మం స్త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 79**

**ప్రతిపదార్థము :-** హే హరే!=ఓ హయగ్రీవా!, సదసదవిభావ్యమ్=సత్ అనిగాని అసత్ అనిగాని చెప్పుటకు వీలుకాని, ఇదమ్=ఈ, జగత్=ప్రపంచము, మాయా కార్యమ్=మాయ నుండి పుట్టినది, అస్మాత్=ఈ జగత్తుకంటే, ప్రాక్=ముందును, విలయేపి=జగత్తు నశించిన తరువాత కూడా, త్వమేవ=నీవే వున్నావు (అతః= అందువలన) ఇదం జగత్=ఈ ప్రపంచము, త్వమేవ=నీవే, ఇతి=అని, గదితమ్= వేదములచే చెప్పబడినది, నిజరుచి విధూతాఖిల మల!=నీ ప్రకాశము చేతనే సమస్త మాలిన్యములను తొలగించిన వాడా!, సర్వాత్మన్!=సర్వులకు ఆత్మ స్వరూప మైనవాడా!,ప్రభో=ఓ ప్రభూ,తే=నీకు,అచిత్సంసర్గః=జడపదార్థములతో సంబంధము, న=లేదు, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్= అశ్వముఖుడవైన, త్వామ్=నిన్ను (అహమ్=నేను) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము** :- ఓ హయగ్రీవా! ఈ జగత్తు సత్ అని కాని అసత్ అనికాని చెప్పుటకు వీలు కాకున్నది. ఎందువలన అనగా జగత్ సత్ అయిన ఎడల ఎప్పుడును నశించక, బ్రహ్మవలె నిత్యముగా ఉండవలసివచ్చును. ప్రళయ కాలము నందు జగత్తు నశించుటచే ఈ జగత్తు బ్రహ్మవలె సత్ కాదు. శశ శృంగము వలె అసత్

కూడా కాదు. అసత్ పదార్థము ఎప్పుడును ఇంద్రియములకు గోచరము కాదు. ప్రపంచము ఇంద్రియ గోచరమగుటచే ఇది అసత్ కూడా కాదు. కాన ఈ ప్రపంచము మిథ్య. అందువలననే ఇది మాయ వలన పుట్టినది అని చెప్పవచ్చును. మాయ మిథ్య కావున దానినుండి పుట్టినది కూడా మిథ్యయే అగును కదా! మాయామయమగు ఈ జగత్తు యొక్క అసలు స్వరూపము నీవే. అనగా సత్ పదార్థమే. ఎట్లనగా ఈ ప్రపంచము తాను పుట్టుటకు ముందు, తరువాత కూడా నీ స్వరూపమున ఉండుటచే మధ్య కాలమగు సృష్టి సమయమున కూడా నీ స్వరూపములోనే ఉండును. ఈ విధముగ సత్ పదార్థము ఐన నీయందు మిథ్యా రూపమగు అచిత్ పదార్థము భాసించుచున్నప్పటికి నీకు అచిత్ పదార్థములతో సంబంధముకాని దానివలన వచ్చు దుఃఖములు కాని ఉండవు. ఎండమావుల నీటితో ఎడారి ప్రదేశము తడవదు కదా! అట్టి పరమాత్మ స్వరూపుడవు అగు నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు** :-

I. అద్వైత మతమున పదార్థములు మూడు విధములు. 1. సత్. 2. అసత్ 3. మిథ్యా.

1. సత్ : పరబ్రహ్మ ఒక్కటే సత్ పదార్థము. భూత భవిష్యత్ వర్తమాన కాలములయందు ఎట్టి మార్పు లేక నిత్యముగా ఉండునది.

2. అసత్ : శశశృంగము అనగా కుందేటి కొమ్ము వంటిది. అసలే లేనిది ఎప్పుడును కనిపించనిది.

3. మిథ్యా : మాయ, మాయ వలన పుట్టిన ప్రపంచము, దీనిలో చేరును. త్రాడుయందు కనిపించు పాము వంటిది. బ్రహ్మవలె త్రికాలాబాధ్యము కాదు. కాన సత్ పదార్థము కాదు. ఇది కూడా లేని పదార్థము అయినప్పటికి కుందేటి కొమ్ము వలె కాక కంటికి కనిపించుచుండును. అందువలన ఇది అసత్ పదార్థము కూడా కాదు. అందువలన దీనిని మిథ్యా పదార్థము అనిరి.

II. ఏదైనా వస్తువు తాను పుట్టటానికి ముందు ఏ రూపములోనున్నదో, తాను నశించిన తర్వాత కూడా అదే రూపముననున్నచో తాను ఉన్న కాలములో కూడా అదేనని సిద్ధాంతము. ఉదాహరణకు కుండ తను పుట్టుటకు ముందు మట్టి



రూపములో నుండును. కుండ నశించిన తరువాత కూడా మట్టి రూపములో నుండును. కాన కుండగా ఉన్నప్పుడు కూడా అది మట్టియే. ఆ విధముగానే ప్రపంచమంతయును పుట్టుటకు ముందు హయగ్రీవుని స్వరూపములో అనగా సత్ స్వరూపములో వుండును. ప్రళయకాలమునందు ప్రపంచము నశించినపుడు సత్ స్వరూపములోనుండును. అందువలన మధ్యలో నున్న సృష్టికాలమునందు కూడా ప్రపంచము సత్ స్వరూపమే అని అద్వైత సిద్ధాంతము.

**శ్లో॥ భవా నన్తర్యామీ సకల మిద మన్త ర్యమయతి**
**స్వయం దీప్యన్ తచ్చేశ్వర! భవతి మిథ్యా బృహ దితి।**
**అయస్కాన్తాత్ త్వత్తో జగ దిద మయోవ ద్వ్యవహృతిం**
**ధ్రువం ప్రాప్నోతి త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 80**

**ప్రతిపదార్థము :-** హే ఈశ్వర!=ఓ ప్రభూ! హయగ్రీవా!, భవాన్=నీవు, స్వయమ్=స్వయముగానే, దీప్యన్=ప్రకాశించుచూ, ఇదమ్=ఈ, సకలమ్=హృదయము మొదలుగా కల జడవస్తు సమూహమును, అన్తః=వాటి లోపల ఉండుచూ, యమయతి= నియమించుచున్నావు, ధ్రువమ్=నిశ్చయముగా, అయస్కాంతాత్=అయస్కాంతము వలన, అయోవత్=ఇనుము వలె, ఇదం జగత్=ఈ ప్రపంచము, త్వత్తః=నీవలన, వ్యవహృతిమ్=దర్శనము, శ్రవణము మొదలగు వ్యవహారమును, ప్రాప్నోతి=పొందుచున్నావు, (అతః=అందువలన, భవాన్=నీవు), అన్తర్యామీ=అన్తర్యామి అని చెప్పబడుచున్నావు, తత్ చ=నీలోని ఆ అన్తర్యామిత్వము కూడ, మిథ్యా=నీ యందులేని ధర్మమే! బృహత్ ఇతి తు=బ్రహ్మవు, భవతి=అగుచున్నావు, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:-** ఓ హయగ్రీవా! నీవు హృదయము మొదలుగా కల సమస్త జడ పదార్థముల లోపల ఉండి వాటి నన్నింటిని నియమించుట చేతనే నీకు అన్తర్యామి అను పేరు వచ్చినది. నీ లోపల ఉండి నిన్ను నియమించు వారలు మాత్రము ఎవ్వరును లేరు. నీకు నీవే ఇతరుల సహాయము లేక స్వయముగా ప్రకాశించెదవు. సకల పదార్థముల లోపల ఉండి వాటిని నీవు నియమించుట రాజు సేవకులను నియమించినట్లు కాదు. అట్లైన నీయందు ప్రేరకత్వ ధర్మము ఉండవలసి వచ్చును. నిర్విశేష పరబ్రహ్మస్వరూపమైన నీయందు ఆ ధర్మమును లేదు. కేవలము

అయస్కాన్తము యొక్క సమీపమునందు అయస్కాంతపు ప్రేరణ లేకయే ఇనుము కదలుచున్నట్లుగా నీ సమీపమునందు నీ ప్రేరణ లేకయే జగత్తు చూచుట, వినుట మొదలగు వ్యవహారములను చేయుచున్నది. అంతమాత్రముననే నిన్ను అంతర్యామి అని అనుచున్నారు. నీయందు ఆ అంతర్యామిత్వము కూడ త్రాడునందు కనపడు పామువలె మిథ్యయే. ఎందులననగా హృదయము మొదలగు జడ పదార్థములు నిజముగా ఉన్నటువంటివి అయిన వాటికి అంతర్యామిగా నీవు ఉండుట యథార్థము అగును. హృదయాది జడపదార్థములే మిథ్యయగుటచే నీ అంతర్యామిత్వము కూడ మిథ్యయే అగును. అప్పుడు నీ వాస్తవస్వరూపము బ్రహ్మ అగును. చన్ద్రమండలమునందున్న అట్టి హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ బృహ త్త్వం సచ్ఛక్తి ప్రతిఫలిత చిత్త్వీశ్వర ఇతి**
**హ్యవస్థా భేదేన ప్రథమ ముపగీత శ్శ్రుతిగణైః।**
**త దాత్మా త త్కార్య ప్రతిఫలిత చిజ్జీవ ఇతి చ**
**త్వ దంశ స్త్వాం భూమన్! హయవదన మిన్దుస్థిత మయే॥ 81**

**ప్రతిపదార్థము:–** భూమన్=గొప్ప స్వరూపము గల ఓ హయగ్రీవా!, త్వమ్=నీవు, బృహత్=బ్రహ్మవు, సచ్ఛక్తి ....... చిత్ తు – సత్=బ్రహ్మయొక్క, శక్తి=శక్తియగు మాయయందు, ప్రతిఫలిత=ప్రతిబింబించిన, చిత్ తు=చైతన్యము, ఈశ్వరః=ఈశ్వరుడు, ఇతి చ=అనియు, అవస్థాభేదేన=బింబదశ, ప్రతిబింబదశ అను రెండు దశలచే, ప్రథమమ్=మొదట (సృష్టికి ముందుగ ఉండు ప్రళయమునందు), శ్రుతిగణైః =వేదములచే, ఉపగీతః=చెప్పబడితివి, తత్=తదనన్తరము, త్వమ్=నీవు, ఆత్మా ఇతి=ఆత్మ అనియు, తత్కార్య ప్రతిఫలితచిత్ – తత్కార్య=నీ శక్తియగు మాయ నుండి పుట్టిన అన్తఃకరణమునందు, ప్రతిఫలిత=ప్రతిఫలించిన, చిత్=చైతన్యము, త్వదంశః=నీ అంశము అగు, జీవః ఇతి చ=జీవుడు అనియు, శ్రుతిగణైః=వేద సమూహముల చేత, ఉపగీతః=చెప్పబడితివి, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్= హయగ్రీవుడవైన, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము:–**ఓ హయగ్రీవా! ఈ జగత్తు పుట్టుటకు ముందు ఉండు మహాప్రళయము నందు పరమార్థదశయందు నీవు పరబ్రహ్మగా నున్నావు. ఆ మహాప్రళయపు



చివరికాలములో మాయతోకూడుకొనియున్నవాడవై (మాయ యందు ప్రతిఫలించిన వాడవై) ఈశ్వరుడుగా నున్నావు. అటు పిమ్మట సృష్టి కాలమునందు మాయనుండి పుట్టిన అన్తఃకరణము అను ఉపాధి సంబంధముతో ఆత్మ అని పిలువబడుచున్నావు. ఆ "అన్తఃకరణమే నేను" అనెడి తాదాత్మ్యాధ్యాసతో నీవు జీవుడు అని చెప్పబడు చున్నావు. ఈ విషయము వేదములన్నింటియందును చెప్పబడినది. అందువలన పరబ్రహ్మ, ఈశ్వరుడు, ఆత్మ, జీవుడు అని వేరువేరుగా పిలువబడు చున్నను వాస్తవమునకు వారందరును నీ స్వరూపమే కదా! నీ కంటె భిన్నమగువస్తువు లోకమునందు ఏమి కలదు? ఈ విధముగ సర్వస్వరూపుడవైన నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ త్వ మీశ స్స్వాయత్త ప్రకృతి గుణ తత్కార్య నివహ**
**స్సదాస్పృష్టాజ్ఞాన స్సకలగుణమూర్తి స్సుఖమయః।**
**వయం జీవా స్సర్వే ప్రకృతి పరతన్త్రాశుభధియః**
**త్వయైతే సంరక్ష్యా హయవదన మిన్దుస్థిత మయే॥ 82**

**ప్రతిపదార్థము:–** అయే!=ఓ హయగ్రీవా!, స్వాయత్త....నివహః– స్వాయత్త= స్వాధీనము చేసికొనబడిన, ప్రకృతి గుణ=ప్రకృతి యొక్క గుణములు (లేదా) ప్రకృతి అనబడు గుణము, తత్కార్యనివహః=అన్తఃకరణము మొదలుగా కల ప్రకృతి కార్య సమూహము కలవాడను, సదా=ఎల్లప్పుడు, అస్పృష్టాజ్ఞానః=అజ్ఞానము అంటని వాడవును, సకలగుణమూర్తిః=సర్వజ్ఞత్వము మొదలుగా కల సమస్త సద్గుణములు కలవాడవును, సుఖమయః=ఆనన్దస్వరూపుడవును అగు, త్వమ్=నీవు, ఈశః =ఈశ్వరుడవు, ప్రకృతి పరతన్త్రాశుభధియః=మాయ యొక్క అధీనములోనున్న వారమును, అజ్ఞానులమును అగు, వయమ్=మేము, జీవాః=జీవులము, (తస్మాత్= అందువలన), ఏతే=ఈ జీవులు, త్వయా=నీచేత, సంరక్ష్యాః=రక్షింపదగిన వారు, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్= హయగ్రీవుని, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీవు మాయ అను ఉపాధియందు ప్రతిఫలించిన ఈశ్వరుడవు. మాయనుండి పుట్టిన అన్తఃకరణమునందు ప్రతిఫలించిన జీవులము మేము. మాయ, అన్తఃకరణము ఈ రెండు ఉపాధులు మిథ్యయే! కాన ఈశ్వరుడవు

అగు నీకును జీవులము అగు మాకును భేదము లేదు. అయినను నీవు నీ ఉపాధియగు మాయను దాని కార్యములగు అన్తఃకరణాదులను, వాటియందు ప్రతిఫలించిన జీవులను వీటన్నింటిని నీ అధీనములో నుంచుకొంటివి. కాని జీవులమగు మేము మాయ అధీనములో నున్నాము. మాకు స్వాతన్త్ర్యము లేదు. మరియు నీ ఉపాధియగు మాయ శుద్ధమైనది అగుటచే నీకు అజ్ఞానము లేదు. (అనాత్మ వస్తువులయందు ఆత్మ అనెడి భ్రాన్తియే అజ్ఞానము. అది ఈశ్వరునకు లేదు) అందువలననే నీ యందు సర్వజ్ఞత్వము మొదలుగా కల సద్గుణములు కలవు. కనుకనే నీవు ఆనన్దస్వరూపుడవు. మరి మేమో! మా ఉపాధియగు అన్తః కరణము మలినము. అందుచే మేము అపవిత్రమగు జ్ఞానము కలవారము (అనాత్మ వస్తువులయందు ఆత్మ అనెడి భ్రాన్తి కలవారము) అందువలన మేము దుఃఖ స్వరూపులము. కనుకనే ఈ జీవులందరును నీచేత రక్షించదగినవారు. అందువలననే చన్ద్రమణ్డలమునందున్న నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–** వాస్తవమునకు జీవుడు, ఈశ్వరుడు ఉభయులు మిథ్యయే! ఏలయన మాయయందు ప్రతిఫలించినవాడు ఈశ్వరుడు, మాయాకార్యమగు అన్తఃకరణము నందు ప్రతిఫలించినవాడు జీవుడు. మాయ, అన్తఃకరణము ఈ రెండు ఉపాధులు మిథ్య కావున వాటియందు ప్రతిఫలించిన వారు కూడ మిథ్యయే! కేవలము నిర్గుణ పరబ్రహ్మయే సత్యము. మరియొక రకముగ పరిశీలించినను జీవేశ్వరులు ఉభయులు మిథ్యయేనని తేలును. ఎట్లనగా పరబ్రహ్మకు వేదాన్తులు ఐదు కోశములను చెప్పిరి. అన్నమయ కోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము, ఆనన్దమయ కోశము. ఇందు అన్నమయ కోశము లోపల ప్రాణమయ కోశము, దాని లోపల మనోమయ కోశము, దాని లోపల విజ్ఞానమయ కోశము, దాని లోపల ఆనన్దమయ కోశము ఉండును. ఆనన్దమయ కోశములో పరబ్రహ్మ ఉండును. ఈ కోశములన్నియు మిథ్యయే! వానిలోపల నుండు పరబ్రహ్మ మాత్రమే సత్యము. ఇందు విజ్ఞానమయ కోశమును జీవుడు అనియు, ఆనన్దమయ కోశమును ఈశ్వరుడు అనియు వేదాన్తులు చెప్పెదరు. కాన జీవేశ్వరులు ఉభయులు మిథ్యయే!

ఇట్లైన మిథ్యాభూతుడగు ఈశ్వరుని సేవించుట వలన ఏమి ప్రయోజనము అని ప్రశ్న ఉదయించును. జీవుడును మిథ్యయే కావునను, ఆ జీవుని సంసారము



మిథ్య కావునను, జీవుని సంసార దుఃఖమును మిథ్యాభూతుడగు ఈశ్వరుడే పోగొట్టగలడు. యథార్థమగు పరబ్రహ్మ జీవుని సంసారమును పోగొట్టి మోక్షమును ఈయజాలడు. స్వప్నములో ఒక సర్పము మనలను కరచి బాధించినప్పుడు స్వప్నములోని వైద్యుడే ఔషధమునిచ్చి మన బాధను పోగొట్టగలడు కాని మనము నిద్రించు మంచము ప్రక్కనేయున్న యథార్థమగు వైద్యుడు మన బాధను పోగొట్టలేడు గదా! కనుక మిథ్యాభూతుడగు ఈశ్వరుని కటాక్షమువలన మిథ్యాభూతుడగు జీవునకు మిథ్యాభూతమగు సంసార దుఃఖమునుండి మిథ్యా భూతమగు మోక్షము లభించును. **కాన జీవులు ఈశ్వరుని సేవించుట ఆవశ్యకము.**

**శ్లో॥ ఉపాధీనాం భేదా ద్వయ మిహ భవామోఽజ! బహవః**
**త్వ మేకో మాయైక్యా ద్భవసి పరమవ్యోమనిలయే।**
**యథైవేన్ద్రాద్యా స్త్వం నిరుపహత యోగ ప్రకృతితోఽ**
**యసే మూర్త్యానన్త్యం హయవదన మిన్దుస్థిత మయే॥ 83**

**ప్రతిపదార్థము:–** హే అజ!=పుట్టుక లేనివాడా! ఓ హయగ్రీవా!, ఉపాధీనామ్=అన్తః కరణము మొదలుగా కల ఉపాధుల యొక్క, భేదాత్=భేదము వలన, వయమ్=జీవుల మగు మేము, ఇహ=ఈ లోకమునందు, బహవః=అనేకులముగా, భవామః =ఉన్నాము, త్వమ్=నీవు, మాయైక్యాత్=నీ ఉపాధియగు మాయ ఒక్కటే అగుట వలన, పరమ వ్యోమనిలయే=పరమాకాశము అను వైకుణ్ఠలోకమునందు, ఏకః =ఒక్కడవుగా, భవసి=ఉన్నావు, ఇన్ద్రాద్యాః యథా ఇవ=ఇన్ద్రుడు మొదలుగా కల దేవతల వలె, త్వమ్=నీవు, నిరుపహత యోగప్రకృతితః – నిరుపహత=అప్రతిహత మగు, యోగప్రకృతితః=మాయ యొక్క సామర్థ్యమువలన, మూర్త్యానన్త్యమ్=అనన్త మైన ఆకారములను, అయసే=పొందుచున్నావు, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలము నందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఆది మధ్యాన్తరహితుడవగు ఓ హయగ్రీవా! జీవులమగు మేము ఆత్మ అనెడి రూపముతో సమస్త దేహములయందు ఏకరూపములో ఉన్నప్పటికి మా ఉపాధులు అగు అన్తఃకరణములు పలు రకములుగా ఉండుటచే వాటియందు తాదాత్మ్యాధ్యాసచే జీవుడు అనెడి రూపముతో అనేకులముగా నున్నాము. నీవు మాత్రము నీ ఉపాధియగు మాయ ఒక్కటే అగుటవలన ఆత్మ అనెడి రూపములోను,

ఈశ్వరుడు అను రూపముతోను ఒక్కడవుగానే వైకుణ్ఠలోకమునందు ఉన్నావు. ఇన్ద్రాది దేవతలు ఒక్కరే అయినను వారి యోగబలముచే అనేక రూపములను ధరించి అనేక హవిస్సులను ఒక్కసారిగా స్వీకరించినట్లుగా, నీవు కూడ అడ్డులేని నీ మాయా సామర్థ్యమువలన రామకృష్ణాది బహురూపములను ధరించి ఆయా కార్యములను నిర్వహించుచున్నావు.

**శ్లో॥ స్వతన్త్ర స్యాహో! తే యదపి పరతన్త్రత్వ నటనం**
**తదస్మన్మోహాయ త్వయి ఘటిత మేత త్ప్రకృతినా।**
**సమస్తాశ్చర్య శ్రీ రసమయ భవచ్ఛక్తి వికృతౌ**
**న చాశ్చర్యం కిఞ్చి ద్ధయవదన మిన్దుస్థిత మయే॥ 84**

**ప్రతిపదార్థము:–** అహో!=ఎంత ఆశ్చర్యము!, స్వతన్త్రస్య=స్వతన్త్రుడవగు, తేఽపి =నీకు కూడ, పరతన్త్రత్వనటనమ్=పరతన్త్రునివలె నటించుట అనునది, యత్=ఏది కలదో, తత్=ఆ నటన, అస్మన్మోహాయ=జీవులమగు మమ్ము భ్రమింపజేయుట కొరకే, ఏతత్ ప్రకృతినా=ఈ మాయయే ప్రకృతిగా కల నీ చేత, ప్రకృతినా=మాయ చేత, త్వయి=నీయందు, ఘటితమ్=ఏర్పాటుచేయబడినది, సమస్తాశ్చర్య...వికృతౌ –సమస్త=సమస్తమగు, ఆశ్చర్య శ్రీరసమయ=ఆశ్చర్యలక్ష్మీ రసముతో నిండిన, భవచ్ఛక్తి=నీ శక్తియగు మాయ యొక్క, వికృతౌ=కార్యమునందు, కిఞ్చిత్=ఏదియును, ఆశ్చర్యమ్=ఆశ్చర్యము, నచ=లేదుకూడ, ఇన్దుస్థితమ్= చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీవు స్వతన్త్రుడవు. నీవు ఎవరి అధీనములోను లేవు. కాని రామావతారము, కృష్ణావతారము మొదలగు అవతారములందు తల్లిదండ్రుల అధీనములో నున్నట్లుగాను, అర్జునునకు సారథిగా వున్నట్లును మాకు భాసించుచున్నావు. ఇది అంతయు నీ శక్తియగు మాయ మమ్ములను భ్రమలో పడవేయుట కొరకు నీయందు కల్పించినదియే! అందువలననే మేము నిన్ను గుర్తించి "ఈ వ్యక్తి ఈశ్వరుడు కాడు. మా వలెనే ఒక జీవుడు. గోవర్ధన పర్వతము నెత్తుటగా కల గొప్పకార్యములు చేసినను అవి అతడు మిక్కిలి బలవంతుడు అగుటచే చేసిన పనులే కాని పరమాత్మ అగుటవలన కాదు. అగస్త్యుడు మానవుడే అయినను సముద్రమును త్రాగలేదా!" అని ఈ విధముగా భ్రమపడుచున్నాము.



ఇట్లు పారతన్త్ర్యమును కల్పించిన మాయకు దేహాదులయందు అభిమానమును కల్పించుట ఏమి కష్టము? కాన దేహము ఇన్ద్రియము మనస్సు మొదలగు వానియందు అభిమానమును కూడ కల్పించును. ఈ విధముగ అసమ్భావిత వస్తువులను మాయ ఎట్లు కల్పించగలుగుచున్నది అను విషయమున ఆశ్చర్యము చెందనవసరము లేదు. లోకములో ఏ వస్తువునందు అయినను ఉండుట లేదా లేకపోవుట అను ధర్మములు మాత్రమే ఉండును. కాని భగవంతునిశక్తి అయిన మాయకు ఈ రెండు ధర్మములును లేవు. కనుక అదియే ఆశ్చర్యకరము. అట్టి మాయనుండి అటువంటి వస్తువులే పుట్టును. గాన ఇది ఏ మాత్రము ఆశ్చర్యకరము కాదు. అట్టి శక్తి కల హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–** సత్ అనగా ఉన్నది అనియు అసత్ అనగా లేనిది అనియు అర్థము. '**నాసతో విద్యతే భావో నాభావో విద్యతేసతః**' అను భగవద్గీతావచనము ననుసరించి సత్ అగు పదార్థమునకు ఎప్పుడును నాశము ఉండదు. అసత్ అగు పదార్థము ఎప్పుడును ఇంద్రియగోచరముకాదు. వేదాన్తశాస్త్రము ననుసరించి బ్రహ్మ ఒక్కటియే సత్. అనగా భూతభవిష్యద్వర్తమాన కాలములందు దానికి నాశము లేదు. నిత్యము కుందేటి కొమ్ము వంటివి అసత్ పదార్థములు. కాని బ్రహ్మశక్తియగు మాయ సత్ పదార్థము కాదు. ఎందుచేతననగా ముక్తి దశయందు మాయ నశించును గదా! మాయ నశించనచో ముక్తియే యుండదు. కాన మాయకు నాశము ఉండుటచే అది సత్ పదార్థము కాదు. ఇంద్రియగోచరమగు వస్తువులను సృష్టించుటచే మాయ కూడ ఇంద్రియగోచరమే కావున అసత్ పదార్థము కూడ కాదు. అందువలన మాయ ఒక ఆశ్చర్యకరమైన మిథ్యా పదార్థము. దానినుండి పుట్టిన జగత్ కూడ అటువంటిదే. కాన ఈ మాయ ఎన్నో ఆశ్చర్యకర వస్తువులను సృజించును. దాని సృష్టి అంతయు ఆశ్చర్యకరమే! అందువలననే దాని సృష్టి ఆశ్చర్యకరము కాకపోవుట వింత కాని ఆశ్చర్యకరమగుటలో వింతలేదని కవి ఈ శ్లోకమునందు చమత్కరించు చున్నాడు.

**శ్లో॥ మహాయోగీ స త్వం భవసి బహుధా యోగ విభవాత్**
**కి మేత త్త్వద్భిన్నం య దిద మఖిలం బ్రహ్మ భవతి।**
**అతో మాయాయా స్తే ఖలు కృత మిదం జీవనటనం**
**న చే జ్జీవోఽసిద్ధో హయవదన మిన్దుస్థిత మయే॥ 85**

**ప్రతిపదార్థము:–** మహాయోగీ=గొప్పయోగముకల, సః=అట్టి (పూర్వశ్లోకములో చెప్పబడిన విశేషములు కల), త్వమ్=నీవు, యోగవిభవాత్=మాయ అను యోగము యొక్క సామర్థ్యము వలన, బహుధా=అనేక విధములుగా, భవసి=అగుచున్నావు, ఏతత్=ఈ జగత్తు, త్వద్భిన్నం కిమ్?=నీ కంటె భిన్నమైనదా ఏమి? (భిన్నమైనది కాదు అని భావము), యత్=ఏ కారణమువలన ఇదమ్ అఖిలమ్=ఈ సమస్త ప్రపఞ్చము, బ్రహ్మ=బ్రహ్మయే, భవతి=అగుచున్నదో, అతః=ఆ కారణము వలన, తే=నీ యొక్క ఇదమ్=ఈ, జీవనటనమ్=జీవునివలె నటించుట కూడ, మాయాయాః =మాయయొక్క, కృతమ్=కార్యమే, ఖలు=కదా!, నచేత్=ఈశ్వరుడే జీవుని వలె నటించుచున్నాడు అని అంగీకరించని యెడల, జీవః=జీవుడు, అసిద్ధఃఏవ= నిరూపించుటకు శక్యముకాదు, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్ =హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీకు మాయ అను గొప్పశక్తి కలదు. ఆ మాయ వలననే నీవు పలురకములుగ మారుచున్నావు. అందువలన ఈ జీవులు అందరును నీ స్వరూపమే! అట్లే జగత్తు కూడ నీవే, **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** అను వేద వాక్యము కూడ ఈ విషయమునే చెప్పుచున్నది. ఈ విధముగా నీవు జీవుని వలె నటించుట కూడ మాయ యొక్క పనియే! ఇట్లుకాని యెడల ఈశ్వరుని కంటె వేరుగా జీవుడు సిద్ధించడు కదా!

**విశేషములు:–** సృష్టికి పూర్వము ఈశ్వరుడు ఒక్కడే కలడు. అట్లే సృష్టి అనంతరము ప్రళయమునందు ఈశ్వరుడు ఒక్కడే కలడు. ఆద్యన్తములలో ఎవరు ఉండునో మధ్యలో కూడ అతడే ఉండును అని నియమము ననుసరించి సృష్టికాలములో కూడ ఈశ్వరుడే ఉండును. కాని జీవుడు ఎట్లు ఉండును? అందుచే మనకు సృష్టి కాలమునందు మనకు కనబడు జీవుడు ఈశ్వరుడే! ఈశ్వరుడే జీవుని వలె నటించు చున్నాడు. ఈ విధముగనే జగత్తు కూడ ఈశ్వరస్వరూపమే! ఈశ్వరుడే జీవుని వలెను జగత్తువలెను నటించుచున్నాడు అని అంగీకరించని యెడల జీవుని స్వరూపమును, జగత్తు యొక్క స్వరూపమును నిరూపించలేము.

**శ్లో॥ న జీవో నామాన్యోఽ స్త్యనుభవమయాన్తఃకరణతో**
**న మాయాత శ్చేశో న హి చిదపరూపా ప్రతిఫలేత్।**



**స్వరూపస్థే చిత్తే న ఖలు పరమ స్యాప్యనుమితిః**
**అథో జీవాధ్యక్షం హయవదన మిన్దుస్థిత మయే॥ 86**

**ప్రతిపదార్థము:–** హే అనుభవమయ!= జ్ఞానస్వరూపా! ఓ హయగ్రీవా!, అన్తః కరణతః=అన్తఃకరణముకంటే, అన్యః=భిన్నముగా, జీవః నామ=జీవుడు అనువాడు, న=లేడు, మాయాతః=మాయకంటే, అన్యః=భిన్నముగా, ఈశః చ=ఈశ్వరుడు కూడ, న=లేడు, అపరూప చిత్=రూపములేని చైతన్యము, నహి ప్రతిఫలేత్= ప్రతిబింబించదు కదా!, చిత్తే=అన్తఃకరణము, స్వరూపస్థే=అచంచలముగా నుండగా (సమాధియందు), పరమస్య=పరమేశ్వరుని యొక్క, అనుమితిః=ఊహ, న ఖలు= లేదు కదా! అథో=ఇట్లే, జీవాధ్యక్షమ్=జీవుని ప్రత్యక్షము, న ఖలు=లేదు కదా!, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలము నందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** జ్ఞాన స్వరూపుడవగు ఓ హయగ్రీవా! వేదాన్తశాస్త్రజ్ఞులు అన్తః కరణమునందు ప్రతిఫలించిన పరమాత్మను జీవుడు అనియు, మాయ యందు ప్రతిఫలించిన పరమాత్మను ఈశ్వరుడు అనియు చెప్పుచున్నారు. కాని రూపములేని పరమాత్మ అన్తఃకరణమునందు గాని, మాయయందు గాని, ఎట్లు ప్రతిఫలించును? అందువలన అన్తఃకరణమే జీవుడు అనియు, మాయయే ఈశ్వరుడు అనియు మేము భావించుచున్నాము. వేదాన్త శాస్త్రజ్ఞులును పరమాత్మ సంబంధమును మాత్రమే దృష్టిలోనుంచుకొని అట్లు చెప్పిరి గాని వాస్తవమునకు వారి ఆశయము కూడ ఇదియే! అందువలననే సమాధియందు అన్తఃకరణము నిశ్చలముగా నుండి స్వకారణమగు అజ్ఞానములో లీనమయి ఉండగా జీవుడు ప్రత్యక్షమగుట లేదు. ఈశ్వరుడును ఊహింపబడుటలేదు. అట్టి పరమాత్మస్వరూపుడవు అగు నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–** అజ్ఞానము రెండువిధములు. వ్యష్టి అజ్ఞానము. సమష్టి అజ్ఞానము. వ్యష్టి అజ్ఞానము అనగా వ్యక్తిగతమైన అజ్ఞానము. సమష్టి అజ్ఞానము అనగా అందరి అజ్ఞానము. ఇందు వ్యష్టి అజ్ఞానమును జాగ్రదవస్థయందు అన్తఃకరణముగా మారును. అందు పరమాత్మ ప్రతిఫలించును. ఈ విధముగ పరమాత్మ ప్రతి ఫలనముతో కూడిన అన్తఃకరణమును జీవుడు అని అందురు. సుషుప్తిదశయందు,

సమాధిదశయందును అన్తఃకరణము మరల స్వకారణమగు అజ్ఞానముగ మారును. ఇచట పరమాత్మప్రతిఫలనము ఉండదు. అందువలననే ఆ దశయందు మనకు జీవుడు ప్రత్యక్షముకాడు. మాయ యందు ప్రతిఫలించిన పరమాత్మను ఈశ్వరుడుగ మనము చెప్పుకొనుచున్నాము. ఈ ఈశ్వరుడు మనకు ప్రత్యక్షముకాడు. కాని జాగ్రదవస్థ యందు మనము చూచు విచిత్రమగు జగత్తునకు కారణభూతుడుగా ఈశ్వరుడు అనువాడు ఒకడు కలడని ఊహించుచున్నాము. సుషుప్తి, సమాధుల యందు అన్తఃకరణము స్వకారణమగు అజ్ఞానములో లీనమయినపుడు జీవుడు ప్రత్యక్షమగుట లేదు. జగత్తు ప్రత్యక్షము కాకపోవుటచే ఈశ్వరుని ఊహ కూడ లేదు. అందువలననే ఈ శ్లోకమునందు అన్తఃకరణము కంటె వేరుగా జీవుడు లేడు. అట్లే మాయకంటే వేరుగా ఈశ్వరుడును లేడు అని కవి చెప్పెను. అన్తఃకరణము, మాయ రెండును జడపదార్థములు ఐనను వాటికి అయస్కాంత సామీప్యమునందు ఇనుమునకు చలనము వచ్చినట్లుగ పరమాత్మ సామీప్యమునందు చైతన్యము ఏర్పడి జీవేశ్వరులుగ పిలువబడుచున్నారు. అన్తఃకరణము, మాయ ఈ రెండును మిథ్యా పదార్థములు కాన అందరియందు యథార్థముగ నుండునది పరమాత్మ ఒక్కడే!

**శ్లో॥ న దేహోఽహం స్వప్నే మమ తదతిరేకిత్వ కలనాత్**
**న జీవోఽహం స్వాపే పరమసుఖరూపత్వ కలనాత్।**
**త దాత్మాహం బ్రహ్మ త్వ మివ పరిపూర్ణాఖిలగుణ**
**స్తతోఽహం తేజో మాం హయవదన మిన్దుస్థిత మయే॥ 87**

**ప్రతిపదార్థము:–** స్వప్నే=స్వప్నమునందు, మమ=నాకు, తదతిరేకిత్వ కలనాత్= దేహము కంటే భిన్నమైన వాడను అను అనుభవము ఉండుట వలన, అహమ్=నేను, దేహః=దేహమును, న=కాను, స్వాపే=సుషుప్తియందు, మమ=నాకు, పరమసుఖరూపత్వకలనాత్=గొప్ప సుఖమే స్వరూపముగా కలవాడను అను అనుభవము వుండుటవలన, అహమ్=నేను,జీవః=జీవుడను,న=కాను,తత్= అందువలన, ఆత్మా=ఆత్మస్వరూపుడను, పరిపూర్ణాఖిల గుణః=పాపములు లేకుండుట మొదలుగా కల పరిపూర్ణములైన సకలసద్గుణములు కలవాడను అగు, అహమ్=నేను, త్వమ్ ఇవ=నీవలె, బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపుడను అయి



వున్నాను. నాకును, నీకును భేదములేదు, తతః=అందువలన, ఇన్దుస్థితమ్= చన్ద్ర మణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుడు అను ఉపాధి కల, తేజః= జ్ఞానస్వరూపుడవైన, మామ్=నన్ను, అహమ్=నేను, అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నేను దేహ స్వరూపుడను కాను. ఎందువలననగా నేను దేహ స్వరూపుడను ఐనచో నా స్వరూపము నాకు ఎల్లప్పుడు భాసించవలెను. కాని స్వప్నమునందు దేహము నాకు భాసించుటలేదు. నా శరీరము శయ్యయందు పడుకొని ఉన్నను స్వప్నమునందు నేను అనేక ప్రదేశములందు తిరుగుచుంటిని. అనేక దృశ్యములను చూచుచుంటిని. అనేక శబ్దములను వినుచుంటిని. కాన ఈ దేహముకంటె భిన్నమైనవాడను అను అనుభవము స్వప్నములో కలుగుచున్నందున నేను దేహమును కాను. అట్లే నేను జీవుడను కూడ కాను. ఎందువలన ననగా నేను అనుపదముచే చెప్పబడు అహంకారమే జీవుడు అను శబ్దమునకు అర్థము. ఈ 'నేను' అను పదార్థము మేలుకొనిన దశయందును, స్వప్నదశయందును భాసించు చున్నది కాని సుషుప్తి దశయందు భాసించుటలేదు. (సుషుప్తి దశ అనగా గాఢ నిద్రాదశ. ఈ దశయందు స్వప్నములు కూడ ఉండవు. అందువలననే అప్పుడు మనకు దేహము భాసించదు. నేను అనబడు జీవుడు కూడ భాసించడు.) సుషుప్తిదశయందు సుఖస్వరూపమగు ఆత్మ మాత్రమే భాసించును. అందువలన 'నేను' అనబడు జీవుడను కూడ నేను కాను.

కనుకనే నేను సుఖస్వరూపుడనగు బ్రహ్మను. సుఖస్వరూపమగు బ్రహ్మ సుషుప్తి యందు మనకు భాసించుచున్నది అని అనుటకు ప్రమాణమేమనగా– సుషుప్తి నుండి మేల్కొనినవాడు 'సుఖముగా నిద్రించితిని. నాకు ఏమియును తెలియలేదు' అని పలుకును. ఈ వాక్యము వలన సుషుప్తిలో ఆ వ్యక్తికి సుఖము భాసించినట్లుగ మనము తెలిసికొనవలెను. అట్లయిన సుషుప్తి దశలోనే 'నేను సుఖముగ నిద్రించు చున్నాను' అని అనుభవము కలుగవలెను గదా! అని మనకు సందేహము వచ్చును. సుషుప్తి దశలో సుఖమును అనుభవించుచున్నను ఆ సుఖము అజ్ఞానముచే ఆవరించబడియుండుటచే అనుభవ కాలములో సుఖమును అనుభవించుచున్నట్లుగ జ్ఞానము కలుగదు. స్వప్నదశయందు దేహము భాసించ నందువలన, సుషుప్తి యందు జీవుడు భాసించనందువలన దేహముకంటెను జీవుని

కంటెను నేను భిన్నమైనవాడను అని అనినచో సుషుప్తియందు భాసించిన సుఖము కూడ మేలుకొనిన దశయందును స్వప్నదశయందును భాసించుటలేదు గాన నేను సుఖస్వరూపుడనగు బ్రహ్మను ఎట్లు అగుదును? అని సందేహము కలుగును. దానికి సమాధానము ఏమనగా– **'సచ్చిదానన్దం బ్రహ్మ'** అను శ్రుతి వాక్యముచే బ్రహ్మ స్వరూపమునందు మూడు భాగములు కలవు. సత్, చిత్, ఆనన్దము. **'అయ మాత్మా బ్రహ్మ'** అనుశ్రుతి వాక్యముచే బ్రహ్మకును మన ఆత్మకును భేదము లేనట్లుగ తెలియుచున్నది. ఇందు సత్ అనగా ఉండుట, చిత్ అనగా భాసించుట, ఆనన్దము అనగా సుఖమును కలుగజేయుట. ఈ మూడు భాగములతో కూడిన బ్రహ్మ అనగా మన ఆత్మ స్వరూపము మనకు సర్వదా భాసించుచున్నప్పటికి భాసించుచున్నట్లుగా మనము తెలిసికొనలేక పోవుచున్నాము. దీనికి కారణమును విద్యారణ్య స్వామి వారు ఇట్లు వివరించిరి.

**అధ్యేతృవర్గవర్గ మధ్యస్థ పుత్రాధ్యయన శబ్దవత్।**
**భానేప్యభానం భానస్య ప్రతిబన్ధేన యుజ్యతే॥**

అనగా పలువురు కలసి ఒకేసారి వేదమును పఠించుచుండగా ఆ పలువురిలో ఒకడైన తన కుమారుని కంఠధ్వని తండ్రికి వినబడుచున్నను వినబడని దానితో సమానమగుచున్నది. ఇందులకు కారణము ఇతరుల కంఠధ్వనితో తన కుమారుని కంఠధ్వని కలసియుండుటయే. ఇతరులు పఠించుట మానిన యెడల తన కుమారుని కంఠధ్వనిని తండ్రి స్పష్టముగ వినగలుగుచున్నాడు. అట్లే మన ఆత్మ స్వరూపము కూడ మనకు అన్ని దశలలోను ఎల్లప్పుడు భాసించుచున్నను ఆత్మకంటే వేరయిన జగత్తు కూడ దానితో భాసించుటవలన మన ఆత్మ స్వరూపము స్పష్టముగా భాసించకున్నది. సుషుప్తి దశయందు బాహ్య ప్రపంచమంతయును భాసించక పోయినను అజ్ఞానము అను ఆత్మేతర వస్తువు ఒకటి ఆత్మతో కలసి భాసించుచున్నది. అందువలన కొంత సుఖము అచట మనకు ప్రత్యక్షమగుచున్నది. ముక్తి దశయందు మాత్రము ఈ అజ్ఞానము కూడ నశించుటచే కేవలము సుఖస్వరూపమగు బ్రహ్మను, పొందుచున్నాము. సంసారదశయందును మనము ఆ బ్రహ్మస్వరూపులమే అయినను ప్రత్యేకముగ దాని సాక్షాత్కారము లేక దానిని పొందనట్లుగ భాసించు చున్నాము. అందువలననే ముక్తికి సన్న్యాసమును సాధనముగ శ్రుతి చెప్పుచున్నది. సన్న్యాస



మనగా, ఆత్మకంటే ఇతరమగు ప్రపంచమును విడచిపెట్టుట. బాహ్యప్రపంచమును విడచిపెట్టుట అనగా మనస్సునందు బాహ్యప్రపంచమును ఆలోచింపక యుండుటయే. హయగ్రీవుడును మన ఆత్మస్వరూపుడే. వేదములయందు చెప్పబడిన పరబ్రహ్మము ఆయనయే. సచ్చిదానన్ద స్వరూపుడగు ఆ హయవదన పరబ్రహ్మ యందు నేను లీనమగుచున్నాను.

**శ్లో॥ అహం సర్వత్రేదం మయి తు పర మజ్ఞాన లసితం**
**న లిప్తో౽నేనాహం ఖ మివ జలదేన ధ్రువ మిదమ్।**
**చిదానన్దం పూర్ణం నిరవయవ మేకాద్వయ మజం**
**గుణాబ్ధి మ్మాత్మానం హయవదన మిన్దుస్థితమయే॥ 88**

**ప్రతిపదార్థము:–** అహమ్=నేను, సర్వత్ర=అన్ని ప్రదేశములయందను, (అస్మి= ఉన్నాను), మయి తు=నాయందు ఉన్న ఈ జగత్తు, పరమ్=కేవలము, అజ్ఞాన లసితమ్=అజ్ఞానముచేతనే ప్రకాశించుచున్నది, అనేన=అజ్ఞానముచే కల్పించడిన ఈ జగత్తుతో, అహమ్=నేను, జలదేన=మేఘముతో, ఖమ్ ఇవ=ఆకాశము వలె, న లిప్తః=సంబంధము లేనివాడను, ఇదమ్=ఈ విషయము, ధ్రువమ్=నిశ్చయింప బడినది, చిదానన్దమ్=జ్ఞానము మరియు ఆనందము స్వరూపముగా గలవాడను, పూర్ణమ్=పరిపూర్ణుడను, నిరవయవమ్=అవయవములు లేనివాడను, ఏకాద్వయమ్ =ఒక్కడను, నా కంటె వేరైన పదార్థము లేనివాడను, అజమ్=పుట్టుక లేనివాడను, గుణాబ్ధిమ్=సద్గుణములకు సముద్రము వంటివాడను, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలము నందు ఉన్నవాడను, హయవదనమ్=హయగ్రీవుడు అను ఉపాధికలవాడను అగు, మా=నన్ను, (అహమ్=నేను,) అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** నేను అన్ని ప్రదేశములయందును ఉన్నాను. సర్వవ్యాపకుడును. నా యందు ప్రపంచము ఎంత మాత్రము లేదు. అయినను అజ్ఞానముచే ప్రపంచము నా యందు ఉన్నట్లుగ భాసించుచున్నది. అందువలననే అజ్ఞానముతో భాసించు ఈ ప్రపంచముతో నాకు ఏ మాత్రము సంబంధములేదు. మేఘములతో ఆకాశమునకు ఎట్టి సంబంధము ఉండదు కదా! ఎండమావులలోని నీటిలో అచటి భూమి తడవదు కదా! ఇది వేదాన్త సిద్ధాన్తము. నేను జ్ఞానస్వరూపుడను. ఆనన్ద స్వరూపుడను. అవయవములు లేనివాడను. ఒక్కడను. ద్వితీయ వస్తువు లేనివాడను.

చావు పుట్టుకలు లేనివాడను. సద్గుణములకు సముద్రమువంటివాడను. అందు వలననే హయగ్రీవస్వరూపుడను. అట్టి నన్ను నేను పొందుచున్నాను.

**శ్లో॥ కృశో౽హం స్థూలో౽హం వదతి తను తాదాత్మ్య మితి యన్**
**తథాత్మాహం జీవ స్త్వితి హి పరతాదాత్మ్య వశతః।**
**మన శ్శుద్ధం పశ్య ద్వదతి విమలత్వాదిగుణకం**
**స్వవాచా తస్య త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 89**

**ప్రతిపదార్థము:–** జీవః=అంతఃకరణము, తనుతాదాత్మ్యమ్=నేనే శరీరము అనెడి శరీరతాదాత్మ్యమును, యన్=పొందుచూ, అహమ్=నేను, కృశః=కృశించినవాడను, అహమ్=నేను, స్థూలః=లావు పాటివాడను, ఇతి=అని, వదతి=పలుకుచున్నాడు, తథా=అట్లే, పరతాదాత్మ్యవశతః=శుద్ధమగు ఆత్మతో తాదాత్మ్యమును పొందుట వలన, అహమ్=నేను, ఆత్మా=ఆత్మను, ఇతి=అని, వదతి=పలుకుచున్నాడు, శుద్ధమ్=పరిశుద్ధమగు, మనః=మనస్సు, శుద్ధమ్=నిర్గుణమగు బ్రహ్మను, పశ్యత్=అనుభవించుచూ,తస్య=ఆ బ్రహ్మయొక్క, విమలత్వాదిగుణకమ్=విమలత్వము మొదలుగా గలగుణసముదాయమును,స్వవాచా=తనకు సంబంధించిన వాగింద్రియముతో, వదతి=చెప్పుచున్నది, ఇన్దుస్థితమ్=చన్ద్ర మణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుడవై, త్వామ్=నిన్ను,(అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** అంతఃకరణరూపమగు జీవుడు తనకు శరీరముతో ఏ సంబంధము లేకపోయినను శరీరమే తాను అను తాదాత్మ్యభ్రమ పొందుట వలన శరీర ధర్మములగు కృశత్వ, స్థూలత్వములను తనయందు ఆరోపించుకొని నేను సన్నగా నున్నాను. నేను లావుగానున్నాను అని పలుకుచున్నాడు. అట్లే శుద్ధమగు ఆత్మతో తాదాత్మ్యమును పొందుటచే నేను ఆత్మను అని అనుచున్నాడు. శుద్ధమగు ఆత్మ అనగా హయగ్రీవుడే! కాన హయగ్రీవునితో తాదాత్మ్యమగుటకు అనగా మోక్షమును పొందుటకు మన అంతఃకరణమే ముఖ్యమైన సాధనము. ఆ అంతఃకరణము శరీరమే తాను అనుకొనుటయే సంసారము. శుద్ధమగు ఆత్మయే నేను అనుకొనుట యే మోక్షము. పరిశుద్ధమగు ఆత్మయే తాను అని అనుకొనినప్పుడు మనస్సునకు అట్టి జ్ఞానము కలిగిన కలుగును కాని ఆ విషయమును మాటలతో ఎట్లు చెప్పును అని సందేహించనవసరము లేదు. ఏలయన అంతఃకరణము శుద్ధమగు ఆత్మను



తాను అనుభవించి తన యొక్క వాగింద్రియముతో నేనే ఆత్మను అని చెప్పును. **'యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ'** అనుశ్రుతి వచనము ననుసరించి మనో వాగగోచరమగు పరమాత్మ మనస్సుచే ఎట్లు చూడబడెను? వాక్కుతో ఎట్లు చెప్పబడెను? అని కూడ సందేహించనవసరములేదు. సాధన చతుష్టయముతో కూడిన పరిశుద్ధమైన మనస్సునకు ఆత్మ తప్పక ప్రత్యక్షమగును. అందువలననే **'మనసైవానుద్రష్టవ్యమ్'** అను శ్రుతి కూడ కలదు. అట్టి బ్రహ్మ యొక్క విమలత్వాది గుణ సముదాయమును వాక్కు సాక్షాత్తుగా అనగా అభిధావృత్తితో చెప్పకపోయినను తాత్పర్యవృత్తితో చెప్పును. చన్ద్రమణ్డలమునందున్న హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–** ఈ శ్లోకమునందలి జీవశబ్దమునకు లింగశరీరము అని అర్థము. లింగశరీరము అనగా 'జ్ఞానేన్ద్రియములు అయిదు, కర్మేన్ద్రియములు అయిదు, ప్రాణములు అయిదు, బుద్ధి' ఈ పదునారు అవయవములు కల అంతఃకరణము. ఈ విషయము వేదాన్తపంచదశిలోని తత్త్వవివేకప్రకరణమునందు విద్యారణ్యుల వారిచే ఇట్లు చెప్పబడినది.

**'బుద్ధి కర్మేన్ద్రియప్రాణ పంచకై ర్మనసాధియా।**
**శరీరం సప్తదశభిః లింగం తజ్జీవ సంజ్ఞితమ్॥ ఇతి.**

**శ్లో॥ న వక్తా న శ్రోతా నతు వచన మాహో పరశివే**
**న వేత్తా నో వేద్యం న హి భవతి వేదః కరణభూః।**
**శివం శాన్తం శుద్ధం బృహ దచల మేకం పరమహో**
**గభీరం స్వాత్మానం హయవదన మిన్దుస్థిత మయే॥ 90**

**ప్రతిపదార్థము:–** పరశివే=పరమ సుఖ స్వరూపమగు ఆత్మయందు, వక్తా=చెప్పువాడు, న=లేడు, శ్రోతా=వినువాడు, న=లేడు, వచనమ్=మాటయును, న=లేదు, వేత్తా= తెలిసికొనినవాడు, న=లేడు, వేద్యమ్=తెలియబడు విషయము, న=లేదు, కరణభూః=అంతఃకరణమునుండి పుట్టు, వేదః=వృత్తి జ్ఞానము, న హి భవతి=లేదు, శివమ్=సుఖ స్వరూపుడును, శాన్తమ్=విక్షేపాదులులేనివాడును, శుద్ధమ్=నిర్గుణమైన వాడును, బృహత్ =గొప్పవాడును, అచలమ్=కదలనివాడును, ఏకమ్=ఒకే ఒక్కడును, పరమహః=గొప్ప తేజోరూపమైనవాడును, గంభీరమ్=లోతైనవాడును,

స్వాత్మానమ్= మన ఆత్మ స్వరూపుడును, ఇన్దుస్థితమ్=చన్ద్రమండలమునందున్న వాడును అగు, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను,) అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము:–** జీవులందరకు ఆత్మస్వరూపుడు హయగ్రీవుడు. గొప్పసుఖమే స్వరూపముగా కలవాడు. అట్టి ఆత్మను గురించి చెప్పగలిగినవాడు లేడు. వినువాడు లేడు. ఇరువురు లేకపోవుటచే చెప్పుటయే లేదు. ఇట్లే ఆ ఆత్మను తెలిసికొనిన వాడు లేడు. తెలియజెప్పువాడు లేడు. ఆ ఆత్మవిషయకమగు జ్ఞానమే లేదు. పరమసుఖస్వరూపమైనదియు, శాంతమైనదియు, శుద్ధమైనదియు, గొప్పదియు, కదలనిదియు, ఒకే ఒక్కటియు, గొప్ప తేజోరూపమును, గంభీరమైనదియును అగు నా ఆత్మనే చన్ద్రమండలమందున్న హయగ్రీవునిగా భావించి ఆయనను శరణు పొందుచున్నాను.

**– ఆత్మానన్దానుభవ ప్రార్థన (91, 92, 93) –**

**శ్లో॥ సదా స్వాత్మానన్దానుభవ మజ!నో దేహి భగవన్!**
**ప్రకృత్యా క్షిప్తానాం రజసి తమసి త్వా మభజతామ్।**
**సరూప త్వద్ధ్యానా న్మనసి పరిశుద్ధే స్ఫురసి హి**
**త్వ మాత్మా సర్వేశం హయవదన మిన్దుస్థిత మయే॥ 91**

**ప్రతిపదార్థము:–** హే అజ=పుట్టుక మొదలగు భావవికారములు లేనివాడా!, భగవన్! =సకల కల్యాణగుణ పరిపూర్ణ! ఓ హయగ్రీవా!, ప్రకృత్యా=నీ మాయచే, రజసి=రజో గుణముయందు, తమసిమ్ చ=తమోగుణమునందును, క్షిప్తానామ్=పడవేయబడిన వారమును, త్వామ్=నిన్ను, అభజతామ్=సేవించనివారమును, అగు, నః=జీవుల మగు మాకు, సదా=ఎల్లప్పుడు, స్వాత్మానన్దానుభవమ్=మా ఆత్మానందాను భవమును, దేహి=ఇమ్ము, హి=ఎందువలన ననగా, సరూప త్వద్ధ్యానాత్=రూపము కల నిన్ను ధ్యానించుట వలన, పరిశుద్ధే=నిర్మలమైన, మనసి=మనస్సునందు, త్వమ్=నీవు, ఆత్మా=ఆత్మగా, స్ఫురసి=భాసించెదవు కనుక, ఇన్దుస్థితమ్=చన్ద్ర మణ్డలమునందున్న, సర్వేశమ్=అందరకు ప్రభువైన, హయవదనమ్= హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ మాయ జీవులమగు మమ్ము రజోగుణములోను



తమోగుణములోను పడవైచినది. అందువలన మేము స్వస్వరూపమును మరచితిమి. నీ సేవకుసైతము సుదూరమైతిమి. కాన దయయుంచి మాకు మా ఆత్మానందాను భవమును ప్రసాదించుము. ఓ సర్వేశ్వరా! నిన్ను రూపముతో ధ్యానము చేసినచో మా మనస్సులు పరిశుద్ధమగును. అట్టి మనస్సులలో నీవు 'ఆత్మగా భాసించెదవు గదా! అందువలన, హయగ్రీవా! నిన్ను ధ్యానించుచున్నాము. కనుక ఆత్మానందము కొరకు నిన్ను ప్రార్థించుచున్నాము.

**విశేషములు:–** సర్వజీవులకు ఆత్మ ఆ హయగ్రీవుడే! ఆ ఆత్మను అనుభవించవలెనన్న ఆత్మకంటే ఇతర వస్తువులను విడచిపెట్టవలెను. భగవంతుని మాయ మనలను రజోగుణమునందును తమోగుణమునందును నెట్టివేయుటచే మనకు ఆత్మేతర వస్తువులయందు ఆసక్తి కలుగుచున్నది. అందువలననే భగవంతుని సేవ కూడ చేయలేకున్నాము. అందువలన భగవంతునియందు భక్తిని కూడ ఆ భగవంతుడే కలుగజేయవలసియున్నది. అందువలననే కవి 'సర్వేశం' అను పదముతో అన్నింటికిని ప్రేరకుడగు ఓ హయగ్రీవా! మమ్ము నీ సేవ యందు ప్రేరేపించి నీవే మాకు ఆత్మానందానుభవమును ఇమ్ము అని ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥ హయాస్య! శ్రీశ! త్వం హృదయ కమలం మేఽధినివసా–**
**నిశమ్ భోగం నైతి క్వను కమలయా లాలిత పదః?।**
**త్వదీక్షాతో మద్ధృన్మయ సురగవీ తే వరబలిం**
**విదధ్యా త్సర్వజ్ఞం హయవదన మిన్దుస్థిత మయే॥ 92**

**ప్రతిపదార్థము:–** హయాస్య!=ఓ అశ్వముఖ!, శ్రీశ!=లక్ష్మీపతి!, త్వమ్=నీవు, మే=నా యొక్క, హృదయ కమలమ్=పద్మమువంటి హృదయమునందు, అనిశమ్= ఎల్లప్పుడు, అధినివస=నివసించుము, కమలయా=లక్ష్మీదేవితో, లాలితపదః =లాలింపబడిన పాదములు కలవాడు, క్వ=ఎక్కడ, భోగమ్=సుఖమును, న+ఏతి= పొందడు, త్వదీక్షాతః=నీ కటాక్షము వలన, మద్ధృన్మయ సురగవీ= నా హృదయము అనెడి కామధేనువు, తే=నీకు, వరబలిమ్=గొప్పషోడశోపచారపూజను, విదధ్యాత్ =చేయ గలదు, ఇన్దుస్థితమ్=చన్ద్రునియందు ఉండువాడును, సర్వజ్ఞమ్=అన్నియును తెలిసినవాడును అగు, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! లక్ష్మీపతీ! నీవు ఎల్లప్పుడు లక్ష్మీసహితుడవై నా హృదయ కమలమునందు నివసింపుము. గొప్ప సుఖములను ఇచ్చు వైకుంఠమును విడచి శూన్యమగు నా మనస్సుయందు ఎట్లుండగలను అని సందేహింపకుము. నీవు లక్ష్మీదేవిచే లాలింపబడిన పాదములు కలవాడవు. అట్టి నీవు ఎచ్చటనైనను సుఖములను పొందగలవు. సీతాసహితుడవై పంచవటిలో సుఖపడలేదా! అట్లే నా హృదయమునందును సుఖపడగలవు. నీ కటాక్షమున్నచాలును. నా హృదయమే కామధేనువుగా మారి నీకు గొప్ప షోడశోపచార పూజను చేయగలదు. చన్ద్ర మణ్డలమునందున్న ఓ హయగ్రీవా! నిన్ను నేను శరణుపొందుచున్నాను.

**విశేషములు:–** 1) లక్ష్మీసహితముగనే తన హృదయమునందు ఉండుమని కోరుటకు హయాస్య! శ్రీశ! అను రెండు సంబోధనలను కవి ప్రయోగించినాడు.

2) లక్ష్మీదేవితో అనగా సంపదతో లాలింపబడిన మహారాజు అన్ని ప్రదేశములయందు సుఖపడినట్లుగా లక్ష్మీదేవితో కూడిన హయగ్రీవుడు శూన్యమగు హృదయమునందును సుఖపడునను అర్థము ధ్వనించుచున్నది.

3) నా హృదయము అనెడి కామధేనువు నీకు గొప్ప షోడశోపచారపూజను చేయును. అనగా మానసికమగు గొప్ప షోడశోపచార పూజను చేయుదునని భావము. మనస్సునకు అంతశక్తి కలదు కనుకనే దానిని కామధేనువుతో పోల్చినాడు. అన్ని పూజల కంటె మానసిక పూజయే శ్రేష్ఠము. అన్నింటికంటె మనస్సును నిల్పుటయే కదా కఠినమైనది. కాన ఆ పూజయే గొప్పది కావున 'వరబలిం' అని ప్రయోగించినాడు. అట్టి కఠినమైన దానిని సాధించుటకు కావలసినది భగవత్కటాక్షము. అందువలననే 'త్వదీక్షాతః' అని అనినాడు.

**శ్లో॥ ప్రభో! శ్రీశార్చాయాం నివస కురు కర్మాణ్యవిషయా**
**ణ్యయం సర్వజ్ఞ శ్శ్రీపతి రితి ధియం మే దిశ శుభామ్।**
**పయోజై శ్చామన్తీ కుముద తులసీభి ర్బహురసై**
**స్సదన్నై స్త్వాం సేవే హయవదన మిన్దుస్థిత మయే॥ 93**

**ప్రతిపదార్థము:–** హే ప్రభో!=ఓ ప్రభూ!, శ్రీశ!=లక్ష్మీపతీ!, అర్చాయామ్=విగ్రహమునందు, నివస=నివసింపుము, అవిషయాణి=మాకు గోచరముకాని గోవర్ధనోద్ధారము మొదలగు, కర్మాణి=పనులను, కురు=చేయుము, అయమ్=ఈ విగ్రహరూపములోని



దేవుడే, సర్వజ్ఞః=అన్నియును తెలిసినవాడు, శ్రీపతిః=లక్ష్మీదేవికి భర్త, ఇతి=అను, శుభామ్=శుభకరమగు, ధియమ్=బుద్ధిని, దిశ=ఇమ్ము, బహురసైః=గొప్ప మకరంద రసముగల, సదన్నైః=మంచి అన్నములతోను, పయోజైః=పద్మముతోను, చామన్తీ కుముద తులసీభిః=చామంతి పూలు, కలువపూలు, తులసీదళములతో, త్వామ్= నిన్ను, సేవే=సేవించెదను, ఇన్దుస్థితమ్= చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్ =హయగ్రీవుని, (అహమ్=నేను) అయే= పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నేను పూజించు ఈ విగ్రహమునందు నీవు ఉండుము. మేము ఎన్నడును చూడని, నీవు మాత్రమే చేయగలిగిన గోవర్ధనోద్ధారణము మొదలుగా కల పనులను ఈ విగ్రహము నాశ్రయించి చేయుము. ఈ విగ్రహమే సర్వజ్ఞుడు, లక్ష్మీపతి అను సద్బుద్ధిని మాకు ఇమ్ము. విగ్రహమునందున్న నిన్ను పద్మములతోను, చామంతులతోను, కలువలతోను నేను సేవించెదను.

**విశేషములు:–** విగ్రహము ఆశ్చర్యకరమగు పనులను చేసిన ఆ విగ్రహము లక్ష్మీపతి, సర్వజ్ఞుడను నిశ్చయము కలుగునుకాన ఆ పనులను చేయమని కోరుచున్నాడు. ఒకవేళ అట్లు చేయనిచో విగ్రహము సాక్షాత్తుగా భగవంతుడే అను బుద్ధినైనను ఇమ్మనుచున్నాడు. కాన విగ్రహమునందు సర్వజ్ఞుడు అను విశ్వాసము లేనిచో పూజ వ్యర్థమని కవి సూచించుచున్నాడు.

### – హయగ్రీవ మన్త్రమహిమ వర్ణన –

**శ్లో॥ ప్రభో! త్వన్మన్త్రాణాం పఠన మథవా పూజన మమీ**
**సకృద్వా కుర్యు శ్చేత్ వృషశిరసి విన్యస్య చరణమ్।**
**ద్వితీయం వై శమ్భో శ్శిరసి కరయుగ్మం శతధృతేః**
**ప్రయాన్తి త్వ ల్లోకం హయవదన మిన్దుస్థిత మయే॥ 94**

**ప్రతిపదార్థము:–** హే ప్రభో!=ఓ ప్రభూ!, అమీ=ఈ జీవులు, త్వన్మన్త్రాణామ్=నీ మన్త్రముల యొక్క, పఠనమ్=జపమును కాని, అథవా=లేక, పూజనమ్=(యన్త్రమునందు వ్రాయబడిన నీ మన్త్రములను)పూజించుట గాని, సకృత్ వా=ఒకసారియైనను, కుర్యుః చేత్=చేసిన యెడల, చరణమ్=ఒక పాదమును, వృషశిరసి=ఇన్ద్రుని శిరస్సునందు (స్వర్గమునందు), విన్యస్య=ఉంచి, ద్వితీయమ్=రెండవపాదమును, శమ్భోః శిరసి=శివుని తలయందు (కైలాసమునందు), విన్యస్య=ఉంచి, కరయుగ్మమ్ =రెండు

చేతులను, శతధృతేః శిరసి=బ్రహ్మదేవుని శిరస్సునందు, విన్యస్య=ఉంచి, త్వల్లోకమ్=నీ లోకమును గురించి, ప్రయాన్తి=వెళ్లెదరు, ఇన్దుస్థితమ్=చన్ద్రమణ్డలమునందున్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ మహిమ ఏమని చెప్పగలను. నీ మన్త్రములను ఒకసారి జపించిన చాలును. లేదా యన్త్రమునందు వ్రాయబడిన నీ మన్త్రములను ఒకసారి పూజించిన చాలును. అట్టివారు ఒక పాదమును స్వర్గలోకములో ఉంచి, రెండవ పాదమును కైలాసములో ఉంచి, రెండు చేతులను బ్రహ్మలోకములో ఉంచి ఆపై నీ లోకమునకు చేరెదరు. అట్టి మహిమగల నిన్ను నేను శరణు పొందుచున్నాను.

**విశేషములు:–** 1) ఇంద్రుని శిరస్సు నందు పాదము ఉంచుట అనగా స్వర్గ లోకమును అతిక్రమించి పోవుట. అట్లే శివుని శిరస్సు అనగా కైలాసము, బ్రహ్మ శిరస్సు అనగా బ్రహ్మలోకము.

2) దొమ్మర జాతి పురుషులు వేగముగా ఎత్తైన రాయియందు ఒక పాదము నుంచి, రెండవ పాదమును అంతకంటె ఎత్తైన రాయియందుంచి రెండు చేతులను అంతకంటె ఎత్తైన చోటున ఉంచి ఎగిరి భవనము మొదలైన వాటి పైభాగమునకు చేరుదురో అట్లే నీ మంత్ర జపమును చేసినవారు స్వర్గలోకములో ఒకకాలు, కైలాసములో మరొక కాలు, బ్రహ్మలోకములో రెండు చేతులు ఉంచి ఎగిరి నీ లోకమునకు చేరుదురని భావము.

3) నీ మూర్తి ధ్యానము లేకపోయినను మాకు మన్త్రజపముకాని, మన్త్రపూజ కాని ఉండనిమ్ము అని భగవంతుని కవి ప్రార్థించుచున్నాడు అని ధ్వనించుచున్నది.

**– హయగ్రీవ నామస్మరణ మహిమ వర్ణన (95, 96, 97) –**

**శ్లో॥ స్మృతా చే దాఖ్యా తే భవతి పదయో స్తస్య వృషభః**
**శ్రుతా చే ద్ధంసః శ్రీ రమణ! పఠితా చేత్సగరుడః।**
**అహో మూఢో లోక స్సులభ మపి హిత్వా సకలదం**
**భవన్నామ భ్రష్టో హయవదన మిన్దుస్థిత మయే॥ 95**

**ప్రతిపదార్థము:–** హే శ్రీరమణ!=ఓ లక్ష్మీపతీ!, తే=నీ యొక్క, అఖ్యా=పేరు, స్మృతా చేత్=స్మరించబడినచో, తస్య=ఆ స్మరించిన వాని యొక్క, పదయోః=పాదముల యందు, వృషభః=(నంది), భవతి=ఉండును, శ్రుతాచేత్=వినబడినచో, తస్య=వినిన వాని యొక్క, పదయోః=పాదములయందు, హంసః=హంస, భవతి=ఉండును, పఠితా చేత్=చదువబడినచో, సః=(హృదయమునందు హయగ్రీవ వాహనముగా ప్రసిద్ధుడైన), గరుడః=గరుత్మంతుడు, పదయోః=పాదములయందు, భవతి= ఉండును, అహో!=ఎంత ఆశ్చర్యము!, మూఢః=అవివేకియగు, లోకః=లోకము, సకలదమ్=అన్నింటిని ఇచ్చునదియు, సులభమపి=తేలిక అయినదియును అగు, భవన్నామ=నీ పేరును, హిత్వా=విడచి, భ్రష్టః=భ్రష్టమైనదిగా, భవతి=అగుచున్నది, ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.



**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ పేరు యొక్క గొప్పదనమును ఏమని చెప్పను! ఆ పేరును ఎవరైనా ఒకసారి స్మరించినచో వారు శివుడే అగుదురు. చెవులారా విన్నవారు బ్రహ్మ అగుదురు. చదివినచో సాక్షాత్తుగా విష్ణువే అగుదురు. ఇక సామాన్యమగు కోరికల సంగతి చెప్పెడిదేమున్నది! ఈ విధముగా అన్ని కోరికలను నెరవేర్చునది, తేలికగా పలుకుటకు వీలయినది అగు నీ పేరు ఉన్నప్పటికి అవివేకులగు జనులు దానిని విడచి భ్రష్టులగుచున్నారు గదా! చన్ద్రమణ్డలమందు ఉన్న హయగ్రీవుని నేను శరణు పొందుచున్నాను.

**శ్లో॥ హయగ్రీవ! స్వాన్తా దపహరతి హః పాప మఖిలమ్**
**భవన్తం యో దత్తే హృది తు జననీం గ్రీపద మిదమ్।**
**బహిర్యానం వాం మా భవతు న తథాన్తర్య మఘత**
**స్త్వితీవాయం వ స్త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 96**

**ప్రతిపదార్థము:–** హే హయగ్రీవా!=ఓ హయగ్రీవా!, హః=నీ పేరులోని మొదటి అక్షరమైన 'హ' అను వర్ణము, స్వాన్తాత్=హృదయము నుండి, అఖిలమ్=సమస్తమగు, పాపమ్=పాపమును, అపహరతి=పోగొట్టుచున్నది, యః=నీ పేరులోని రెండవ అక్షరమగు 'య' అను వర్ణము, హృది=హృదయమునందు, భవన్తమ్=నిన్ను, ధత్తే= ఉంచుచున్నది, జననీం తు= మా తల్లియగు లక్ష్మీదేవిని మాత్రము, ఇదమ్=ఈ, గ్రీ పదమ్=నీ పేరులోనీ మూడవ అక్షరమైన 'గ్రీ' అను వర్ణము, ధత్తే=ఉంచుచున్నది, అయమ్=ఈ, వః=నీ పేరులోని నాలుగవ అక్షరమైన 'వ' అను వర్ణము, వామ్=మీ ఇరువురకు, బహిః=హృదయమునుండి బయటకు, యానమ్=గమనము, మా=

లేకుండుగాక, తథా=అట్లే, అఘతః తు=పాపము యొక్క, ఆన్తర్యమ్=ప్రవేశము, న=లేకుండుకాక, ఇతీవ=అని చెప్పుచున్నదో అన్నట్లున్నది, ఇన్దుస్థితమ్= చంద్రుని యందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్=నేను), అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ పేరులోని మొదటి అక్షరమగు హకారమును ఉచ్చరించిన వెంటనే మా హృదయమునందలి పాపములు అన్నియు బయటకు పోవుచున్నవి. (హకారమును ఉచ్చరించినపుడు లోపలనుండి గాలి బయటకు పోవుటచే పాపములు బయటకు పోవునట్లుగా చెప్పబడినది.) రెండవదియగు 'య' అను వర్ణము మా మనస్సులయందు నిన్ను ఉంచుచున్నది. (అకారము విష్ణువాచకము అగుటచేతను, పాపములు లేనివారల మనస్సులయందే భగవంతుడు ఉండుట చేతను ఇట్లు చెప్పబడినది.) మూడవదియగు 'గ్రీ' అను అక్షరము మా తల్లియగు లక్ష్మీదేవిని మా మనస్సులయందు ఉంచుచున్నది.(ఈకారము లక్ష్మీవాచక మగుటచే ఇట్లు చెప్పబడినది. మరియును నా హృదయమునందు ఉన్నను నీకు లక్ష్మీదేవితో విరహము ఉండదని కవి వ్యంగ్యముగా చెప్పుచున్నాడు.) నాలుగవది యగు వకారము మా మనస్సులనుండి మీ ఇరువురు బయటకు వెళ్లకుండ చేయుచున్నది. మరియును హకారోచ్చారణముచే బయటకు వెళ్ళిన పాపములు తిరిగి లోనికి ప్రవేశించకుండ ఆపుచున్నది. (వకారమును ఉచ్చరించినపుడు పై దంతములు, క్రింది పెదవులు కలసి ఒక తలుపువలె నోటిని మూయుటచే ఇట్లు చెప్పబడినది.)

**శ్లో॥ భవ త్తత్త్వం వేత్తుం న భవతి మమేశ! త్రినయనమ్**
**భవద్రూపం ధ్యాతుం న హి తవ చ నాభౌ నివసతిః।**
**గుణాం స్తే ప్రస్తోతుం న చ ముఖ సహస్రం సకృ దహం**
**భవన్నామ బ్రూయాం హయవదన మిన్దుస్థిత మయే॥ 97**

**ప్రతిపదార్థము:–** హే ఈశ!=ఓ ప్రభూ! హయగ్రీవా!, భవత్తత్త్వమ్=సచ్చిదానన్దరూప మగు నీ తత్త్వమును, వేత్తుమ్=తెలిసికొనుటకు, మమ=నాకు, త్రినయనమ్=మూడవ కన్ను, న భవతి=లేదు, భవద్రూపమ్=నీరూపమును, ధ్యాతుమ్=ధ్యానముచేయుటకు, తవ=నీ యొక్క, నాభౌ=బొడ్డుయందు, మమ=నాకు, నహి నివసతిః=నివాసము



లేదు, తే=నీ యొక్క, గుణాన్=గుణములను, ప్రస్తోతుమ్=స్తోత్రము చేయుటకు, ముఖ సహస్రమ్=వేయి ముఖములు, మమ=నాకు, న చ భవతి=లేవు, కిన్తు=కాని, సకృత్=ఒకసారి, భవన్నామ=నీ పేరును, (అహమ్=నేను), బ్రూయామ్=పలుక గలను,ఇన్దుస్థితమ్=చంద్రునియందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుని, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! సచ్చిదానందరూపమగు నీ తత్త్వమును తెలిసి కొనుటకు నాకు శివుని వలె జ్ఞానాగ్ని స్వరూపమైన మూడవ కన్ను లేదు. (అనగా పరమేశ్వరుడు మాత్రమే నీ స్వరూపమును తెలిసికొనగలడు. నేను పరమేశ్వరుడను కాను. కాన నీ స్వరూపమును తెలిసికొనలేనని భావము.) నీ రూపమును ధ్యానించుటకు బ్రహ్మవలె నేను నీ బొడ్డుయందు నివసించుట లేదు. (ధ్యానము చేయవలెనన్న ఒకసారియైనను నీ రూపమును చూడవలెను. బ్రహ్మ నిరంతరము నీ బొడ్డునందు నివసించి నిన్ను చూచుచుండును కాన బాగుగ ధ్యానము చేయ గలడు. నేను బ్రహ్మను కాను కనుక అట్లు ధ్యానము చేయలేను అని భావము.) నీ గుణములను పొగడుటకు ఆదిశేషుని వలె నాకు వేయి ముఖములు లేవు. (నీ సద్గుణములను స్తోత్రము చేయవలెనన్న వేయితలలు కల ఆదిశేషుడు మాత్రమే సమర్థుడు. ఒక తల కల నావంటి వాడు సమర్థుడు కాదు అని భావము.) నాకు చేతనైనది నీ నామస్మరణ మాత్రమే. అదియును ఒక్కసారి మాత్రమే చేయగలను.

**– మనస్సమర్పణ –**

**శ్లో॥ మహా సంసారాబ్ధి ప్రపతిత మనూద్ధారణ ఝష**
**ధ్వజాఙ్కే పాదాబ్జే తవ విశతు మచ్చిత్త మధుపః।**
**నఖార్ధ త్విడ్రేఖా కపట మృదు రజ్జ్వోపనయతా**
**త్త మేతం త్వాం దేవం హయవదన మిన్దుస్థిత మయే॥ 98**

**ప్రతిపదార్థము:–** మచ్చిత్తమధుపః=నా యొక్క మనస్సు అనెడి తుమ్మెద, మహా...... ధ్వజాంకే – మహా=గొప్పదియైన, సంసార+అబ్ధి=సంసారము అనెడి సాగరము నందు, ప్రపతిత=పడిపోయిన, మను=మానవులను, ఉద్ధారణ=ఉద్ధరింపజేయగల, ఝష=చేప, ధ్వజ=టెక్కెము, అంకే=గురుతుగా కల, తవ=నీ యొక్క, పాదాబ్జే=పాద పద్మమునందు, విశతు=ప్రవేశించుగాక!, తమ్=సంసార సాగరమునందు పడిపోయి

పరవశము, అచేతనము ఐన, ఏతమ్=ఈ నా మనస్సు అనెడి తుమ్మెదను, నఖ=కాలి గోరు అనెడి, ఆర్ద్రత్విట్=చంద్రుని యొక్క, రేఖా=కిరణము, కపట=నెపముగా కల, మృదు=మెత్తనైన, రజ్జ్వా=తాడుతో, ఉపనయతాత్=నీ పాదాబ్జమునందు చేర్చుము, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు ఉన్నటువంటి, హయవదనం దేవమ్=హయగ్రీవ దేవుడవగు, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=పొందుచున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీ పాదముల యందు మత్స్యరేఖ, ధ్వజరేఖయును కలదు. సాముద్రిక శాస్త్రముననుసరించి అట్టి రేఖ కలిగినవారు మాత్రమే సంసార సాగరమునందు పడిపోయిన వారిని ఉద్ధరించగల సమర్థులు. అటువంటి రేఖలు కలిగిన నీ పాదపద్మమునందు నా యొక్క మనస్సు అనెడి తుమ్మెద ప్రవేశించుగాక! లేదా సంసార సాగరమునందు పడిపోయి పరవశము అచేతనము అయి అందు తిరుగాడుచున్న నా మనస్సు అనెడి తుమ్మెదను నీ నఖ చంద్రకిరణము అనెడి సున్నితమైన త్రాటితో బంధించి నీ పదసమీపములకు నీవే చేర్చికొనుము.

**– జ్ఞానప్రసాద వర్ణన –**

**శ్లో॥ ప్రసన్నాస్యం ప్రజ్ఞా కుముదముకుళోద్భేదకరణ**
**స్ఫుర ద్ధాస జ్యోత్స్నామృతరస సమాప్యాయిత జనమ్।**
**మణీ తారా పుష్పస్రగయుత శుభోరః పరిపతత్**
**ద్విరేఫ ప్రస్తారం హయవదన మిన్దుస్థిత మయే॥ 99**

**ప్రతిపదార్థము:–** ప్రసన్నాస్యమ్=ప్రసన్నమైన ముఖము కలవాడను, ప్రజ్ఞా...జనమ్ – ప్రజ్ఞా=జ్ఞానము అనెడి, కుముదముకుళ=కలువ యొక్క మొగ్గను, ఉద్భేదకరణ=వికసింపజేయు, స్ఫురత్=ప్రకాశించు, హాస=నవ్వుఅనెడి, జ్యోత్స్నా=వెన్నెల యొక్క, అమృతరస=అమృత రసము చేత, సమాప్యాయిత=ఆనందింపజేయబడిన, జనమ్=భక్తజనులు కలవాడును, మణీ....ప్రస్తారమ్–మణీ=మణులయొక్కయు, తార తమ్యముల యొక్కయు, పుష్ప=పూవులయొక్కయు, స్రగయుత =వేలకొలది మాలలతో, శుభే=మనోహరమైన, ఉరః=వక్షస్థలమునందు, పరిపతత్= పడుచున్న, ద్విరేఫ=తుమ్మెదల యొక్క, ప్రస్తారమ్=సమూహము కలవాడును, ఇన్దుస్థితమ్ =చన్ద్రునియందు ఉన్నవాడును అగు, హయవదనమ్= హయగ్రీవుని, (అహమ్= నేను), అయే=పొందుచున్నాను.



**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! నీవు ప్రసన్నమైన ముఖము కలిగినవాడవు. అట్టి నీ ముఖము నందు భాసించు చిరునగవు అనెడి వెన్నెల జ్ఞానము అనెడి కలువ మొగ్గను వికసింపజేయు సామర్థ్యము కలిగినటువంటిది. అటువంటి వెన్నెలనుండి వచ్చు అమృతరసముతో నీవు భక్తజనులను ఆనందింపజేసెదవు. శుభప్రదమైన నీ వక్షఃస్థలమునందు వేలకొలది రత్నమాలలు, ముత్యముల మాలలు, పుష్పమాలలు ఉండును. అట్టి నీ వక్షఃస్థలమునందు లక్ష్మీదేవి యొక్క కటాక్షసమూహము అనెడి తుమ్మెదల సమూహము నిత్యము తిరుగాడు చుండును. అటువంటి నిన్ను నేను తాదాత్మ్యముగ పొందుచున్నాను.

**విశేషములు:–** ఈ శ్లోకములో ద్విరేఫ పదమునకు రెండు రేఫలు కలిగినది అని అర్థము. భ్రమరము అను పదములో రెండు రేఫలు ఉండుటచే అది ద్విరేఫ మగును. రామరాయ కవి అను కవి నామధేయములో కూడ రెండు రేఫలు ఉండుటచే కవి కూడ ద్విరేఫము అగును. కవిచే రచింపబడిన గ్రంథములు ద్విరేఫప్రస్తారము అగును. అవి అన్నియును హయగ్రీవుని హృదయమునందు సంచరించుట అనగా వాటిని హయగ్రీవునకు సమర్పించుచున్నాడని భావము. పూర్వశ్లోకమునందు తన మనస్సునే భ్రమరముగా చెప్పుట వలన మనోగతమైన వృత్తిజ్ఞానము లన్నియు ఆయన గ్రంథమునందు ప్రతిపాద్యమైన బ్రహ్మా భేదాకారములు. వాటిని జ్ఞాన బ్రహ్మస్వరూపుడైన ఆయన యందు లయము చేయుచున్నాడు. అనగా అన్తరంగ సమర్పణారూప పరిత్యాగము వలన హయగ్రీవా భేదము సిద్ధించినది. ఈ గ్రన్థమునందు చెప్పబడిన హయగ్రీవాద్వైతము కూడ ఇచట సమన్వయింపబడినది.

**– శతక నివేదన –**

**శ్లో॥ భవల్లీలాపాఙ్గ స్రుత నవ సుధాప్లావ వివశ**
**త్వదీయాస్య భ్రష్టం ప్రలపిత శతమ్ కేవల మయ।**
**శబర్యా ఉచ్ఛిష్టం ఫలమివ కియన్తం రస మిదమ్**
**ప్రదత్తే వా తే త్వాం హయవదన మిన్దుస్థిత మయే॥ 100**

**ప్రతిపదార్థము:–**(అశ్వానన!=ఓ హయగ్రీవా!), భవత్=నీ యొక్క, లీలా=విలాసములతో కూడిన, అపాంగ=కడకన్నుల నుండి, స్రుత=స్రవించిన, నవ=నూతనమైన, సుధా= అమృతముతో, ఆప్లావ=స్నానముచేయుట చేత, వివశ=

ఆనందపరవశుడనైన, త్వదీయ=నీ వాడనైనటువంటి నా యొక్క, ఆస్య= ముఖము నుండి, భ్రష్టమ్=జారిన, ప్రలపిత= వాగుడుల యొక్క, శతమ్=వందను, కేవలమ్ =అర్థ విచారములేక కేవల శబ్దములను, అయ=స్వీకరించుము, ఇదమ్=నా నోటి నుండి వచ్చిన ఈ వంద శ్లోకములు, శబర్యాః=శబరి యొక్క, ఉచ్ఛిష్టం ఫలం ఇవ=నోటి నుండి వచ్చిన ఎంగిలిపండువలె, కియన్తమ్=కొద్దిపాటి ఐనను, రసమ్=ఆనందమును, తే=నీకు, ప్రదత్తే వా=ఇచ్చునా!, ఇన్దుస్థితమ్=చన్ద్రుని యందు ఉన్న, హయవదనమ్=హయగ్రీవుడవైన, త్వామ్=నిన్ను, (అహమ్=నేను), అయే=పొందు చున్నాను.

**తాత్పర్యము:–** ఓ హయగ్రీవా! విలాసములతో కూడిన నీ కడకన్నుల నుండి స్రవించిన కరుణారూపమగు అమృతముతో నేను సాన్నము చేసితిని. ఆ అమృతస్నానముతో ఆనందపరవశుడనై ఒడలుమరచిన నా నోటి నుండి ఈ నూరు శ్లోకములు వచ్చినవి. ఆ శ్లోకములను అర్థవిచారము చేసి గుణదోషము లెంచక కేవలము నా వాగుడులుగా భావించి శబ్దములను మాత్రమే స్వీకరించుము. ఎందువలన ననగా నేను నీవాడను. కుమారుడు మాట్లాడు మాటలు అపభ్రష్టములు, నీరసములు ఐనను ఆ మాటలు తండ్రికి ఆనందము కలిగించుట లేదా! నీవు రామావతారమునందు నీ భక్తురాలైన శబరి రుచి చూసి ఇచ్చిన ఎంగిలి పండ్లను సైతము తిని ఆనందమును పొందితివి. శబరి ఇచ్చిన ఎంగిలి పండ్లవలె నా నోటినుండి వచ్చిన ఈ నూరు శ్లోకములు కొద్దిపాటి ఆనందమునైన నీకు తప్పక కలిగించును. ఓ హయగ్రీవా! నీలో నేను ఐక్యము అగుచున్నాను.






# శ్లోకానుక్రమణికా

అపి–26
అపూర్వాత్మా–27
అవిద్యా–77
అహో–8
అహమ్–88
ఇదమ్–73
ఇమామ్–9
ఇయమ్–11
ఉపాధీనామ్–83
కటాక్షః–65
కథాశేషమ్–69
కపిః–70
కరాంభోజ–48
కిరీటాధో–55
కిరీటాన్తః–56
కృశోహమ్–89
జగత్–28
ఝషాత్–68
తదేవమ్–75
తమిస్రమ్–60
తవాక్షి–72
తవోరః–33
త్వదీయ–7
త్వ–విలుఠత్–6
త్వదీయానామ్–44
త్వమీశః–82
ద్విరేఫ–45
ద్విమూర్త్యో–54
నఖార్కోస్ర–20
న జీవో–86
నటత్–18
న తే–57
న దేహో ఽ హం–87
నమత్–19
నమద్దేవీ–17
న వక్తా–90
పదాంభోజ–21
పయః–2
పయోమ్బో–23
పురా–47
ప్రభో–46, 93
ప్రభో–మమీ–94
ప్రసన్నాస్యమ్–99
ప్రహీర–53
బుధ–43
బృహత్త్వమ్–81
భవత్–97
భవ–త్రిభువనమ్–14
భవ–రుచిః–15
భవద్వార్తా–66
భవన్నాసా–71
భవల్లీలా–100
భవాన్–80
మణీ–37
మహాకల్పే–74
మహాభోగ్య–39
మహాయోగీ–85
మహాసంసార–98
మహేన్ద్ర–29
ముఖాఞ్చత్–49
యథా–78
యదీయ–5
యది–67
రజః–64
రద–50
రమా–ఝరీ–13
రమా–మయ–59
రమా–సుషమా–58
రవీన్దుభ్యామ్–63
రుచిస్తే–10
లయే–76
లసత్–25
విధాతృ–62
విభో–12
విభో–తనోః–42
విరించ–24
శిరోజ–61
శ్రియమ్–36
శ్రియః–34
సచిత్తమ్–4
సదా–91
సమఞ్చః–52
సమాంస–38
సహస్రార–40
సహస్రాంశు–41
సహోజ్మమ్–32
సితామ్భోజౌ–16
సుధీ–31
సువర్ణాద్రి–22
స్తన–35
స్వతో–3
స్వతః–1
స్మృతా–95
స్వతన్త్రస్య–84
స్వశోభా–30
హృత్–51
హయగ్రీవ–96
హయస్య–92
హరే–79

